# ఆచార్య వినోబా

రచన :
జోస్యుల సూర్యనారాయణమూర్తి



ప్రచురణ :
గాంధేయ సమాజ సేవా సంస్థ
గాంధీక్షేత్రం, అవనిగడ్డ - 521 123
గాంధీ సాహిత్య ప్రచురణాలయం
సుల్తాన్ బజార్, హైదరాబాద్ - 500 001

ప్రథమ ముద్రణ

జనవరి 1984

1000 కాపీలు

గాంధేయ సమాజ సేవాసంస్థ

అవనిగడ్డ

4వ ప్రచురణ

గాంధీ సాహిత్య ప్రచురణాలయం

141వ ప్రచురణ

వెల : రూ. [illegible] -

ముద్రణ :

రూత్-డైక్‌మన్ ప్రింటింగ్ ప్రెస్,

గాంధీక్షేత్రం, అవనిగడ్డ - 521 123.

# పరిచయం

శ్రీ జోశ్యుల సూర్యనారాయణమూర్తిగారు రచించిన "ఆచార్య వినోబా", గాంధేయ సమాజ సేవాసంస్థ, గాంధీ సాహిత్య ప్రచురణాలయం, సంయుక్తంగా ప్రచురించటం, చాలా ముదావహమైనవిషయం. శ్రీ సూర్యనారాయణ మూర్తిగారు వినోబా చరిత్రను చాలా వివరంగా రచించారు. కేవలం ఆయన జీవితవృత్తాంతంతోనే సంతృప్తిపడకుండా అయన చేపట్టిన ఉద్యమ వివరాలను వివిధసందర్భాలలో ఆయన చేసిన ప్రవచనాలను, విశదీకరించారు. ఈవిధంగా ఆంధ్ర పాఠక లోకానికి వినోబా జీవితాన్ని గురించిన సరిఅయిన అవగాహన ఏర్పడటానికి అవకాశం కలుగచేశారు శ్రీ సూర్యనారాయణ మూర్తిగారు.

వినోబాజీ ఆయన సోదరులు ఆజన్మ బ్రహ్మచారులు. కఠోరమైన సాధనలో యావజ్జీవితాన్ని గడిపారు. నిజానికి వారు ముగ్గురు ఈ యుగపు మహాఋషులని చెప్పవచ్చు, బహుళ సమాధిమధ్యలో ఉండి కఠోరమైన నియమనిష్ఠలతో తపస్సు చేయడం, ఒక అపురూపమైన సన్నివేశమని చెప్పవచ్చును. వారిదృష్టిలో ఐహికాముష్మికాలమధ్య తేడా ఏమీలేదు. రెండూ సమానమైన ప్రాధాన్యతగల విషయాలు. నిజానికి ఐహికా ముష్మికాలు రెండు వేరువేరుకావు. నాణానికి బొమ్మ బొరుసువలె నిత్యజీవితంలో విడదీయరాని రెండు భాగాలు. స్వీయముక్తి కొరకు ఏ హిమాలయాలకో, ఏ మహారణ్యాలకో

వెళ్ళి సమాజంతో సంబంధంలేని తపస్సులో నిమగ్నం కావడం ఒక ఎత్తు. సంఘం మధ్యనఉండి తన వృత్తికన్నా తోటిమానవుల శ్రేయస్సుకు ప్రాధాన్యతఇస్తూ, ఆధ్యాత్మిక సాధనను వదిలివేయకుండా నిరంతర తపస్సులో జీవితాన్ని గడపడం మరొక ఎత్తు. రెండోవిధంగా జీవితాన్ని కొనసాగించడం కత్తిమీద సాములాంటిది.—ఈ విధమైన జీవితంలో సఫలీకృతుడైనాడు వినోబాజీ.

ఈ పుస్తకం వినోబాజీ సమగ్రజీవితాన్ని వివరిస్తున్నదని, చెప్పనుకాని, వినోబాజీని గురించిన చక్కని పరిచయాన్ని కలుగజేస్తుంది. ఈ కృషికి శ్రీ సూర్యనారాయణమూర్తిగారు ఎంతయినా అభినందనీయులు. వీరు తమ ఈరచనావ్యాసంగాన్ని ఇంకా కొనసాగించి అనేకమంది దేశారాధకుల జీవితచరిత్రలను ఆంధ్రలోకానికి అందిస్తారని ఆశిస్తున్నాము. ఈ పుస్తక ప్రచురణకు పూనుకొన్న గాంధేయ సమాజ సేవాసంస్థ, మరియు గాంధీ సాహిత్య ప్రచురణాలయాలకు, నా ప్రశంసలనందచేస్తున్నాను. ఈ ప్రయత్నంలో ముఖ్యంగా ప్రశంసించదగిన వ్యక్తి చి॥ మండలి బుద్ధప్రసాద్. ఆయన ముమ్ముందు ఇట్టి అనేక ప్రచురణలను తీసుకువస్తాడని ఆశిస్తున్నాను. ఈ పుస్తకం పాఠకుల ఆదరాభిమానాలను చూరగొనగలదని ఆశిస్తున్నాను.

హైదరాబాద్,
3—2—84.

ఇట్లు,
కోదాటి నారాయణరావు

# అభినందన

అపారమైన ఆధ్యాత్మిక శక్తిగల ఈ శతాబ్దపు భారతీయ ప్రజా నాయకుల్లో మహాత్మాగాంధీ తరువాత మనకు జ్ఞాపకంవచ్చేది వినోబాజీ. గాంధీజీవలెనే వినోబాజీ పదవులాశించలేదు. ఆయన జీవితమంతా దీనజనోద్ధరణలో గడిచింది. రాష్ట్రపతి నుంచి రైతన్నదాకా ఆయన దర్శనం, ఆశీస్సులు కోరుకునేవారు. తెలంగాణాలో భూదానోద్యమాన్ని ప్రారంభించి అఖిలభారతానికి వ్యాపింపజేసిన మహావ్యక్తి వినోబాజీ.

ఆయన జీవిత చరిత్రనూ, ఆయన ఆధ్యాత్మిక నైతికభావనలను, ఆయన తాత్వికచింతనను సామాన్య పాఠకునికి సుగమంగా వుండేరీతిని శ్రీ జోస్యుల సూర్యనారాయణమూర్తిగారు రచించారు. ఈ గ్రంథం చదివిన ప్రతి పాఠకుని హృదయం మీద వినోబాజీ బోధనల ప్రభావం పడుతుంది. ఇలాంటి చక్కని గ్రంథాన్ని ప్రచురించిన గాంధేయ సమాజ సేవా సంస్థ, గాంధీక్షేత్రం అవనిగడ్డ, గాంధీ సాహిత్య ప్రచురణాలయం హైదరాబాద్ వారికి ధన్యవాదాలు.

పౌనార్ ఆశ్రమం పూర్వ ఋష్యాశ్రమాలవలె అతిపవిత్రమైనది. అది శాంతికాములకు, నైతికవాదులకు యాత్రాస్థలం.

భారతదేశ చరిత్రలో పూజ్య వినోబాజీ జీవితం సువర్ణాక్షరాలతో లిఖించదగినది. హింసపెచ్చు పెరిగిపోతున్న ఈ లోకంలో ఆ అహింసా మూర్తిని గురించి అందరూ తెలుసుకోవాలి. అందుకు ఈ గ్రంథం తోడ్పడుతుంది. సత్యాహింసలపై ఆధారపడిన సర్వోదయ సమాజ సాధనకు అనుక్షణం కృషిచేసిన ఆ మహావ్యక్తి జీవితకధనూ, ఆయన బోధనలను ఈ గ్రంథ రూపంగా తెలియజేసిన రచయిత, ప్రచురించిన సంస్థలవారు ధన్యులు.

నైతికోన్నతి ఒకటే మానవ సమాజాన్ని కాపాడగలదు.

ఓమ్ తత్ సత్

హైదరాబాద్, 
8—1—1984.

కళాప్రపూర్ణ 
డాక్టర్ దాశరథి.

# ప్రేరణ

ఆచార్య వినోబాభావే మహావిద్వాంసుడు బహుభాషా వేత్త మహత్తర సేవా జీవనం సాగించే ఒక సాధుపుంగవుడు అని చిన్నప్పుడే నాకొక అభిప్రాయం ఏర్పడింది. గాంధీజీ తుది రోజుల్లో హరిజన్ పత్రిక తెప్పించుకొని బాపూ సంపాదకీయాలు ఇతర భావాలు అవగాహన చేసుకోటానికి ప్రయత్నం చేసే నాడు, నా దృష్టిలో వినోబాపడలేదు. ఆయన్ని ప్రథమ సత్యాగ్రహిగా బాపూ నిశ్చయించి లోకానికి చూపేదాకా చాల మంది భారతీయులే ఆయన్నెరగరన్నది సత్యదూరం కాదు. బాపూచేత తీర్చిదిద్దబడిన జీవనంతో భావే బాబా అయ్యారు. ప్రత్యేక స్వీయం వ్యక్తిత్వంతో ప్రకాశించిన భావేజీ భూదాన యాత్రా సందర్భంలోను హిందీ ప్రచారసభ—ఆంధ్రశాఖ నిర్వహించిన (ఏలూరు) సభల సందర్భంలోను ఆంధ్రదేశం వచ్చినప్పుడు ఆయన వాక్కు ఆదర్శజీవనం నన్నాకర్షించాయి.

అటుపైన ఆయన మాటలు పత్రికలలో గమనిస్తూ ఉండటం అలవాటయింది. దక్షిణభారత హిందీ ప్రచారసభ (మద్రాసు) స్నాతకోత్సవంలో (1948) ఆచార్య వినోబాభావే చేతితో ఇచ్చిన రాష్ట్రభాషా విశారద సర్టిఫికేట్ ఆయన సందేశంతోబాటుగా అందుకోవటమే కాక ఏకలిపివాదం వివరిస్తూ నాగరిలిపి భారతీయ భాషలన్నిటికీ (కామన్ స్క్రిప్ట్) ఒకటే ఉండాలనే విషయాన్ని ఒక క్లాసుతీసికొని స్నాతకులమైన మాకు ప్రత్యేకించిచెప్పిన ఒకపాఠం కూడ వినటం నాకు కలిగిన అదృష్టం.

మహానుభావుడైన భావేజీని 23–1–82న చి॥ మండలి బుద్ధప్రసాద్, గాంధీ గురుకులాధ్యాపకులైన శ్రీ ఎమ్. రామచంద్రరావుగార్లతో కలిసివెళ్ళి పౌనార్‌లో సందర్శించటం, గాంధీ క్షేత్రానికి బాబా శుభకామన (స్వయంగా వ్రాసియిచ్చింది) అందుకోవటం జరిగింది. ఆ సందర్భంలో బాబా మాతో తెలుగులో "ఆంధ్రులు శూరులుగదా!" అని కాస్సేపు ఆగి నవ్వుతూ "ఆరంభశూరులు" అన్నారు. మేము అట్లాకాకుండ ఉండేలాగ దీవించమని అడగటం ఆయన "మరనేతక్ శూర్ బనో, మరనే కేబాద్ భీ శూర్ బనో" (మరణించేవరకు శూరులవండి మరణించిన తర్వాతకూడ శూరులవండి) అని ఉత్తేజపరచటం జరిగింది.

భావేజీని సందర్శించాలనే తన అభిలాష నాలుగైదుసార్లు నాదగ్గఱ వ్యక్తంచేసినవ్యక్తి చి॥ మండలి బుద్ధప్రసాద్ కోరిక ఫలించి వర్ధాలో జరిగిన ఒక కాన్ఫరెన్సు సందర్భంగా గాంధీక్షేత్రంనుంచి మేము ముగ్గురం వెళ్ళటం జరిగినమీదట చి॥ బుద్ధప్రసాద్‌మీద భావేజీ ప్రభావం బాగా పడింది. ఆయన జీవిత చరిత్రని ఆధునిక యువలోకానికి ఆదర్శప్రాయంగా అందించాలనే అభిలాష ఉద్భవించి వృద్ధిపొందింది. అందువలన నన్ను ప్రోత్సహించి యీ చిరంజీవి నాచేత ఈ పుస్తకం వ్రాయించటం జరిగింది. అసలు కొంతలో కొంతైనా భావేజీ చెప్పిన ఆరంభశూరత్వం నాకున్న సంగతి నాకు తెలుసు. అలసటలేకుండా అనేక పర్యాయాలు జ్ఞాపకంచేస్తూ రచనకు కావలసిన వస్తుసామగ్రి సమాచార సంభారం అదేపనిగా అందిస్తూ కూడాపడి నాచేత కలంపట్టించి ఈ వ్రాతవ్రాయించిన

చి॥ బుద్ధప్రసాదుకే, దీనివల్లకలిగే శ్రేయస్సేదైనా ఉంటే ఎక్కుతుంది. అతడు ముఖ్యకారకుడు. అనుకున్నపని నెరవేరే దాకా పట్టుదల విడని ప్రశాంత స్వభావం కలవాడు. అతనిచేత కొన్నిమాటలనిపించి అతనికీపుస్తకం అందిద్దామనుకొన్న నా కోరికను వెనక్కినెట్టి తాను తెరవెనుకఉండి ఇంతపనిచేయించిన చి॥ బుద్ధప్రసాద్‌ను నే నేమనగలను? సకలశ్రేయస్సంభారంతో యువతరానికి మార్గదర్శకుడు కావలసిందని ఆశీర్వదిస్తున్నాను–

ఈ గ్రంథరచనకు తోడ్పడ్డ సాహితీ సంపదకీ తత్స్రష్టలకీ కృతజ్ఞతాంజలితో ఇది పాఠకుల చేతుల్లో పెడుతున్నాను. ఇది మిమ్మల్ని చదవనిస్తే అంతే చాలు–

జో. సూ. మూర్తి

---

# పూజ్య శివాజీభావే శుభాకాంక్ష

ఆదరణీయ ప్రియ జయసింహగారు వినిపింపగా తెలుగులో జోశ్యుల సూర్యనారాయణమూర్తిగారు రచించిన "ఆచార్యవినోబా" అనే పుస్తకంవిని వివరం తెలుసుకో గలిగాను. ఈ విధంగా వారు అనేక రచనలతో పురోగమిస్తారని ప్రగతి సాధిస్తారని ఆశిస్తూ నా సంపూర్ణ శుభాకాంక్ష నందిస్తున్నాను.

శివాజీ-న-భావే

బ్ర. వి. మందిర్ పవనార్ - వార్ధా

15—11—83

వినోబా ప్రథమ వర్ధంతి

శ్రీరామాయనమః

# ఆచార్య వినోబా

అజ్ఞానకానన వినాశనహవ్యవాహః
సిద్ధిప్రదః సకలకార్య కృతిప్రపంచే।
ఉత్సాహవర్ధక సమస్తగణాధినాథః
కుర్యాత్కృతిం సహృదయ ప్రియతాప్రసిద్ధాం॥

వాణీవిలాస చతురా ప్రథిత ప్రసన్నా
భావేమహర్షిచరిత ప్రమితి ప్రపూర్ణా।
వాణీ మదీయ రసనోద్గతరమ్యవర్ణా
భూయాత్సమాజ పునరుద్ధరణ ప్రకీర్ణా॥

బ్రాహ్మీరూపం బ్రహ్మతేజః ప్రపూర్ణం
భూదానోద్యగ్బ్రహ్మ విద్యాప్రబోధం
భావే మౌనిం గాంధిమార్గే ప్రదీప్తం
వందే భక్త్యాతత్కథాజ్ఞానమాప్తం॥

# నిర్మాణ కర్మయోగి

"గ్రామే గ్రామే సభాకార్యా, గేహే గేహే శుభా కథా।
పాఠశాలా మల్లశాలా గవాంసదన మేవచ॥"

అన్న పండిత మదన మోహన మాలవ్యా మాటల ప్రకారం— ఊరూరా సభ, ఇంటింటా శుభం, పాఠశాల, వ్యాయామశాల, గోశాల కావాలనే భావంతో అభినవ భారత నిర్మాణ కార్యక్రమంలో జీవితం వ్యయపరచిన మహానుభావుడు ఆచార్య వినోబా భావే. ఇటువంటి సర్వవ్యాపకంగా ఆమృషి దివ్యాత్మ మార్గదర్శకమై మనని నడిపించగలిగే ఊతం ప్రసాదిస్తే మన మదృష్టవంతుల మన్న మాట.

వేదాంత విజ్ఞాన విశ్వాసాల్ని శాంతిసమృద్ధుల నిరంతర స్రోతస్సుగా భావించే వినోబాభావే— సంఘసంస్కర్త, విప్లవ కారుడు, దేశభక్తుడు, గోసేవకుడు, ఋషి, కృషిరహస్యజ్ఞుడు, భూదాన మూలస్తంభం, గ్రామోద్యోగ ప్రధాని, అహింసాత్మక విప్లవజనకుడు, విశ్వబంధువు, స్వయంసేవక మిత్రుడూను. "యాదృశీ భావనా యత్ర సిద్ధిర్భవతి తాదృశీ" అన్నట్టు "యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహం" అని భగవానుడు చెప్పినట్టు, భావించే వారి భావనాశక్తికి తగినట్టుగా భావేజీ "సహస్రశీర్షా పురుష స్సహస్రాక్ష స్సహస్రపాత్"గా

దర్శనమిస్తాడు. అయితే ఆ విరాట్రూపాన్ని దర్శించటానికి తగిన మనోనేత్రం తెరవాలి. మహాప్రకాశం దర్శించగల ప్రభావం సంతరించుకోగల సులోచనాలు కావాలి.

## భీష్మసామ్యము :-

భారత దేశంలో ఒకనాడు భీష్ముడు- ఈనాడు వినోబా భావే కొన్ని భేదాలతో సాదృశ్యంగల పురాణ పురుషులు. భీష్ముడు శంతను పుత్రుడైన దేవవ్రతుడు. తన తండ్రి సంతాన కాంక్ష నెరవేర్చటానికి తాను బ్రహ్మచర్యం యావజ్జీవం పాటిస్తానని భీష్మ ప్రతిజ్ఞ చేసి సత్యవ్రతుడైన దేవవ్రతుడు భీష్ముడయ్యాడు. నిజరాజ్య పరిత్యాగం బ్రహ్మచర్యవ్రత పరిగ్రహం చేసిన తనకు అనపత్యత కలిగినప్పటికీ "లోకములాయతి బెక్కులుగలవు నాకు ననుభావ్యములై" అని భావించిన బ్రహ్మజ్ఞుడు భీష్ముడు. గృహస్థ జీవనం సర్వసాధారణమైనప్పటికీ, బ్రహ్మచర్యం మోక్షప్రదమేకాని నిరయోపాయం తొలగించలేనిదె మాత్రంకాదు. ఆది శంకరుల ఆదర్శం మనకి శిరోధార్యమన్నమాట సముచితం కాకపోదు. కాని ఆ భావన అందరికీ కలగదు. ఆ ఘోరనైష్ఠికవ్రత పరిపాలన అంత సులభమూ కాదు. వినాయక నరహరిబావే "వినోబా"కి మాత్రమూ ఆదర్శం చిన్నతనంలోనే అభిరుచించింది. అనంతరం అదె సులభసాధ్యమే అయింది. భీష్ముడికి ఒక సన్నివేశం, ఒక సంఘటన, కారణమై ఒక త్యాగం-యావజ్జీవం పాటించదగింది సంప్రాప్తమయింది. సంతోషంగా భోగత్యాగం చేసి జనకాదుల్ని తల

పిస్తూ ఒక విశిష్టమైన యోగాన్ని సాధించాడా సర్వధర్మమర్మజ్ఞుడు, తత్త్వజ్ఞుడు బ్రహ్మవేత్త అయిన రాజర్షి భీష్మపితామహుడు. పితృభక్తి కారణంగా పట్టిన అపూర్వమైన భీష్మప్రతిజ్ఞ అప్రతిమానమై అతిమానుషమై "స్వచ్ఛంద మరణం బుగా" తండ్రిచేత వరం ఇప్పించింది. ఇది లోకోత్తరమైన విషయం.

ఆది శంకరులు బ్రహ్మచర్యంలో నుంచి సన్యాసాశ్రమంలో ప్రవేశించాలనే ఆకాంక్షతో ఉన్నా తల్లి అనుమతిలేక పోవటంచేత అది దైవికంగా ఆపత్సన్యాసంగా కాని ఆయనకు సాధ్యపడలేదు. ఏ తల్లైనా తన సంతతి గృహస్థాశ్రమ స్వీకారం చేసి ధర్మజీవనంతో సత్సంతానాన్ని పొందాలని కాంక్షిస్తుంది. ఇది సాధారణ భారతీయ ధర్మం. ఆచారంకూడాను. అయినా బ్రహ్మచర్యానికీ తురీయాశ్రమానికీ కూడ తగినంత నిజానికి గృహస్థాశ్రమంకంటె ఎక్కువైన గౌరవం మన దేశంలో ఉంది. చాతుర్వర్ణ్య పద్ధతి అనవసరమనుకొన్న వారికి కూడా ఆశ్రమ చతుష్టయ పద్ధతి ఆక్షేపణీయంగా భాసించదనిపిస్తుంది.

వినోబాజీ తల్లి రుక్మిణీదేవి భక్తి భావనగల బ్రాహ్మణ మహిళ. వందల కొలది మహారాష్ట్ర భజనకీర్తన లామెకు కంఠస్థం. ఇంటి పనులు చేసుకొంటూనే సన్నంగా పాడుతూ ఉండేది. సంప్రదాయం కలిగిన బ్రాహ్మణ కుటుంబమైనా వినోబా తల్లిదండ్రులలో సంస్కార దృష్టి, ఒక ప్రత్యేక స్వతంత్ర ప్రవృత్తి ఉండేవి. ఆమె ప్రోత్సాహమే వినోబాకు ఆ జీవన బ్రహ్మచారియై ఉండాలనే ఊహకలిగించింది. ఆమె

అంటూ ఉండేదట- "వివాహంచేసికొని సదాచార సంపన్నంగా ఉండటంవల్ల కులం కీర్తి పెరుగుతుంది. కాని శుద్ధ బ్రహ్మ చారిగా ఉన్నవాడు కేవలం ఒక్కతరంకాదు నలభై రెండు తరాలను పవిత్రం చేస్తాడు." అని. తల్లియొక్క ఈ అసాధారణో పదేశంవల్ల పదిసంవత్సరాల వయస్సులోనే వినోబాకు తాను బ్రహ్మచారిగా ఉండాలనే సంకల్పం కలిగింది. అది దృఢ సంకల్పమయింది. జీవితాంతం ఆయన బ్రహ్మచారిగానే విల క్షణ తపశ్శక్తిని సంపాదించుకొన్నాడు. ఆయన అనుజులు "బాలకోబా", "శివాజీ"లు కూడ ఆయన మార్గాన్ననుసరిం చారు. ఫలితంగా ఆయన కుటుంబం బ్రహ్మచారి కుటుంబం గానే ఉండిపోయింది.

భారతీయ ధర్మశాస్త్రాల అనుశాసనాల కనుకూలంగా భావేజీ కఠోర బ్రహ్మచర్య వ్రతపాలనం చేశారు. ఉపని షత్తులు, యోగ, బ్రహ్మసూత్రాదులు ఆది శంకరుల భాష్య ప్రవచనాలతో సహా సమగ్రంగా అధ్యయనం చేసినతాను ఆధు నిక సమాజానికనుకూలంగా భగవద్గీతాబోధ కూలంకషంగా పొంది సమాజశ్రేయోదాయకంగా గీతాప్రవచనమూ, స్థిత ప్రజ్ఞదర్శనము చేసిన యోగిపుంగవుడయ్యాడు.

ఇప్పటికి వెలసిన అన్ని మతగ్రంథాలూ ఆయా మూల భాషలలో చదివి తెలిసికొని అవగాహనపొంది సర్వమత సమ భావం ఒంటబట్టించుకొన్న మహామేధావియై ఆది శంకర తుల్యత్వాన్ని సాధించాడు.

అహింసాతత్త్వం బుద్ధితోపాటు హృదయానికి కూడ పట్టించుకొన్నవిరాగియై బుద్ధసాదృశ్యాన్ని సంపన్నం చేసుకొన్నాడు. ఆపై నుంచి తల్లి నుండి సంక్రమించిన సహజ భక్తితత్త్వంతో సంభవించిన భగవద్భజన పరుడై "తుకారాం" వంటి సాధువులతో సమానత్వాన్నందుకొన్నాడు.

మళ్ళీ సందర్భానుగుణంగా భీష్మసామ్య విషయం పరిశీలిద్దాం.

---

## కలవారు - లేనివారు

ప్రజలు సామాన్యంగా కలవారనీ లేనివారనీ భావిస్తారు. కాని ఒకనాడు నాకు భగవంతుని దయవల్ల ప్రతివాడూ కలవాడేననీ ఈ ప్రపంచంలో లేనివాడంటూ లేడనీ తోచింది. కొందరికి పొలముంది. కొందరికైశ్వర్యం. కొందరికి పనిచేసే శక్తి, కొందరికి తెలివి, కొందరికి ప్రేమ ఉన్నాయి. ప్రతి వ్యక్తికీ ఏదో ఒకటుంది. కాని వారు తమకున్నదాన్ని ఇంటి నాల్గుగోడల మధ్యన ఉపయోగించుకోవటానికి దాచుకొంటున్నారు. ప్రేమకులోటులేదు. కాని అది ఇంటిలోపల బంధింపబడింది. బయట పోటీ తలయెత్తుతుంది. ప్రేమ అనేది యింటిలోనే బంధింపబడితే అది బలంగా ఎదగలేదు.

— వినోబా

---

# తొలి వెలుగు

వినోబాజీతో ప్రపంచానికి ప్రథమ పరిచయం పత్రికల ద్వారా 1940 అక్టోబరులో కలిగింది. వ్యక్తి సత్యాగ్రహోద్యమం ప్రారంభించదలచిన గాంధీజీ అన్ని దృక్పథాలతోను పరిశీలించి సద్గుణాలకు ప్రాధాన్యమిస్తూ ప్రథమ సత్యాగ్రహిగా వినోబాభావేను నిర్ణయించి ఆయన్ని గురించి ప్రపంచానికి వివరించారు. రెండవ వ్యక్తి పండిట్ జవాహర్‌లాల్ నెహ్రూ. ఆయన అప్పటికే లోకానికి పరిచితుడు. గాంధీజీ మాటల్లో ప్రథమ సత్యాగ్రహి యొక్క వ్యక్తిత్వం సువ్యక్తమైంది. అప్పటికి వినోబా పవనార్‌లో ఆశ్రమం స్థాపించుకొని స్వతంత్రంగా కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. బాపూజీ భావేజీ పేరు ప్రకటించేముందు (పవనార్ వెళ్ళి) ఆయన అనుమతి పొందారు. ఆ వృత్తాంతం ఇది:—

బాపూ—కాంగ్రెసు బ్రిటిష్ ప్రభుత్వంతో పోరాటం ప్రారంభించాలను కొంటోంది. దీని స్వరూపమూ, సమయమూ నిర్ణయించే భారం నామీద పెట్టింది. నేను ఇది వ్యక్తి సత్యాగ్రహ రూపంలో ప్రారంభం కావాలనీ, ప్రథమసత్యాగ్రహివి నీవు కావాలనీ భావిస్తున్నాను.

వినోబా వినయంగా—“మీ ఆజ్ఞ ప్రకారమే”

బాపూ— “కాని ఇందులో నీ అంగీకారం కూడ ఉండాలి కదా!”

భావే—చిత్తం

బాపూ—ఇక్కడ నీవు అనేకమైన ఆశ్రమ కార్యక్రమాల్లో లగ్నమై ఉన్నావు. వీటినుంచి విముక్తి పొందగలవని ఆశిస్తున్నాను.

భావే—వీటిభారం నా మనస్సుమీద ఏమీ లేదు. మీ ఆజ్ఞ యమ ధర్మరాజు ఆజ్ఞలాగ నాకు శిరోధార్యం. నే నిక్కడే ఈ క్షణమే సిద్ధంగా ఉన్నాను.

గాంధీజీ వెంటవెళ్లిన జమనాలాల్ బజాజ్, మహాదేవ దేశాయిగారలు ఈ అద్భుతమైన ఆజ్ఞాపాలన, ఆత్మసమర్పణ చూచి ఆశ్చర్యచకితులై పోయారు. కాని గాంధీజీకి మాత్ర మీ ఆశ ఉంది.

5-10-1940 తేదీని దేశానికి ప్రపంచానికి కూడ వినోబాను పరిచయంచేస్తూ గాంధిజీ విస్తృతమైన ప్రకటన చేశారు.

అది యిలా ఉంది—

"శ్రీ వినోబాభావే ఎవరు? మరెవ్వరినీ కాకుండ, నే నీయననే ఈ సత్యాగ్రహాని కెందుకెన్నుకొన్నాను? నేను భారత దేశానికి తిరిగివచ్చాక 1916 లో ఆయన కాలేజీ విడిచిపెట్టారు. ఆయన సంస్కృత పండితుడు. ఆశ్రమంలో మొదటినుంచీ ఉన్నారు. ఆశ్రమ సర్వ ప్రథమ సభ్యులలో ఆయనొకరు.

తన సంస్కృతాధ్యయనం కొనసాగించటానికి ఆయన ఒక సంవత్సరం సెలవుతీసికొని వెళ్లాడు. ఒక సంవత్సరం తర్వాత సరిగా అదేరోజున ఆశ్రమం విడిచి వెళ్లిన సమయానికే ఆశ్రమంలో ఏసూచనా లేకుండా మౌనంగా మళ్లీ ప్రవేశించాడు. ఆరోజుతో ఆయన సెలవు పూర్తయినదనే సంగతే నేను మరచిపోయాను. వంటచేయటం దగ్గఱనుంచి మురికి శుభ్రం చేయటందాకా ఆశ్రమంలో ప్రతిచిన్నపనీ ఆయన చేశాడు. ఆయన జ్ఞాపకశక్తి అద్భుతం, స్వభావసిద్ధంగా ఆయన విద్యార్థి. అయినా తన జీవితంలో అన్నిటికంటె ఎక్కువ భాగం నూలు వడకటంలో వినియోగించాడు. పైగా అందులో ఆయన సంపాదించిన నిపుణత చాల కొద్దిమందికే సాధ్యమయింది. నూలుతీయటం భారతదేశ ముఖ్యపరిశ్రమ అని ఆయన విశ్వాసం దేశంలో ప్రతి వ్యక్తి దీనిని చేపట్టాలి. దీనివల్ల పల్లెలలో ఉన్న పేదరికం దూరమవుతుందనీ, పల్లెలకు క్రొత్తజీవం పోయగల మనీ ఆయన నమ్ముతాడు. వినోబా జన్మతః అధ్యాపకుడు అందువల్ల చేతిపనులద్వారా విద్య నేర్పే విధానానికి వికాసం కలిగించటంలో ఆయన హిందూస్థానీ తాలిమీ సంఘానికి చెందిన శ్రీమతి ఆశాదేవి ఆర్యనాయకంకు చాలా సహాయం చేశారు. శ్రీ వినోబా నూలుతీయటాన్ని అసలైన చేతిపనిగా వివరిస్తూ ఒక పుస్తకంకూడ వ్రాశాడు. అది స్వతంత్ర రచన. నూలుతీయటంద్వారా బేసికె విద్యలో సంపూర్ణతను సాధించ వచ్చునని,పరిహాసం చేసేవాళ్లకుకూడ నిరూపించి చూపించాడు. తకిలీతో నూలుతీయుటంలో అయితే ఆయప విప్లవమే

తెచ్చాడు. దానిలో అణిగిఉన్న అన్నిశక్తుల్ని వెతికి వెలితీశాడు. ఆయన పొందినంతగా హిందూదేశంలో ఎవరూకూడ చేతితో నూలువడకటంలో సంపూర్ణత పొందలేదు.

ఆయన హృదయంలో అస్పృశ్యతా గంధం కూడలేదు. సాంప్రదాయిక సమైక్యంలో నాకున్నంత విశ్వాసం ఆయనకీ ఉంది. ఇస్లాం మతంలో ఉన్న మంచి విశేషాల్ని అవగతం చేసుకోవటానికి ఆయన ఒక సంవత్సరం "కురాన్‌షరీఫ్" యొక్క మూలాన్ని అరబ్బీలో అధ్యయనం చేశాడు. ఇందుకోసం ఆయన అరబ్బీ నేర్చుకొన్నాడు. మన పొరుగు మహమ్మదీయ సోదరులతో సజీవసంబంధం యేర్పరచుకొని ఉంచుకోవటానికిది అవసరమని ఆయన భావించాడు.

ఆయన దగ్గరున్న కార్యకర్తలు శిష్యులు ఆయన కనుసన్నతో ఏరకమైన బలిదానమైనా సరే చేయటానికి సిద్ధంగా ఉంటారు. ఒక యువకుడు తన జీవితాన్ని కుష్ఠరోగుల సేవకు అంకితం చేశాడు. అతన్నీపనికి తయారుచేసిన శ్రేయస్సు కీర్తి వినోబాకే దక్కుతుంది. ఔషధాల గురించి యేమీ తెలియక పోయినా తనపనిలో అచంచల శ్రద్ధఉండటంవల్ల కుష్ఠరోగ చికిత్స పూర్తిగా అర్థం చేసుకొన్నాడు. అతడు వారి సేవ నిమిత్తం అనేక చికిత్సాలయాలావిష్కరింప జేశాడు. అతని కృషి వల్ల వందలకొలది కుష్ఠరోగులు రోగవిముక్తులయ్యారు. ఈ మధ్యనే కుష్ఠరోగుల చికిత్స విషయంలో చిన్న పుస్తకం మరాఠీలో వ్రాశాడు.

వినోబా చాల సంవత్సరాలు "వార్ధా - మహిళా ఆశ్రమ్" సంచాలకేగా కూడ ఉన్నారు. దరిద్రనారాయణ సేవ యందున్న ప్రేమ ఆయన్ని వార్ధాజిల్లాలోని ఒక గ్రామానికి లాక్కు పోయింది. ఇప్పుడాయన వార్ధాకు అయిదు మైళ్ళ దూరంలో ఉన్న "పౌనార్" అనే ఊరువెళ్ళి ఉన్నాడు. అక్కడ నుంచి తాను తయారుచేసిన శిష్యులద్వారా గ్రామీణులతో సంపర్కం కలిగించుకొన్నాడు. హిందూ దేశానికి రాజనైతిక స్వాతంత్ర్యం అవసరమని ఆయన భావిస్తాడు. ఆయన పక్షపాతం లేని చరిత్ర విద్వాంసుడు. గ్రామీణ ప్రజలకు నిర్మాణాత్మక కార్యక్రమంలేనిదే స్వాతంత్ర్యం లభించదనీ ఆ కార్యక్రమానికి కేంద్రబిందువు ఖాదీ అనీ ఆయన విశ్వాసం.

రాటం అహింసకు మిక్కిలి ఉపయుక్తమైన బాహ్య చిహ్నమని ఆయన విశ్వాసం. అది ఆయన జీవితంలో ఒక అంగమే అయింది. ఆయన గతసత్యాగ్రహ సమరంలో క్రియాత్మకంగా పాల్గొన్నారు. ఆయన రాజకీయ వేదిక మీద ఎప్పుడూ ప్రజల ముందుకు రాలేదు. "వినయ పూర్వకమైన ఆజ్ఞోల్లంఘనం అను సంధానించటంలో శాంతమైన నిర్మాణ కార్యక్రమం మిక్కిలి ప్రభావశాలి అవుతుంది" అనే విశ్వాసం అనేక మంది మిత్రులకున్నట్టే ఆయనకూ ఉంది.

రాజకీయోపన్యాస ప్రవాహాలఖండంగాసాగే చోటకు వెళ్ళి ఇంకా ఉపన్యాసాలిచ్చే దానికంటే ఇదే ఎక్కువ ప్రభావం కల్గిస్తుందని ఆయన భావం. రాట్నం మీద హృదయపు

పూర్వక శ్రద్ధ చూపనిదే అహింసాత్మక ప్రతీకారం సంభవం కాదని ఆయనకు సంపూర్ణ విశ్వాసముంది,

యుద్ధమనేదే వినోబా అంగీకరించరు. కాని యుద్ధ మాత్రమంటే విరోధం లేక పోయినా ప్రస్తుతయుద్ధాల్లో చేరటం ఇష్టపడనివారి అంతరాత్మలని కూడ తన అంతరాత్మలాగే ఆయనాదరిస్తాడు.

అందువల్ల వినోబా రెండు దళాలకు ప్రతినిధి రూపంలో ఉన్నాడు. కేవలమూ ఇప్పటి ఈ యుద్ధాన్ని విరోధించే "ఒక" దళానికి మఱియుక ముఖ్యమైన ప్రతినిధిని ఎన్నుకోవటానికి నాకు అవసరం కలగవచ్చు.

హరిజనసేవక్
25_11_40

మో. క, గాంధీ

1916 లోనే వినోబా తండ్రిపేర బరోడాకు వ్రాసిన చిన్న ఉత్తరంలో బాపూజీ "మీ అబ్బాయి వినోబా నాదగ్గఱ ఉన్నాడు. ఈ చిన్నవయస్సులోనే యమనియమపాలన ఆయనకు వశమయింది. అవి పొందటానికి నేను ధైర్యంతో సంవత్సరాల తరబడి ప్రయాసపడవలసి వచ్చింది" అని వ్రాశారు. యువకుడైన ఈ ఆశ్రమ వాసికి (వినోబాకు) తాను వ్రాసిన లేఖలో బాపూ "నిన్ను నేనేపేరుతో పిలవాలో తెలియటం లేదు. నీ ప్రేమ, నడవడి నన్ను ముగ్ధుణ్ణి చేస్తున్నాయి" అన్నారు.

1923 లో వి నో బా నాగపూర్ జైల్లో ఉండగా 19-7-23 నాటి "యంగ్ ఇండియా"లో చక్రవర్తి రాజ గోపాలాచారిమహాదేవదేశాయిగారలువినోబాఆత్మౌన్నత్యాన్ని స్వాభావిక నమ్రతత్వాన్నే కాక ఆయన కఠినధర్మనిష్ఠ, ధార్మిక జ్ఞానం, ఆత్మసంయమం, అప్రతిమ తపశ్శక్తి మొ॥ గుణగణాల్ని ప్రశంసిస్తూ వ్రాశారు. అప్పుడు నాగపూర్ లో జరిగిన ప్రసిద్ధ మైన జండా సత్యాగ్రహంలో వినోబా అరెస్టయ్యారు.

ఆ తర్వాత వార్ధా పరిసరగ్రామాల్లో ఆయన సేవా కార్యక్రమాలు నిర్వహించారు. 1932 లో తన కార్య క్రమాలు వివరిస్తూ గాంధీజీకి లేఖ వ్రాసి ఆయన సలహా కోరితే దానికి జవాబుగా గాంధీజీ "కృతయుగీ వినోబా" అని సంబో ధిస్తూ" ఈ కార్యక్రమాన్ని గురించి ఏమైనా వ్రాయటమే అవసరమయితే నీవు పొందుతున్న అగ్నిపరీక్ష భూమికీ స్వర్గా నికీ మధ్య సోపానాలు నిర్మిస్తోందనాలి" అని, తర్వాత తన చేత్తో వ్రాసిన ఒక ఉత్తరంలో నీ ప్రేమ, శ్రద్ధ చూస్తూ ఉంటే నాకళ్లలోనుంచి ఆనందబాష్పాలు పొంగివస్తున్నాయి. ఈ ప్రేమ శ్రద్ధలకు నేనర్హుణ్ణో కాదో గాని దీనివల్ల నీకు తప్పక మహత్తర మైన శుభం కలుగుతుంది. మహాసేవకు నీవు హేతువవుతావు" అని వ్రాశారు.

వినోబా 1930 లో సత్యాగ్రహం చేసినా ప్రభుత్వ మాయన్ని అరెస్టుచెయ్యలేదు. 1932లో ఆయన్ని మహా రాష్ట్రలో "ధూలియా" జైలుకు పంపారు. అక్కడ ఆయన తనతోటి సోదరులకు ప్రతి ఆదివారము గీతాప్రవచనం వినిపిస్తూ

ఉండేవాడు. తర్వాత ఆ గీతాప్రవచనం వినిపిస్తూ ఉండేవాడు. తర్వాత ఆ "గీతా ప్రవచనం" భారతీయ భాషలన్నిటిలోనే కాక ఇంగ్లీషు సంస్కృతం, డానిష్, నేపాలీ భాషలలోనూ, ప్రచురింపబడింది. భగవద్గీతమీద వచ్చిన ఉత్తమ భాష్యాలలో ఒకటిగా నేడీ గీతాప్రవచనం పరిగణింపబడుతోంది. గత ఇరవై సంవత్సరాలుగా లక్షల ప్రతులు పాఠకుల చేతులలోకి వెళ్లటమే కాకుండ దాన్ని కొన్నవారు ప్రార్థనా ప్రవచనాల తరువాత సంతకం కోసం వినోబా ముందుంచితే ఆయన తనచేత్తో దాని మీద "నిత్యపఠనీయ" అని వ్రాసి సంతకం పెట్టటం జరిగింది. ఇటువంటి పద్ధతి కలిగిన పుస్తకం ఇదొక్కటే.

1940 అక్టోబరు 17 వ తేదీని వ్యక్తిగత సత్యాగ్రహం చేస్తూ వినోబా "ద్వితీయ ప్రపంచ సంగ్రామంలో ఏవిధంగానూ పాల్గొనవద్దని ప్రజలను ప్రబోధించారు. దానిమీదట మూడునెలల శిక్షవిధించి ఆయన్ని జైలుకు పంపారు. తర్వాత రెండవ సత్యాగ్రహి జవాహర్ లాల్ జీ కదా! ఆయన్ని సత్యాగ్రహం చెయ్యకముందే అరెస్టుచేసి నాలుగేళ్ల కఠినశిక్ష విధించారు. మూడునెలల తర్వాత వినోబా మళ్లీ సత్యాగ్రహించేస్తే ఈపట్టు ఆరునెలల శిక్షపడింది. మూడోసారి ఆయన్ని సంవత్సరం జైలుకి పంపారు. ఈ సమయంలోనే "స్వరాజ్యశాస్త్రం" అనే గ్రంథం రచించటం జరిగింది. రాజనీతినిగూర్చి వచ్చిన చాల తక్కువపుస్తకాల్లో ఈ గ్రంథం ఒకటి.

గాంధీజీ 1942 లో క్విట్ ఇండియా ఉద్యమం ప్రారంభించినపుడు మొదటిరోజునే వినోబా అరెస్టయ్యారు. మూడేళ్లు జైల్లో ఉన్నారు. మొదట వేలూరు సెంట్రల్ జైల్లోను, తర్వాత మధ్యప్రదేశ్ లో సివనీ జైలులోను.

1944 లో విడుదల కాగానే వినోబా పవనార్ ఆశ్రమానికిచేరి మళ్లీ తన నిర్మాణ కార్యక్రమాలలో నిమగ్నులయ్యారు. ఆ రోజులలో పౌనార్ కు నాల్గుమైళ్లలో ఉన్న "సురగాం"లో మురికి తొలగించి శుభ్రంచేసే పనిచేస్తూ ఉండేవారు. అందుకని ప్రతిరోజూ పార బుజానవేసుకొని ప్రొద్దున్న సురగాం వెళుతూ ఉండేవారు. ఎండైనా వానైనా లెక్క చేసేవారు కాదు.

30_1-1948 ని మహాత్మా బలిదానం జరిగింది. తర్వాత మార్చి ప్రారంభంలోనే సేవాగ్రాంలో ఒక సమ్మేళనం జరగటం దానిలో డా॥ రాజేంద్రప్రసాద్, పండిట్ నెహ్రూ మొదలైన పెద్దలంతా పాల్గొనటం జరిగింది. ఈ సమ్మేళనంలోనే వినోబా సర్వోదయ సమాజస్థాపనచేశారు.

శరణార్థులవద్దకు వెళ్ళి వాళ్ళ పునరావాసం మొదలైన కార్యక్రమాల్లో వినోబా ప్రభుత్వానికి సహాయపడాలని పండిట్ నెహ్రూ కోరిన మీదట వినోబా ఢిల్లీ వెళ్ళారు. పంజాబ్ లో గుడ్ గాం జిల్లాకు చెందిన మహమ్మదీయులకాయన చాల సేవచేశారు. రైలుమీద కారుమీద దేశంలో ఇతర ప్రాంతాలు కూడా పర్యటించి తన ప్రేమ కరుణా సానుభూతి భరితమైన సందేశాన్నందించారు.

1950 ప్రారంభంలో మళ్ళీ వినోబా తన పౌనార్ ఆశ్రమానికి చేరుకొన్నారు. అక్కడ తన "కాంచన - ముక్తి - (సమాజాన్ని ధనదాస్యం నుంచి విడిపించే) ప్రయోగంలో లగ్నం అయ్యారు. అంతేకాకుండాఆయన రోజూ పార తీసికొని పొలం వెళ్ళి ఆశ్రమానికి చెందిన రాతినేల త్రవ్వి దాన్ని దున్నదగిన సమతలంగా చేస్తూ ఉండేవారు. "ఆశ్రమభూమిలో పండిన ధాన్యమే తినాలి. అక్కడ వడికి నేసిన ఖాదీయే కట్టాలి" అనే వ్రతాన్ని వినోభా, ఆయన అనుచరులూ కూడ పట్టారు. శ్రమదానం తప్ప మరే దానం స్వీకరించరాదని నిర్ణయించుకొన్నారు. ఆశ్రమానికి నీటి కొఱత ఉంది. అందుచేత ఆశ్రమం దగ్గఱ ఒక నుయ్యి త్రవ్వేపని కూడ ప్రారంభించారు. ఈ పనిలో వార్ధాకు చెందిన వందలకొలది కార్యకర్తలు విద్యార్థులు సంతోషంగా శ్రమదానం చేశారు. పనయ్యాక ప్రతి రోజూ సూర్యాస్తమయ సమయంలో అందరూ ప్రార్థన చేసేవారు. ఘూళి ధూసరిత దేహంతో వినోబా నిలబడే ప్రార్థనా కార్యక్రమం నడిపేవారు. ప్రార్థనలో గీతా శ్లోకాలు ఇతర భజనలు ఉండేవి. వీటిని పాడుతూ వినోబా ఆనందపరవశులై నాట్యం చేస్తూ ఉంటే- అందరికీ "సంత్ తుకారాం "చైతన్య మహాప్రభువు" గుర్తుకు వచ్చేవారు.

ఈ విధంగా సమాజ నిర్మాణ కార్యక్రమాల్లో అవతరించి వాటిని శాఖోపశాఖలుగా విస్తరింప జేసిన వినోబా జీవితం భూదానోద్యమంతో విశ్వవిఖ్యాతి నార్జించుకొంది.

# జననీ జన్మభూమిశ్చ

వినోబా తమ్ముడు బాలకోబా 1913_1916 కాలం నాటి తమ కుటుంబ జీవనాన్ని జ్ఞప్తికి తెచ్చుకొన్న దానినిబట్టి వినోబా గృహజీవిత విశేషాలు గమనిద్దాం.

పదహారేళ్ళ వయస్సులో వినోబా ఇప్పటిలాగ, చంద్రుడులాగ కాకుండా మధ్యాహ్న సూర్యుడులాగ తీక్ష్ణంగా ప్రకాశించేవాడు. ఇంటిలో తఱచుగా అందరితోటి పరాసంగానే ఉంటూ ఉండేవాడు. ఆయన తండ్రితో మాటలాడటం బాలకోబా ఎప్పుడూ చూడలేదట. తల్లితో మాత్రమే మాటలాడేవాడు. తల్లి అంటే ఆయన మనస్సులో విశేషాకర్షణ ఉండేది. చిన్నప్పటి నుంచీ ఆయనది మౌనస్వభావం. తల్లి ఆయన్ని "విన్యా" అని పిలిచేది. తమ్ములు "దాదా" అనేవారు. అమ్మ మనస్సులో ఆయనంటే ఆదరం, స్నేహభావం ఉండేది. వినోబా రాత్రిపూట తఱచుగా ఆలస్యంగా ఇంటికి వస్తూఉండేవాడు. తండ్రిగారు కూడ ఆలస్యంగానే వచ్చేవారు. తండ్రి చెప్పిన మీదట ఆయనకు కంచంలో వడ్డించి ఉంచేదిగాని వినోబా ఆలస్యంగా రావటంవల్ల ఇద్దరికీ వడ్డించి ఉంచటం సంభవం కాదని ఆయన కోసం ఎదురుచూస్తూ ఉండేది తల్లి. మిగిలిన వాళ్ళంతా తినేసేవారు. ఎప్పటికప్పుడు వినోబా ఆలస్యంగావస్తూ ఉంటే

అమ్మ "విన్యా" ఇంకారాలేదు అంటూ ఉండేది. వినోబా రాగానే చాల స్నేహపూరితంగా మర్యాదగా వడ్డించేది. ఎదుట కూర్చొని తినిపించేది. "నేను ఆలస్యంగా రావటంవల్ల నా కోసం కూర్చోవటం నీకు కష్టమవుతోంది" అని వినోబా తల్లితో ఎన్నడూ అన్నట్టులేదు. "బాలకోబా"కి విషయం బాధగా ఉండేది. తల్లితో అనేవాడట, పెందరాడేరమ్మని చెప్ప రాదా? అని. ఆలస్యంగా మేల్కొని ఉండటానికి నీకు భయ మయితే చెప్పవచ్చుకదా? అంటే ఆమె మాత్రం వినోబా మీదున్న ప్రేమచేత అల్లా ఎప్పుడూ అడిగినట్టులేదు. రాత్రి ఆలస్యంగా తిండి తిన్నాక పక్కమీద వాలగానే నిద్రరాకుండా ఉండదు. కాని వినోబా ఇటూ, అటూ దొర్లుతూ 11-30, 12-00 గంటలదాకా తానభ్యసించే పుస్తకాలు చదువుతూనే ఉండటం బాలకోబా కాశ్చర్యం కలిగించేది. వాళ్ళయింట్లో కుర్చీ, బేబులు మొ॥ పర్నిచర్ ఏమీ లేనేలేదు. రాత్రి చాల సేపు చదువుతూ ఉండటంవల్ల ఆయన కళ్ళకు జబ్బుచేసింది. రాత్రి ఆలస్యంగా పడుకొని ఉదయం లేవటం కూడ ఆలస్యం గానే లేచేవాడు. చిన్నప్పుడాయన కారోగ్యనియమాలు తెలిసి నట్టుతోచదు. చలిరోజులలో ముఖం కప్పుకొని నిద్రపోయే వాడు. ఇది బరోడాలో పెంకుటింటిలో ఉన్నప్పటిమాట. ఆ యింట్లో నల్లులెక్కువుండేవి. ఇంటిలో మట్టిదీపం వాడేవారు. రోజూ రాత్రిలేచి వాళ్ళు నల్లుల్ని ఆ మట్టి [ప్రమిద] దీపంలో ఆహుతి చేసేవారు. వినోబా కూడ ఈ కార్యక్రమంలోపాల్గొన వలసి వచ్చేది.

చిన్నప్పుడు దాదా పళ్లు తోముకొనేవాడు కాదని బాలకోబాకు గుర్తు. చాలరోజులలో ఆయన స్నానంచేసినట్టు కూడ జ్ఞాపకంలేదట. బట్టలుతుక్కోవటమనే నియమం ఉండేది. పెద్దవాళ్లయేదాకా తల్లిగారే వాళ్లందరిబట్టలూ ఉతుకుతూ ఉండేది. తర్వాత బాలకోబా తన బట్టలు తానుతుక్కునేవాడు. దాదాకూడ తన బట్టలు తానే ఉతుక్కునేవాడు. ప్రతి ఆదివారం అందరిబట్టలూ తండ్రిగారే ఉతికేవారు. ఆయనకు బట్టలకు అద్దకంవేసే పని తెలుసు. కాబట్టి పిళ్లతల్లి చీరలు వగైరాలకు రంగులువేస్తూ ఉండేవారు. పిల్లలకు చదువుచెపుతూ వాళ్లచొక్కాలు కమీజులు చేత్తోటే కుడుతూ ఉండేవారు. వాళ్లయింట్లో కుట్టుమిషన్ లేనేలేదు. చాలరోజులలో ప్రొద్దున్న లేస్తూనే కాలకృత్యాలయ్యాక వినోబా పొయ్యిదగ్గఱ కూర్చునేవాడు. తమ్ముళ్లుకూడ అంతే. అప్పుడే వినోబా తల్లితో కొంచెం మాట్లాడేవాడు అన్నంతినేటప్పుడాయన ఎప్పుడూ ఎవరితోనూ మాటలాడేవాడుకాదు. అన్నం తినేటప్పుడుకూడ ఆయన మనస్సు ఆలోచనలోనే ఉండేది. అన్నం తినేటప్పుడు బాలకోబా కూడ ఆయన ప్రక్కనే కూర్చుని చూస్తూఉండేవాడు. వినోబాదృష్టి అన్నంవైపు ఉన్నట్టే కనపడేదికాదు.

“భగభగలాడే అగ్నిజ్వాలవంటి వివేకసహిత వైరాగ్య బలం” అన్నరీతిగా వైరాగ్యమాయనమీద ముద్రితమై పోయింది. తిండివిషయంలో ఆయనకి శుచి అనీ అశుచి అనీ ఏమీ ఉండేదికాదు. ఆయన ప్రవృత్తి అక్షరశః “యదృచ్ఛా

లాభసంతుష్టః" అనేదానికి సరిపోయేది. చాలసార్లు చివరి పదార్థం తినకుండానే పరధ్యానంతో ఆపోశన పట్టేస్తూ ఉండే వాడు. ఆపోశనం అయ్యాక సహజంగానే భోజనం సమాప్త మైపోతుంది. లేచిపోయేవాడు. చిన్నప్పటినుంచీ ఆయన శరీరం బలహీనంగానే (సన్నంగా) ఉండేది. కాని ఆయన 1913-'16 మధ్యకాలంలో ఎప్పుడూ జబ్బుపడినట్టు లేదు. శరీరం సన్నంగా ఉన్నా కష్టం ఓర్చుకోవటాని కలవాటు పడిఉంది.

తండ్రిగారికి నెలకు నలభై యో నలభైయైదో రూపాయల జీతం వచ్చేది. తల్లీ, తండ్రీ, ముగ్గురు సోదరులు ఒక సోదరి ఒక చిన్నతమ్ముడు మొత్తం ఆ యింటిలో కుటుంబం ఏడుగురు. తండ్రిగారుదయం 5-30 గం॥ లేచి పాలు తేవటానికి వెళ్ళేవారు. శేరున్నరపట్టే లోటానిండా నురుగు తేలుతున్న పాలు తెచ్చేవారు. పగలంతా ఈపాలే వారికి సరిపోయేవి. తండ్రిగారు ఉదయం ఒక పావుశేరు వేడిపాలు తీసికొనేవారు. ఇంటిలో "టీ" పెట్టుకొనే అలవాటు లేదు. తండ్రిగారి కోసం ఎవరైనా మిత్రులు వచ్చినా వాళ్ళకీ, పాలేయిచ్చేవారు. రాత్రి తండ్రిగారికి మళ్లీ ముప్పయితులాలపాలు - మిగిలినవారికందరికీ పదేసి తులాలపాలు లభించేవి. మధ్యాహ్నం అందరికీ మజ్జిగ తాగటం అలవాటు ప్రొద్దున్న ఫలహారం (నాశ్తా)లో— రాత్రి నేతిలో వేసిన రొట్టెగాని బెల్లంగాని తినేవారు. మధ్యాహ్న భోజనంలో "ఆమటీ" అన్నమూ, నేతి రొట్టె కూడ ఉండేవి. మధ్యాహ్నం లాగే రాత్రి భోజనంకూడ. చిన్నప్పుడు వినోబాకు తిరగటమంటే బాగా ఇష్టముండటం

మూలాన ప్రత్యేకించి వ్యాయామం అవసరం తెలియలేదు. నడక అలవాటుండటంవల్లనే మొత్తంమీద ఆరోగ్యం బాగానే ఉండేది. ఇంటిదగ్గరున్న రోజులలో వినోబా చెప్పులు తొడుక్కో లేదు. ప్లేగురోజులలో వారంతా "కాశీవిశ్వేశ్వరాలయంలో" ఉండటానికి వెళ్ళేవారు, వారియింటికీ ఆలయం రెండు-రెండు న్నర మైళ్ళదూరంలో ఉండేది. స్కూలుకువెళ్ళే దారిలో దుమ్ముక్కువ. వేసవికాలం ఉదయంపూట స్కూలుండేది. కాని 12గం॥ వేళ వినోబా వేడెక్కిన దుమ్మున్న దారిలో చెప్పులులేకుం డానే యింటికివచ్చేవాడు. ఇంట్లో స్వదేశీమిల్లు బట్టలవాడకమే ఉండేది. తండ్రిగారు "ఖటావు-మఖన్ జీ" మిల్లుబట్టలే తఱచు ఇష్టపడేవారు. ధోవతి ఒక సంవత్సరం వచ్చేది. వినోబా చొక్కా కోటు, ధరించేవాడు. టోపీ ఉండేది. లోకమాన్య తిలక్ నడిపే "కేసరి" పత్రిక వినోబా చిన్నప్పటినుంచీ చదివేవాడు. 1908లో లోకమాన్య తిలక్‌కు 6 ఏళ్ళ శిక్ష విధింపబడిన నాటి నుంచీ వినోబా పంచదార తినటం మానేశారు. సోదరులా యన్ననుసరించారు. నెలకొక్కసారో రెండుసార్లో మంగలి చేత పనిచేయించుకొనేవారు. మంగలి దాదాని (వినోబాని) "వినాయక్" అని పిలిచేవాడు. పనిచేయించుకొన్నాక తలకి నూనె పట్టించుకోమని అమ్మ ఎప్పుడూ కోరుతూ ఉండేది కాని దాదా ఎప్పుడూ నూనె పట్టించుకోలేదు.

వాళ్ళచెల్లెలుపెళ్ళి నిశ్చయమయింది. మొదటి నుంచీ చివరిదాకా దానిలో వినోబా పాల్గొని ఏమీ పనిచెయ్యలేదు. ఆయన తన తమ్ముళ్ళతో (బాలకోబా, శివాజీ) గట్టిగా

చెప్పారు "నేనిందులో ఏమీ చేయటంలేదు. కాని మీరిద్దరూ పూర్తిగ పెళ్లిపనులతో పాల్గొని చక్కబెట్టాలి". అని ఆయన ఆజ్ఞ శిరోధార్యంగాభావించి తమ్ముళ్లు పనిచేశారు. దాదా పాల్గొనకపోవటంవల్ల బాలకోబా అలిప్తతనేర్చుకొన్నాడట. అలిప్తంగా అంటే నిస్సంగత్వంతో తమ్ముళ్లు పనులన్నీ నిర్వహించారు. అన్నగారి వైరాగ్యమయ ప్రవర్తన ప్రభావం బాలకోబా మీద బాగా పడింది. పనిచెయ్యకుండా మాటలాడటం వ్యర్థమనీ, మౌనంతో కూడిన ఆచరణ శ్రేష్ఠమైనదీ, నిజంగా ప్రభావశాలీ, అని బాలకోబా అర్థంచేసుకొన్నాడు. ఇంటిదగ్గర తనకు వినోబా చదువు చెప్పలేదనే విచారం బాలకోబాకులేదు. ఆయనయొక్క మూకమై వైరాగ్యమయమైన ఆచరణవల్లనే బాలకోబాకు లభించిన జీవన దృష్టి, ఆయన పాదచ్ఛాయలలో నడవటంవల్ల లభించిన ప్రేరణ, కారణంగానే తన ప్రాణ ప్రియుడైన అన్న ఆశ్రమంలో చేరితే వెనువెంటనే తానూ చేరాడు. తన యెడల వినోబా ప్రవర్తన కఠినంగానే ఉండేది. కాని అది తన కెప్పుడూ బాధకలిగించలేదు. ఆయన యొక్క కఠినమైన ఆచరణవల్లనే ఆయన యెడల బాలకోబాకు భక్తి ఉత్పన్నమయింది. అది ఎప్పుడూ సడలలేదు. దాదా, దాదా అంటూ ఎప్పుడూ ఆయనతో తాను స్నేహపూర్వకంగానే ప్రవర్తించే ప్రయత్నం చేస్తూఉండేవాడు.

ప్లేగు వచ్చిన రోజుల్లో వీరి కుటుంబం కాశీవిశ్వేశ్వరాలయంలో ఉండేది. అవి 1914–15 రోజులు. అన్నంతిన్నాక మధ్యాహ్నం పండ్రెండు-ఒంటిగంట మధ్య ప్రతి ఆదివారం

వినోబా పట్టణంలోకి వెడుతూ ఉండేవాడు. బాలకోబాకు "ఇంత ఎండవేళ భోజనం చేయగానే దాదా ఎక్కడికి వెడుతున్నాడో" అనిపించేది. ఒక రోజున అడిగితే "నీ కెందు" కన్నాడు. ప్రతి ఆదివారం ఈయన అడగటం ఆయన అదే జవాబు చెప్పటం.

1914లో జర్మనీ యుద్ధ ప్రకటన చేసిన తరువాత "సందేశ్" అనే పత్రిక వచ్చేది. అది చదివేవాళ్ళు. ఒకరోజు భోజనమయ్యాక బాలకోబా, శివాజీ కలిసి పట్టణానికి బయలుదేరారు. వినోబా మిత్రుడైన బోళే యింటికి సందేశ్ వస్తుంది. పని పూర్తిచేసికొని వారిద్దరూ సందేశ్ తెచ్చుకోవడానికి బోళే యింటికి వెళ్ళారు. ఆయన యింటిదగ్గర లేరు. రఘునాధరావు ధోత్రే యింటికి వెళ్ళాడని యింటిలోవాళ్ళు చెపితే అక్కడికి వెళ్ళారు. రఘునాధరావు ధోత్రే తల్లి "పైన మూడో అంతస్థులో ఉన్నారని చెప్పింది. ఆ అంతస్థులోకి వెడితే తెలిసింది-దాదా ఆదివారాలెక్కడికి వెళ్ళుతున్నదీని. బ్రహ్మాండమైన దృశ్యం; దాదా ఆయన మిత్రమండలి కలిసి చిన్నసభ ఏర్పాటు చేశారు. సమర్థరామదాసస్వామి "దాసబోధ"ను గురించో అల్లాటిదే ఏదో విషయాన్ని గురించో చర్చ. వీళ్ళు వెళ్ళేసరికి రఘునాధరావు ధోత్రే ప్రసంగిస్తున్నారు. అప్పుడాయనకి ఒంటినిండా చిడుముండేది. ఆయన ప్రసంగానికి పూర్వం ఇతరుల ప్రసంగాలు కూడ జరిగి వుంటాయి. ఎందుకంటే ధోత్రే మాటలాడగానే దాదాలేచి ప్రసంగించటం ప్రారంభించారు. తరువాత 6-30-7-00 గం॥లకు సభ సమాప్తమయింది. సభ

అయ్యాక బాబాను సాగనంపటానికి మిత్రమండలి ఏదో మాట్లాడుతూ దత్తమందిరం దాకా వచ్చింది. దత్తమందిరం ఫోత్రే యింటికి దగ్గర. అక్కడి నుంచి ఎవరియిళ్ళకు వాళ్ళు వెళ్ళారు. వినోబా, బాలకోబా, శివాజీ వాళ్ళ ఆలయంవైపు దారి పట్టారు. దాదా ఏమంటాడో అని బాలకోబాకు భయంగానే ఉంది. ఆయన అడగనే అడిగాడు– "ఏరా! ఎందుకు వచ్చారు?" అని. బాలకోబా విషయం చెప్పాక "సరే! ఇక ముందు రాకండి తెలిసిందా?" అన్నారు. ఆయన ఆజ్ఞ ఉల్లంఘించటం అసాధ్యం. కాబట్టి వాళ్ళు మళ్ళీ సభకు వెళ్ళలేదు. మూడునాలుగు నెలల తర్వాత వారు మళ్ళీ నగరంలో నివసించటానికి వచ్చేశారు. ఒక రోజు ఆదివారం బాలకోబా శ్రీ ఫోత్రే యింటి దగ్గర ఉండగా నాలు గంటలవేళ మామూలుగా ఆయన తమ మిత్రమండలి సమావేశానికి బయలుదేరారు. బాలకోబానుకూడ తనతో రమ్మన్నారు. బాలకోబా "దాదా అనుమతి లేనిదేఎల్లా రావటం" టంటే ఆయన "ఫర్వాలేదు" రమ్మన్నారు బాలకోబా వెళ్ళాడు. అప్పటికి విద్యార్థి మండలి ఒకగది అద్దెకు తీసికొన్నది. అక్కడే సాప్తాహిక సమావేశాలు జరుగుతూ ఉండేవి. ఆనాటి సభావిషయం "జోసెఫ్ మోజినీ", అందరి ప్రసంగాలు అయ్యాక వినోబాలేచారు. ఆనాటి ఆయన ప్రసంగం సాటి లేనిది. మహాప్రవాహం సాగింది. భావనలో ఉత్తేజం తెచ్చి ఉద్దీప్తం చేసే ప్రసంగమది. సభ పూర్తయి అందరు ఎవరి యిళ్ళకు వాళ్ళు బయలుదేరారు. దాదా ఏమంటాడో అని బాలకోబాకు భయంగా ఉంది. కాని దాదా ఏమీ అనలేదు బాలకోబాకు చాలి సంతోషం కలిగింది. తర్వాత ప్రతి ఆది

వారం ఆయన కూడ వెడుతూ ఉండేవాడు. ఆ విద్యార్థిమండలి తరఫున ఒక లిఖిత మానసపత్రిక కూడ వెలువడేది. అది కూడ చదివే అవకాశం బాలకోబాకు లభిస్తూ ఉండేది.

పరీక్షకని బొంబాయికి బయలుదేరిన వినోబా దారిలో బండిమారి ఎక్కడికి వెళ్లిందీ తెలియక అమ్మగారు చాల బాధపడింది. "మనపిల్లాడు కాదనుకొంటేసరి!" అంటూ తండ్రి ఓదార్చేవారు. కొన్నాళ్లకి "కాశీవెళ్లినట్లు అక్కడనుంచి రెండునెలల తరువాత అహమ్మదాబాద్ ఆశ్రమానికి వెళ్లినట్లు తెలిసింది.

దాదా యిల్లువదలి వెళ్లిన తర్వాత బాలకోబా మనస్సు బాగాలేదు. తన కర్తవ్యమేమిటి? దాదా యిల్లువిడిచి వెళ్లిపోయాక తానుమాత్రం యింటిదగ్గ ఎందుకుండాలి? అనే ఆలోచనలు కలత కలిగించాయి. చివరికి ఇల్లువదలి దాదా దగ్గఱకే వెళ్లాలని నిశ్చయం చేసుకొన్నాడు. ఒక మిత్రుడి దగ్గఱ బరోడానుంచి అహమ్మదాబాద్ చార్జికని ఒక రూపాయి తీసికొని ఒక సాయంత్రం ఇంట్లో ఎవరికీ చెప్పకుండా పసిగెత్తు కొని స్టేషనుచేరి బండి అందుకొని రాత్రి 12 గం॥లకు అహమ్మదాబాద్‌లో దిగాడు. అప్పుడాయన వయస్సు 17 సం॥ రాత్రి "భద్ర-ముహల్లా"లో ఒక అరుగుమీదగడిపి తెల్లవారి ఆరుగంటలకు కొచరబ్ ఆశ్రమానికి దారి అడిగి తెలుసుకొంటూ బయలుదేరాడు. ఆశ్రమం చేరగానే అందరికన్నా ముందు ఇనామ్

సాహెబ్ కలిశారు. ఆయనే గాంధీజీ అనుకొని బాలకోబా ఆయనకు సాష్టాంగ నమస్కారం చేశారు. వినోబాజీని గురించి వాకబు చేయగా ఆయన పై అంతస్తులో ఉంటున్నారని తెలిసింది. పైకివెళ్ళి ఆయనకు నమస్కారం చేశారు. ఆయన "చెప్పివచ్చావా ? చెప్పకండానే వచ్చావా ?" అనడిగారు ఇతడు "చెప్పకండానే" అన్నాడు. "అయితే వెనక్కి వెళ్ళవలసి వస్తుంది. తెలుసా ?" అన్నారు వినోబా.

అప్పుడు దాదా ఐబ్బపడి లేచారు. అందుచేత బలహీనంగా కనిపిస్తున్నారు. మోకాళ్ళదాకానే చిన్నపంచె కట్టుకొన్నారు. దాదా ఆశ్రమ నియమాలు తమ్ముడికి చెప్పటం మొదలుపెట్టారు. పై అంతస్తులోనే సంభాషణ జరుగుతూ ఉండగా పైనుంచి బయటికి వెడుతూ గాంధీజీ కనిపించారు. దాదా వేలుతో చూపిస్తూ "ఆయనే గాంధీజీ" అని చెప్పారు. తాను ప్రొద్దున్న సాష్టాంగ నమస్కారంచేసింది గాంధీజీకి కాదని బాలకోబా కప్పుడు తెలిసింది.

అప్పుడు గాంధీగారి దుస్తులు-చొక్కా, దానిమీద, అంగరఖా, తలమీద కథియవాడ్ కు చెందిన పేంటా (చిన్న తలపాగా) పొడుగు ధోవతి, కాళ్ళకప్పట్లో ఏమీధరించటం లేదు. బయటికి వెళ్ళేటప్పుడు మాత్రమే ఈదుస్తులు ధరించేవారు. ఆశ్రమంలో మాత్రం మోకాళ్ళవలుకు పంచెకట్టుకొని శరీరం కనిపించేలాగ వదిలేసేవారు.

బాలకోబా అదృష్టమేమిటంటే— ఉదయం నాల్గున్నర గంటలకి గాంధీజీతోబాటు పిండివిసరటం జరిగేది. గాంధీగారి ఒక చేయి 15-20 ని॥ల వరకు తిరగలిమీద తియ్యకుండా తిరిగేది. ఆరోజుల్లో ఆయన మధ్యాహ్నం ఒక్కసారే భోజనంచేస్తూ ఉండేవారు. ఇద్దఱు పిల్లల సహాయంతో మధ్యాహ్నపు భోజనమంతా ఆయన స్వయంగానే తయారు చేసుకొనేవారు. కోచరబ్‌లో బాలకోబా పేరు—కృష్ణారావు అని పెట్టబడింది. గాంధీజీ ఆయన్నా పేరుతోనే పిలిచేవారు.

ఈ విధంగా వినోబాతోపాటు ఆయన సోదరుడుకూడ ఆశ్రమవాసి కావటం సంభవించింది. వినోబా జబ్బుపడిలేచారు కదా! బాలకోబా ఆయనదగ్గఱే పడుకొంటూ ఉండేవారు. బాలకోబా ఆశ్రమంలో ఉండకుండా యింటికి వెళ్లిపోవటమే మంచిదని రాత్రిపూట పడుకొని ఒక గంట—గంటన్నరసేపు వినోబా తమ్ముడికి బోధిస్తూ ఉండేవారు. "నన్నిక్కడ ఉండనీ"మ్మని బాలకోబా అడుగుతూ ఉండేవారు. ఆయన తమ్ముణ్ణి యింటికి పంపేసెయ్యాలనే నిశ్చయించుకోవటంవల్ల పదేపదే అందుకు ఒప్పించాలని యత్నించేవారు. వినోబా—తమ్ముడిక్కడికి వచ్చాడని అతన్ని తిరిగి బరోడా పంపటానికి చార్జీ పంపమని తండ్రికి ఉత్తరం వ్రాశారు. వెంటనే తండ్రిగారు అయిదురూపాయిలు మనియార్డరుచేశారు. దాదా ఆజ్ఞ ప్రకారం బాలకోబా యింటికివచ్చాడు. కాని ఆశ్రమ జీవన నియమాలు పాటించటం ప్రారంభించాడు. తల్లివద్దన్నా వినలేదు. ఆరోగ్యం చెడింది. అప్పుడు దాదా యింటికివచ్చారు. ఆ ప్రయోగం

మానుమని దాదా చెపితే విని బాలకోబా అనారోగ్యంనుంచి బయటపడ్డాడు.

తర్వాత బాలకోబా గాంధీజీతోనే ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపి అనుమతిపొంది మళ్లీ ఆశ్రమానికి చేరాడు. "నేను బరోడా వచ్చినప్పుడు నాతో ఈసంగతెందుకు చెప్పలేదని వినోబా అడిగారు. "ఈపట్టు తండ్రిగారితో చెప్పావా ?" అంటే "చెప్పేవచ్చా"నన్నారు తరువాత మరోతమ్ముడు శివాజీ కూడ ఆశ్రమానికి వచ్చాడు. ఈవిధంగా సోదరులు ముగ్గురూ ఆశ్రమవాసులూ, బ్రహ్మచారులూ గానే జీవితం గడిపారు.

## అధ్యయనం—

చిన్నతనంలో వినోబాకు మంచి మంచి గ్రంథాల్లో వాక్యాలుగాని పద్యాలుగాని కంఠస్థంచేసే అలవాటుండేది. ఆరోజులలో దాసబోధలో 'అది ఆయన కిష్టమైన గ్రంథం) ఎన్నోపద్యాలు కంఠస్థంగా ఉండేవి. మోరోపంతు "కేకావళి" "ఆర్యా" అనేవి పెద్దకంఠంతో పాడే అలవాటుండేది. "గీతా రహస్య" (తిలక్) ప్రచురింపబడ్డ తర్వాత ఒక్క బిగిని పుస్తకమంతా ఆయన చదివేశారు. బరోడా సెంట్రల్ లైబ్రెరీనుంచీ పుస్తకాలెన్నో తెచ్చి ఎడతెగకుండా చదువుతూ ఉండేవారు. "రాజవాడా" మొ॥ వాటి చరిత్రగ్రంథాలన్నీ ఆయన చదివేశారు. ఆయనకు భూగోళజ్ఞానంకూడ బాగ ఉండేది. గణితం ఆయనకు ప్రియమైన విషయమే **(Subject)**.

హైస్కూల్లో ఫ్రెంచి రెండవ భాషగా తీసికొని చదివారు. అందువల్ల సంస్కృతం ఇంటిదగ్గరే అధ్యయనం చేశారు. స్కూలులో నాల్గవతరగతిలో చేరారు. ఆరవ (మరాఠీ) తరగతి వరకు చదువు బరోడాలో 6 వ నెంబరు స్కూలులో జరిగింది. నాల్గయిదు తరగతులలో ఆయనది ఫస్టు నెంబరు. నాల్గవతరగతి వరకు ఆయన చదువు ఇంటిదగ్గరే జరిగింది. తండ్రిగారాయనకి చక్కగా చదువు చెప్పేవారు. హైస్కూలు నాల్గవ శ్రేణిలో ఫ్రెంచి తీసికొని "హాఫ్ ఇయర్లీ" తర్వాత- (రెండవ ఆరుమాసాలకాలంలో) చేరి ఫ్రెంచి భాషలో 55% మార్కులతో ప్యాసయ్యారు. ఐదు, ఆరు, ఏడవ తరగతి వరకు ఆయనకు మొదటి నెంబరు వస్తూనే ఉంది. దీనివల్ల ఆయనకు 7, 8 రూపాయలు స్కాలర్ షిప్పుకూడ లభించేది. స్కాలర్ షిప్ డబ్బులుతెచ్చి అమ్మకిచ్చేస్తూ ఉండేవారు. ప్రీవియస్ (ఇంటర్)లో చేరినతర్వాత ఆయన మనస్సు చదువునుంచిదూరంగా పోయేది. అదీ ఎలాగోలాగ ప్యాసయ్యారు, హైస్కూలు-కాలేజీలలో చెప్పే చదువు పనికిమాలినదనీ, సేవావృత్తిని పెంచేదనీ ఆయనకు బాగానమ్మకం కలిగిపోయింది. అందుచేతనే ఆయన ఇంటర్ తోనే చదువుకు స్వస్తిచెప్పి ఇంటినుంచి వెళ్లిపోవాలని నిశ్చయించుకొన్నారు.

ఆ నమ్మకమే ఆయనచేత సర్టిఫికేట్లని కుంపట్లో పడేయించింది. "ఎప్పుడైనా ఇవి ఉపయోగ పడతాయి కదా! విన్యా" అని తల్లి అడుగుతున్నా నిశ్చలంగా అవి నా జీవితంలో ఎప్పుడూ అవసరం కావని ఆశ్చర్యం కలిగించేలాగ సమాధానం చెప్పారు.

## ఆధ్యాత్మ విద్యాభిలాష — (కాశీ)

సింహగడ్ కోటమీద నుంచి దిగిపారిపోవటానికి వీల్లే కండా అక్కడున్న తాళ్ళన్నీ తెంపేశాకనే మరాఠాసేన విజయం సాధించిందనే వృత్తాంతం మనస్సులో మెదుల్తూనే ఉండటంతో వినోబాకు తన బ్రహ్మజిజ్ఞాసామార్గానికి లౌకికవిద్యాలు సర్టిఫికేట్లు వగైరాలన్నీ ఆటంకంగానే కనిపించాయి. ఇవి వదల్చుకొంటేగాని బ్రహ్మజ్ఞాన సాధనలో ఏకాగ్రత కుదరదని నిశ్చయించుకొన్నారు.

తల్లితోపాటు వంటింట్లో కూర్చొన్నప్పుడు చేతిలో ఉన్న కాగితాలకట్ట "సర్టిఫికేట్లు" నిప్పులలో పడవేయటంతో బంధనాలు తెంపుకోవటంలో మొదటి ఘట్టం పూర్తయింది.

అనీబిసెంట్ దగ్గరకుగాని లోకమాన్య తిలక్ దగ్గరకుగాని వెళ్ళే సాహసంలేదు. హిమాలయాలకు వెడదామా? సమాజంలో ఈశ్వరసాక్షాత్కారం పొందలేనివాడికి హిమాలయాలకు వెళ్ళినా ఆ కోరిక ఫలించదు. పరీక్షలు దగ్గరపడ్డాయి. అప్పటికి వినోబా బరోడా కాలేజీలో ఇంటర్ మీడియేట్ చదువు తున్నారు. పరీక్షలు బొంబాయిలో జరుగుతాయి. అవి యింకా రెండురోజులున్నాయనగ 25–3–1916 తేదీని వినోబా తన మిత్రుడు "గోపాలరావుకాలే"తో కలిసి బరోడా నుంచి బొంబాయివెళ్ళే రైలెక్కారు. తన తండ్రిపేర వ్రాసిన ఒక ఉత్తరం పరీక్షలయ్యాకనే పోష్టులో వేయమని చెప్పి

మిత్రుడు గోపాలరావు చేతులో పెట్టి వినోబా సూరత్‌లో ట్రెయిన్ దిగిపోయారు.

ఆ ఉత్తరంలో "పరీక్షకు బొంబాయి వెళ్ళటానికి బదులు నేను మరోచోటికి పోతున్నాను. మీకు నా మీద విశ్వాసముందని నాకు తెలుసు. నేనెక్కడికి వెళ్ళినా నావల్ల అనైతికమైన పని మాత్రమేదీ జరగదని మీకు తెలుసు". అని వ్రాశారు.

సూరత్‌లో వినోబా కాశీవెళ్ళే భుసావల్ బండి అందుకొన్నారు. కాశీ చేరారు. వినోబా తండ్రికి కొడుకు వ్రాసిన ఉత్తరం చేరింది. సహజంగానే కోపం వచ్చింది. కాని కష్టనష్టాలనుభవించి తానే యింటికి వస్తాడని భావించారు. తల్లికి మాత్రం తన కొడుకు సంగతిబాగా తెలుసు. ఆమె అన్నది - "విన్యా ఎప్పుడైనాగాని ఏదైనా నిర్ణయానికి వచ్చాడంటే ఇంక ఏమైనా సరే అటు నుంచి జారిపోయేపద్ధతే ఉండదు" అని.

కాశీచేరి వినోబా సంస్కృతం - ముఖ్యంగా ఉపనిషత్తుల అధ్యయనంలో పడ్డారు. అహల్యాభాయి కాంపౌండులో ఉన్న స్థానిక గ్రంథాలయానికి వెడుతూ ఉండేవారు. తాంత్యాటోపే సోదరి భవనం అయిదవ అంతస్తులో మకాం. భోజనం అన్న సత్రాల్లో చేస్తూ సంయమంగా ఉండేవారు. భోజనంతోపాటు రెండుపైసల దక్షిణకూడ లభించేది. దీనితో రాత్రి పెరుగు శకర్ కంద్ (కందమూలాదికందుంపపదార్థం) అల్పాహారం చేసేవారు. ప్రతిరోజు గంగకు వెళ్ళి స్నానం చేయటం, గంటల తరబడి ధ్యానంచేస్తూ కూర్చోటం. ఈ రోజులలో ఆయన అనేక

ఉత్తమ కవితలు రచించారు. ఏదైనా కవితవల్ల ఆయనకు సంతోషం కలిగితే దాన్ని గంగకర్పణం చేసేవారు. గంగ యొక్క పవిత్రత ఉత్కృష్టత ఆయన హృదయాన్ని క్షాళనం చేసి తన్మయత కల్పించి ఉత్తమమైన ఉత్కృష్టభావ సంపద నుద్భవింప జేసింది.

తన గీతాప్రవచనంలో వినోబా గంగను గురించి వ్రాసిన మాటలు :— "నేను కాశీలో ఉన్నప్పుడు రోజు గంగకు వెళ్ళి గంటలకొలది కాలం రాత్రి ఏకాంతంగా ఘాట్ లలో కూర్చొని ఉండిపోయేవాణ్ణి. ఆ ప్రవాహం ఎంత శాంతం! ఎంత ఉజ్జ్వలం! ఆ శాంతభవ్యరమణీయజలరాశిలో అగణిత నక్షత్రాలతో కూడిన ఆకాశం ప్రతిబింబిస్తూ ఉంటుంది. మౌనంగా నేనిదంతా చూస్తూ ఉండేవాణ్ణి. శంకర భగవానుడి జటలనుండి హిమాలయం మీదుగా అవతరించిన ఆ జగజ్జననిని చూస్తూ ఉంటే మనస్సు కెంత శాంతి లభిస్తుంది? ఆ గంగాతీరంలో ఎందరో లెక్కలేనంతమంది రాజులు తమ రాజవైభవం విడిచి కఠోర తపస్సుచేస్తూ తమ జీవనాన్ని ధన్యం చేసుకొనేవారు. ఆ నిశ్శబ్దశాంతిలో నాకు నేటికీ హిందువుల భక్త హృదయం "కనీసం మరణించిన తరువాతనైన తన దేహం యొక్క అవశేషం గంగామాత పవిత్ర ప్రవాహంలో విడవబడాలనే అభిలాష నెందుకు చూపుతుందో అనేది- ఆ రహస్యం అనుభవమయ్యేది. మీరు నవ్వినాసరే! ఈ వాస్తవానికేమీ తేడా మాత్రం ఉండదు."

కాశీలో వినోబా శాస్త్రచర్చలలో పాల్గొనేవాడు. గంగాతీరంలో ఒక సారి ద్వైతులకీ అద్వైతులకీ చర్చ జరిగింది. ఈ వాదంలో ద్వైతులోడిపోయారు. అద్వైతులు గెల్చారు. అక్కడున్న వినోబా "అద్వైతులూ ఓడిపోయా"రన్నారట. విజేతలైన పండితులు, "అలా అనటంలో మీ ఉద్దేశమేమిటి"ని అడిగితే వినోబా- "మీకు ద్వైతవాదులతో శాస్త్రార్థం చేయ వలసిన అవసరం ఉందని తోచిందంటే- మీరు కూడ ద్వైత భావం నుంచి విముక్తులు కాలేదన్నమాట. ఇదే ఆ సంగతిని ఋజువు పరుస్తోం"దన్నారట.

దుర్గాఘాట్ దగ్గర తనగదిలో పడుకొని ఉండగా వినోబాకు తన గది కొక తాళం కొనుక్కుంటే బాగుండునని పించి గంగనుంచి వస్తూ ఒక దుకాణంలో తాళం ఖరీదడిగితే అసలు మూడణాలే అయినా దుకాణదారు పదణాలు చెప్పాడు వినోబా పదణాలిచ్చి అది తీసికొని వాకిది మూడణాలకంటె ఎక్కువ చేయదని తెలుసు. కాని నీమీద నమ్మకంతో కొన్నా నంటూ తీసికొని వెళ్లారు. దానితో కొన్నాళ్లు బాధపడిన దుకాణదారు ఒక రోజున వినోబా వెడుతూఉంటే పిల్చి "నిజానికాతాళం మూడణాలే. నన్ను క్షమించం"డంటూ మిగి లిన ఏడణాలు తిరిగియిస్తూ పశ్చాత్తాపం ప్రకటించాడు. వినోబా అతనికి కలిగిన మనఃపరివర్తనకు సంతోషించారు.

బేడేకర్, శంకరరావుతగారే, అనే యిద్దరు మిత్రులు కూడ వినోబాతో కాశీవెళ్లారు. వారిలో బేడేకర్ శరీరంలావు.

మరీ యెక్కువగా తింటూ ఉండేవాడు. దురదృష్టవశాత్తు ఆయన అక్కడ చనిపోయాడు. చచ్చిపోతూ తనకు గంగ ఒడ్డునే అగ్నిసంస్కారం జరుపమనీ మంత్రాలు చెప్పటానికే స్థానిక పండితుణ్ణీ పిలువవద్దనీ వినోబాతో చెప్పాడు. అక్కడి పండితులు తననేదో అన్నప్పటికీ వినోబా తన మిత్రుని కోరికను పూర్తిగ నెఱవేర్చారు.

కాశీలో గీత, వేదం, ఉపనిషత్తులు, అధ్యయనంచేసి ఆత్మోద్ధరణార్థం హిమాలయాలకు పోవాలని కాస్సేపూ, బెంగాలువెళ్ళి విప్లవకారులలో కలవాలని కాస్సేపూ, వినోబా మనస్సులో ద్వైధీభావం కలుగుతూ ఉండేది. ఆ రోజులలో ఆయనకున్న గొప్ప కోరికలలో ఒక్క ఆంగ్లేయుణ్ణైనా తుపాకితో కాల్చి చంపాలనే దొకటి.

కాశీపండితులవల్ల భారతీయ సంస్కృతికి సంబంధించిన ఉత్తమోత్తమ విషయాలు అవగాహన చేసికోవాలని ఉండేది కాని ఆ పట్టణం మురికిచూస్తే అసహ్యం కలిగేది. దేవాలయాన్నికూడ ఈ అపరిశుభ్రత వదలలేదు. ఈ కశ్మల వాతావరణం ఆయన ఆరోగ్యాన్ని కూడ చెడగొట్టింది. వినోబా బలహీనపడిపోయారు. మతసంబంధమైన కఠిన కర్మకాండ సనాతన పవిత్రతకు సంబంధించిన వ్యర్థవాదాలు మూఢ్యతలు చూస్తే ఆయనకు బాధ కలిగేది. ఇది వదలి మరెక్కడికైనా పోయి శాంతిపొందుదామనుకొన్నారు.

అందువల్ల వారణాసిలో కలిగిన రెండు నెలల అనుభవం తరువాత వినోబా గాంధీజీతో కలియటంవల్లనే తన రాజ నైతికాధ్యాత్మిక వాంఛలు నెరవేరుతాయని నిశ్చయించు కొన్నారు. ఉత్తరప్రత్యుత్తరాలు ప్రారంభమైనాయి. ఫలితంగా గాంధీజీ పిలుపునందుకోవటం సబర్మతీ ఆశ్రమానికి చేరటం జరిగింది.

మనం భావేజీ ఆశ్రమవాస ఘట్టంలో ప్రవేశించేముందు ఆయన చిన్నతమ్ముడు శివాజీభావే వినోబాను గురించి వెల్లడిం చిన సమాచారం చూద్దాం.

## మా అన్నగారు.

"చిన్నప్పటినుంచీ బాబా మనస్సుపీద (మహారాష్ట్రసంత్) రామదాసస్వామి ప్రభావం గాఢంగా ఉంది. దానికి కారణం- మా అమ్మ రామదాసు "దాసబోధ" చదవందే ఎప్పుడూ నిద్రించేదికాదు. పగలు సమయం లభించినప్పుడల్లా చదివేది. అప్పుడప్పుడు రాత్రికూడ చదువుకొనేది. మేము నిద్రపోతూ వింటూఉండేవాళ్లం. బాబా "చిన్నప్పుడు రామదాసస్వామి ఇల్లు విడిచివెళ్లారు. నేను కూడ వెళ్లాలి" అంటూ ఉండే వారు.

అప్పటినుంచే ఆయన స్వభావం ధ్యానశీలంగా ఉండేది. కేవలం అమ్మతోనే ఆయన మాటలాడేవారు. ఎప్పుడైనా ఏదైనా భజన (కీర్తన)నుగురించి చర్చించేవారు లేకపోతే

ఊరికే పారమార్థికవిషయాలు ప్రసంగించేవారు. బాబాతో మేమాట్టే మాటలాడడముండేదేకాదు. ఆయన ధ్యానానికాటంకం కలుగుతుందనే భయముండేది. బాలకోబా ఎప్పుడైనా ఏదైనా అడగటానికో ఏశబ్దానికైనా అర్థం తెలుసుకోవటానికో ఆయనదగ్గరకు పరుగెత్తేవాడు. ఆయనతో బాబా "నన్నేమీ అడగవద్దు. నాతో మాటలాడవద్దు" అనేవారు. అయినా ఈయన అడుగుతూనే ఉంటే బాబా కొట్టకుండా వదిలేవారుకాదు. మధ్యలో అమ్మ కలుగజేసుకోవలసి వచ్చేది. ఆమె బాబాతో "అరే! నువ్వు రాక్షసుడివిరా! వాణ్ణి చంపేస్తావా? ఏమిటి?" అనేది. నేనుమాత్రం ఎప్పుడూ సాహసించేవాణ్ణికాదు.

ఒకొక్కప్పుడు భోజనంచేస్తూకూడ ఆయన ధ్యానంలో మునిగిపోతూఉంటే అమ్మ—"అధ్యయన సమయంలోనే నీవు అధ్యయనం చెయ్యి. అది మంచిదే, కాని భోజనంచేసేటప్పుడిదేమిటి?" అనడిగేది. బాబాకు రుచివిషయం ఏమీ పట్టదు. బాలకోబాకు రుచివిషయం పట్టింపుండి. "ఇదెందుకు చేశారు అదెందుకు చెయ్యలేదు." అంటూ అప్పుడప్పుడు పేచీపెడుతూ ఉండేవాడు. అప్పుడు బాబా దెబ్బలు తగిలిస్తూ ఉండేవారు. మా అమ్మకూడ భక్తిగీతాల కూనిరాగాలు తీస్తూనే వంట చేసేది. ఒకొక్కప్పుడు ఉప్పువేయటం మరచిపోయేది. లేకపోతే ఎక్కువో తక్కువో వేసేది. అప్పుడు బాబా మాట్లాడేవారేకాదు. ఆయన భయంవల్ల మేము కూడ ఏమీ అనేవాళ్ళం కాదు.

బాబా బాలకోబాను కొడితే నాన్నగారు బాబాని కొట్టేవారు. దాదాపు రోజూను. ఒకసారి దీపం ఆరిపోతోంటే నాన్నగారు బాబాని అందులో నూనె పోయమన్నారు. బాబా పొయ్యలేదు. ఆరిపోయాక పొయ్యటం మొదలుపెట్టారు. నాన్నగారడిగితే "మీరు చెప్పినప్పుడందులో నూనె ఉంది. నూనె పూర్తయ్యాకకదా! పొయ్యవలసింది?" అన్నారు. ఇల్లా తర్కంచేస్తే దెబ్బలు పడేవి. ఒకచోటికి పెళ్ళికి వెళ్ళవలసి వచ్చింది. ఎవరైనా టోపీపెట్టుకోకుండా పెళ్ళికివెడితే అది అపశకునమని భావిస్తారు. బాబా టోపీపెట్టుకోలేదు. పెళ్ళికే వెళ్ళలేదు. నాన్నగారు బాగా కొట్టారు.

ఇంటిలో అప్పుడప్పుడు రెండేసి గంటలు పంపుక్రింద కూర్చుని స్నానంచేస్తూ ఉండేవారు. ఒక్కొక్కప్పుడు నాల్గేసి రోజు లైదేసి రోజులు స్నానమే చేసేవారు కాదు.

"ఇల్లా రెండేసిగంటలు నీళ్ళలోకూర్చునిఉంటే (నానితే) జబ్బుచేస్తుం"దంటూ ఉండేది అమ్మ. ఆయన "నేను సమాధిలో ఉన్నాను. శంకరభగవానుడు నామీద అభిషేకంచేస్తున్నా" డనేవారు.

పదవయేళ్ళ ఆయన కుపనయనం చేసినప్పుడే ఆయన బ్రహ్మచర్యవ్రత ప్రతిజ్ఞ చేశారు. తర్వాత సబర్మతీ ఆశ్రమానికి వెళ్ళారు. అప్పుడానదిలో తన జందెం ప్రవాహంలో వదిలిపెట్టేశారు (పడవేశారు) కాని యింతటి వైరాగ్యమున్నా ఆయన మాతృనిష్ఠలోగాని మిత్రనిష్ఠలోగాని ఏలోపమూ

కలగలేదు. అది చిన్నప్పటినుంచి యిప్పటివరకు ఉంది. ఆయన ప్రభావంవల్ల ఆయన మిత్రులనేకులు గృహస్థాశ్రమ స్వీకారం చేయలేదు. తర్వాత కొందరు స్వీకరించారు. అయినా వారితో బాబా సంబంధాలు యథాపూర్వంగానే ఉన్నాయి.

బాపూ దగ్గర చేరినతర్వాత అమ్మకు జబ్బుచేసినట్టు సమాచారమందింది. బాపూ "ఇంటికివెళ్ళి తల్లికి పరిచర్యచేయ" మన్నారు. బాబా "ఆశ్రమంలోనూ రోగులున్నారు. వారి సేవకూడ చేయవలసిందే" అన్నారు. కాని బాపూ ఆయన్నింటికి పంపివేశారు. ఆ సమయంలో బరోడాలో ఆయన ఉపన్యాసాలు ఏర్పాటుచేయబడి ఉన్నాయి. (ఆ ప్రచారంచేయటానికి నేనే వెడతాను అన్నారు) చాల ఉద్వేగంగా మాటలాడటం ఆయన కలవాటు. ఉపన్యాసం పూర్తయిన వెంటనే పరుగెత్తటం మొదలుపెడతారు— ప్రజలు ఆయనపాదాలమీదపడకండా ఉండటానికి. ఇల్లువిడిచిపెట్టివెళ్ళినమీదట కొందరాయనకి అపకీర్తి కలిగించారు. వారు కూడ ఈ ఉపన్యాసాలు విని "ఈ కుఱ్ఱవాడు తన యిల్లువిడిచిపోవటమనేది సార్థకంచేశా"డనటం సాగించారు.

ఆశ్రమానికి వెళ్ళే నాటికాయనకు పనిచేసే అలవాటు లేదు. ఆయన ఆశ్రమంలో ప్రవేశిస్తున్న సమయానికి బాపూ కూరలు తరుగుతున్నారు. బాబా కూడ చాకు తీసికొని కూరలు తరగటం ప్రారంభించారు. "ఈయనకి కూరతరిగే పాండిత్యం లే" దని బాపూ వెంటనే గ్రహించారు. కాని మెల్లమెల్లగా ఆయన

అన్ని పనులూ నేర్చుకొన్నారు. ఆశ్రమంలో "బా"(కస్తూర్బా) చేతి క్రింద పనిచేయటం అంటే ఒక కఠిన పరీక్ష. కాని బాబా అందులోనూ ఉత్తీర్ణులయ్యారు. అక్కడ కూడ ఆయనెవ్వరితోనూ మాటలాడేవారుకారు. అందువల్ల చాల రోజులవరకు అందరికీ బాబా నిరహంకారస్వుడనే అభిప్రాయముంది.

బాబా రాత్రి మూడు గంటలకే లేచి సబర్మతీ నదికి స్నానానికి వెళ్ళేవారు. పొడిబట్టలు కట్టుకోకుండా ప్రార్థనలో కూర్చునేవారు. మిగిలినవారు పొడిబట్టలు కట్టుకొనే ఉండేవారు. ఒకసారి ప్రార్థనలో ఒక పాము వచ్చింది. కాని బాబా ఏకాగ్రతతోనే కూర్చున్నారు. అది త్రాచుపాము. అది మెల్ల మెల్లగ ఆయన దగ్గరకు వచ్చింది. తర్వాత బాపూ ఒడిలో కూర్చొంది. ప్రార్థనలో వెనుక ఉన్నవాళ్ళంతా పామును చూచి భయపడ్డారు. ఎప్పుడక్కడ నుంచి లేచి పోదామా! అని ఆలోచిస్తున్నారు. కాని బాపూజీ అల్లాగే కూర్చుని ఉన్నారు. బాబా కూడ ఏకాగ్రతతో నిశ్చలంగా ఉన్నారు. బాబాకు మొదటి నుంచీ మృత్యువంటే భయంలేదు, ఇటువంటి విషయాలు చిన్నప్పుడు కూడ జరుగుతూ ఉండేవి. నిర్భయత్వం వారికి చిన్ననాటి నుంచి సహజసిద్ధమై ఉంది.

బాబా అయితే ఇప్పుడు వెళ్ళిపోయారు. రిక్తత(శూన్యత) శూన్యావకాశం అనుభవమవుతోంది. ఆయనింత తొందరగా పోతారని అనిపించేది కాదు. ఇంకా నాల్గైదు సంవత్సరాలు గడుస్తాయనిపించేది. ఆయనకు వ్యాధికూడ నయమవుతోంది. కాని

ఆయన హఠాత్తుగా నిర్ణయం తీసేసుకొన్నారు. ఆ విధంగా మానసికసూసిద్ధత ఉంది. పై గామృత్యు ప్రత్యక్షదర్శనం అయింది. అప్పునుని పరిస్థితివంటిదే ఏర్పడింది. చివరికి వారి యీ దేహావసానం ఒక ప్రత్యేక పద్ధతిగా ఉంది. ఇది ఒక విధమైన సమాధియే. మృత్యువువైపుకి వెళ్ళటం- అందులోనూ సమత్వంతో వెళ్ళటమనేది చాల గొప్ప విషయం. ఆయన కర్తవ్యం పూర్తయి పోయింది. దేహమింకా నడుస్తోంది. అటువంటప్పుడు రోగంతో మరణించటానికి బదులు యోగంతో మరణించటం ఆయన యిష్టపడ్డారు."

-శివాజీభావే *

ఆభిజాత్యం గమనించి ఆశ్రమ ప్రవేశం చేయిద్దాం.

**ఆభిజాత్యం :-**

మహారాష్ట్రలో కులాబా జిల్లా గాగోడా గ్రామంలో 1895 సెప్టెంబరు 11వ తేదీని వినోబా ఒక బ్రాహ్మణ కుటుంబంలో జన్మించారు. వీరు నలుగురు సోదరులు, ఒక సోదరి. వీరిలో వినోబా అందరికంటె పెద్ద. తండ్రిగారు శ్రీ నరహరి శంభూరావు. ఆయన బరోడా రాజ్యంలో ఒక ఉద్యోగి. వినోబా తాతగారు శంభూరావుభావే. చాల ధార్మిక ప్రవృత్తి కలవారు. కాని ప్రగతి శీలుడైన వ్యక్తి. వినోబా తల్లి భక్తురాలు. ఆమె పేరు రుక్మిణీదేవి. ఆమెకు వందలకొలది మరాఠీ భజనలు కంఠస్థం.

* "మైత్రి" డిసెంబరు 82 సంచిక — 27-11-82

తాతగారు సాధారణంగా గాగోదాలోనే ఉండేవారు. కానీ సంవత్సరానికి కొన్ని నెలలు "వాయీ" వెళ్ళి ఉంటూ ఉండేవారు. అక్కడి ఒక శివాలయం కార్యకలాపాలు భావే కుటుంబం అధీనంలో ఉండేవి. చిన్నప్పుడు వినోబా తన తాత గారిదగ్గరే ఉన్నారు. అందుచేత తాతగారి ప్రభావం ఈయన మీద బాగా పడింది. తాతగారు శివాలయంలో శంకరుని ముందర భజనకి ముసల్మానుల్ని కూడ పిలిచేవారు. దేవాలయం హరిజనుల కోసం తెరిపిస్తూ ఉండేవారు. హిందువులకిది క్రొత్తది కాదు. ఈ విధమైన సమాజ సంస్కరణ బీజాలు చిన్నతనం లోనే భావే మనస్సులో నాటుకొన్నాయి. గాంధీజీ ఆశ్రమా నికి వెళ్ళటానికి తగిన మానసిక భావాన్ని కలిగించినవాడు తాతగారే. భక్తి భావం, దైవభావన తల్లిగారి ప్రవృత్తివల్ల, ఆమె మాటలవల్ల వినోబాకు అబ్బాయి. వినోబా నాయనమ్మ గంగాబాయి చాల యోగ్యురాలు. దృఢనిశ్చయంగల వనిత. తన 55వ యేట చదువు నేర్చుకొన్న మహిళ. విజయశీల హృదయంతో కుటుంబ కష్టనష్టాలన్నీ ధైర్యంగా సహించేది. వినోబా తండ్రి నరహరిరావు గొప్ప వివేకశాలి. సుశిక్షితుడు నియమ నిష్ఠలుగల వ్యక్తి. పాశ్చాత్య విద్యావిజ్ఞానాలంటే ఆయనకు ప్రేమ. "ఖాకీ" బట్టలా విష్కరించిన కీర్తి ఆయనదే. దాన్ని తర్వాత ఇంగ్లీషు ప్రభుత్వంవారు తమ సేనకు యూని ఫారంగా స్వీకరించారు. బరోడా కళాభవనంలో చదివి ఆయన కళా శిల్పాలలో డిప్లొమా పొందారు. కొంతకాలం బకింగ్ హామ్ మిల్సులో రంగుల విభాగంలో పనిచేసి తరువాత బరోడా

వెళ్ళి పోయారు. అక్కడ (రాజ్యకీసేవామేఁ) ఎస్టేటులో "చైపిష్టు కమ్కర్క్"గా పనిచేశారు గొప్ప నమ్మకస్థుడు. బాధ్యతగల వ్యక్తి. రాత్రి దాకా ఆఫీసులో కూర్చొని తన పని పూర్తిచేశాకే లేచేవాడు. ప్రమోషన్ కావాలని ఆశపడేవాడు కాదు. తన అన్నిపనుల్లోను సమయాన్ని బాగా పాటించేవాడు. శుభ్రత నభిమానించేవాడు. పరిశోధన ప్రియుడు. బట్టల అద్దకాలలో, రంగులు ఎన్నటంలో ప్రయోగాలు చేస్తూ ఉండేవాడు. గంభీర స్వభావుడు. నరహరిరావు తన పుత్రుడు వినాయక్ (వినోబా) ఇంగ్లీషు ఫ్రెంచి చదివి విదేశాలకు వెళ్ళాలనీ, లేదా బారిష్టరు కావటంగాని పారిశ్రామిక వేత్తగానో, రసాయన శాస్త్రవేత్తగానో పేరు పొందటంగాని జరగాలని కోరుకొనేవారు.

వినోబా తల్లి రుక్మిణిదేవి. ఆమె ప్రేమ స్వరూపురాలు. వ్రతోపవాసాదులు నిష్ఠగా సాగించేది. "దానం చేసే వాడు దేవుడు. చెయ్యి విదపనివాడు రాక్షసుడు." అనే మంత్రం వినోబా చిన్నప్పుడు తల్లి దగ్గరే నేర్చుకొన్నారు. ఇది ఆయన జీవనానికే ఒక గురు మంత్రమయింది. ఆమెకు అస్పృశ్యుల యెడల చాల జాలి ఉండేది. వారికామె అనేక విధాల సాయ పడుతూ ఉండేది.

సంభాషణలో ఎప్పుడైనా తల్లి ప్రసక్తివస్తే వినోబా కంఠం రుద్ధమయ్యేది. కళ్ళవెంట నీళ్ళు కారేవి. ఒకసారి వినోబా తన సహచరుడైన కార్యకర్తతో చెప్పారు. "మా తల్లివల్ల నాకు చాల బలం లభించింది. ఆమెకు నా శక్తి మీద

హాస్థ్యులేని విశ్వాసం ఉండేది. ఆమె యొక్క ఆ విశ్వాసమే నాకు చాల బలమిచ్చింది". అని, ఒకసారి ఆమె పొరుగింటి వారికి వంటచేసి పెట్టటానికి వెడుతూ తమ యింటిలో ముందు వంటచేసి పెట్టుకొని వెళ్ళింది. వినోబా కీపని బాగాతోచక "అమ్మా! ముందు నీవు మనయింటిలో వండిపెట్టుకొని తర్వాత పొరుగు వారికి చేసిపెట్టటం ఏం బాగుంది?" అనడిగారు. రుక్మిణీదేవి వెంటనే- "విన్యా, నీకు నా ఉద్దేశమర్థంకాలేదు. పక్కవాళ్ళింటికి ఆలస్యంగా మన వంట అయ్యాక ఎందుకు వెడుతున్నానంటే వాళ్ళు వేడివేడన్నం తింటారని; ముందే అక్కడ వండిపెట్టివస్తే అనె వాళ్ళు తినేసరికి చల్లారిపోతుందనిని.

ఒకసారి ఒక ముష్టివాడు అడుక్కోటానికి వచ్చాడు. వాడు లావుగా పుష్టిగాఉన్నాడు. అతనికి బిచ్చం పెడుతోంటే తల్లితో వినోబా "అమ్మా! ఇలాంటి వాడికి బిచ్చంపెట్టి అతని సోమరితనం నీవు పెంచటం లేదా?" అన్నాడు. ఆమె అప్పటికే అతనికి బియ్యం పెట్టేసింది. తర్వాత "విన్యా, మనగుమ్మం దగ్గరకు వచ్చిన బిచ్చగాడు భగవంతుడు. అతడు సుపాత్రుడో కుపాత్రుడో నిర్ణయించటానికి మనమెవరం?" అంది.

ఐదుగురు తోడబుట్టిన వారిలో వినోబా పెద్దవాడు. అందరికంటె చిన్నవాడు, "దత్తాత్రేయ". అతడు చిన్నప్పుడే దివంగతుడయ్యాడు. సోదరి పేరు శాన్తాబాయి. పెళ్ళయిన తరువాత ఆమె కూడ చిన్నవయసులోనే చనిపోయింది. మిగిలిన ఇద్దరు సోదరులు- బాలకోబా, శివాజీ, వినోబాలాగే బాలబ్రహ్మచారులు. పీరిద్దరూ కూడ తమ జీవితాలు విద్యాధ్యయన

సంఘసేవలకు అంకితం చేశారు. బాలకోబాకు ప్రకృతి చికిత్స అంటే ఇష్టం. పూనా దగ్గఱ "ఉరులి కాంచన్"లో గాంధీజీ స్థాపించిన "నిసర్గోపచార్" ఆశ్రమానికి బాలకోబాయే సంచాలక్. పవనార్‌లో వినోబా యొక్క బ్రహ్మ విద్యామందిర్‌లో మంచి చెడలు చూడటానికి బాలకోబా సంవత్సరాని కార్నెలలు పవనార్‌లో ఉంటారు.

శివాజీ గొప్ప భాషాశాస్త్రవేత్త. ఆయన మరాఠీలోను సంస్కృతంలోను గొప్పపండితుడు. ఆయన ధూలియాలో గాంధీతత్త్వజ్ఞానమందిర్‌లో ఉంటారు. తన పరిశోధన కార్య క్రమం కోసం ఆయన దగ్గఱ ముఖ్యమైన మంచి గ్రంథజాల ముంది.

రుక్మిణీదేవి తన పిల్లలతో తఱచుగా— "మీరు మనస్సులో ఏవిధమైన భయమూ పెట్టుకోకండి. భగవన్నామంలో పూర్తివిశ్వాసం ఉంచుకోండి." అని చెపుతూ ఉండేది. ఒకసారి వినోబా తల్లితో— "అమ్మా, పూర్వకాలంలోలాగ ఈరోజుల్లో కూడ సాధువులు, ఋషులు ఉంటారా?" అని అడిగారు, తల్లి— "ఆఁ ఆఁ, ఈనాడుకూడ ప్రపంచంలో ఇటువంటి సాధు పుంగవులున్నారు. కేవలం మనం వారిని తెలుసుకోలేక పోతున్నాం; అంతే" అన్నది. పాపం ఆమెకేం తెలుసు? ఒకనాడు ఆవిధంగా తననడిగిన పిల్లవాడే ఒకనాటికి భారత మహోన్నత సత్పురుష పుంగవుల్లో ఒకరుగా లెక్కింప బడతాడని!

అటువంటి తల్లికే ఒక సందర్భంలో ఈ పుత్రుడు (వినోబా) ఒక చక్కని విషయం వివరించిన సంగతి ఆసక్తి దాయకంగా ఉంది. అదేమిటంటే— రుక్మిణీదేవి శంకర భక్తురాలు. ఒకసారి ఆమె శంకరునికి లక్ష అక్షతలతో అర్చన చేసింది. నరహరిరావు ఎగతాళిచేస్తూ "ఈ విధంగా ఒక్కొక్క గింజే లెక్కపెట్టటానికి బదులు ఒక్కసారి లెక్కపెట్టుకొని తూచిపెట్టుకొని ఒకేసారి భగవంతుడిమీద అవన్నీ వేసేసెయ్యి. ఎక్కువ తక్కువల సమస్య లేకుండా మరికాసిని బియ్యం పైన పోస్తే సరి" అన్నారు. ఇది విని సందేహంలో పడి తన పిల్లవాడైన వినోబాని సలహా అడుగుతూ— "విన్యా, ఇలా చేస్తే బాగుంటుందా ?" అంది. వినోబా— "అమ్మా, నీవేమీ బాధ పడకు. ఇల్లా తూచి ఒకేసారి అన్ని బియ్యమూ పైనపోసెయ్యటం మంచిదికాదు. అది పూజకాదు. ఒక్కొక్క గింజవేస్తూ భగవన్నామోచ్ఛారణం చేయటం భజన అవుతుంది. భగవద్ధ్యానమవుతుంది" అన్నాడు. తల్లికీ సమాధానం చాల సంతోషం కలిగించింది. భర్త (నరహరిరావుగారి)యొక్క వ్యావహారిక బుద్ధివాదం వల్ల కలిగిన వ్యాకులత్వం తొలగిపోయింది.

ఒకసారి వినోబా బాబాయి చనిపోయినట్లు తంతివచ్చింది ఆ బాబాయి అంధుడు. అప్పుడు వినోబా తల్లిని మనం మైల పట్టటంలేదేమిటని అడిగాడు. ఆమె "విన్యా, ఆయన నిజంగా బాబాయికాదు. ఒంటరివాడు. ఎవరూ నా అన్నవాళ్లు లేకపోతే ఆయన్ని మనం మన యింటిలో అట్టేపెట్టుకొన్నా"మని

చెప్పింది. అప్పుడు తెలిసింది వినోబాకు— నిజంగా ఆపోయిన బాబాయి తమ కుటుంబంలో వాడు కాడని, ఆమె దిక్కులేని వాళ్ళకి ఏవిధంగా సహాయపడుతూ ఉండేది. వినాయక్‌తో ఆమె తఱచు చెప్తూ ఉండేది— నిజమైన సుఖం సంయమంలోనే ఉంటుంది. మన అవసరాలను మించి వస్తువులు పోగుచేసి కోవటం నిజమైన సుఖమూ శుభమూ కా"దని. ఇటువంటి బోధలు చేసిన తల్లికి కొడుకుమీదకూడ విశ్వాసముండేది. అందుకే వినోబా ఇంటర్ పరీక్షకు వెళ్ళటానికి బదులు కాశీ వెళ్ళినట్లు తెలిసినప్పుడు అంటూ ఉండేది. "నాబిడ్డ ఎప్పుడూ ఏతప్పుపనీ చేయడు. అతడు దేశాన్ని భగవంతుణ్ణి సేవించాలని నిశ్చయించుకొన్నాడు. నేనందుకు గర్వపడతాను." అని. ఈ విధంగా తయారుచేసిన తల్లికి సజ్జనుడైన తనయుడు వినోబాజీ.

ఆరోజుల్లో తల్లికి "గీత" వినిపిస్తూఉండే వినోబాతో ఆతల్లి, "విన్యా, నీవు స్వయంగా గీతకు సరియైన సరళ మరాఠీ పద్యాల్లోకి అనువాదం చేయరాదా" అని అంది. ఆమె బ్రతికి ఉండగా ఆ పని వినోబా చేయలేకపోయినా అందుకాయనకు 1930-'31లో సమయం లభించింది. ఆయన సంపూర్ణంగా గీతానువాదంచేసి తల్లియొక్క పవిత్ర స్మృతికిగాను దాని పేరు "గీతాయీ" అని పెట్టారు. అంటే గీతామాత అని అర్థం. ఈ విధంగా ఆ అనువాదంలో గీత-మాత ఇద్దరియొక్క ప్రేమ ఏకరూపాన్ని పొందింది.

వినోబా తల్లి - తండ్రి బలవంతరావ్ వైద్య గొప్ప గాయకుడు. వినోబా మాకు కీర్తనలు రచించారు. వినోబా పినతండ్రి గోపాలరావు తఱచుగా "వినోబాకు— "శ్రీ గణేశా యనమః" (అక్షరాభ్యాసం) నేనే, నేర్పానంటూ ఉండేవాడట. వినోబా విషయం వస్తే ఆయన కళ్లు ఆనందబాష్పాలతో నిండి పోయేవి. ఆయన గొప్ప భాషకుడు. "మా వంశంలో ఒక మహాపురుషుడు పుట్టా"డంటూ పొంగిపోయేవాడట.

బాలకోబా తన అన్నగారినిగురించి యిలా అన్నారు—

"ఆయన మామూలుగా మాటలాడటమే ఉపదేశం. కష్టపడి ఆయన బోధిస్తూ ఉంటారు. తుకారాం చెప్పినట్లు అవు ఏ విధంగా అయితే తన దూడమీద తన దృష్టి ఉంచు తుందో ఆవిధంగానే ఆయన నన్ను చక్కదిద్దుతూ ఉంటారు"అని.

---

## సేవాధర్మః పరమగహనః
## యోగినామప్యగమ్యః

వివేకానంద, తిలక్, గాంధీ- ఈ ముగ్గురి ఆలోచనా దృష్టి సమా నంకాదు. వాటిలో అభిరుచి భేదం చాల ఉంది. కాని చిత్తశుద్ధికి సేవా యోగం, ధ్యానయోగం కంటె అధిక సాధకమనేదాన్ని ఈ ముగ్గురూ అంగీకరిస్తారు. వారి యీ ఏకవాక్యత మనవంటి సేవకులనిష్ఠని దృఢం చెయ్యటానికి సమర్థమగు గాక. 17-7-52.

సేవ, అలసత్వము లేకపోవుట, దక్షత, ప్రేమ, బుద్ధిమత్త, నిర్భయత మొ॥ అనేక గుణాలు సేవకు వెనకనే వస్తూనే ఉంటాయి. సేవ ఈ గుణాలకి తల్లియే. — వినోబా

---

# ఆశ్రమవాసం

వినోబా అసలుపేరు వినాయకరావుభావే. ఆయన తండ్రిపేరు నరహరిశంభూరావుభావే. తాతగారు శంభూరావు భావే. వినాయకరావు బాల్యం, విద్యాభ్యాసం కొంత, అయిన తరువాత బ్రహ్మజిజ్ఞాస కలిగి చదువుకి స్వస్తిచెప్పి కాశీవెళ్లాడు. అక్కడ అధ్యయనం సాగించినమీదట సంస్కృతంద్వారా ఆధ్యాత్మిక విద్యార్జన జరిగి అది మేధాశక్తి వ్యాప్తియు కములానికీకూడ వికాసాన్నిచ్చింది. వినాయక్ మంచి పండితు డయ్యాడు. కాని ఆసంగతి యెవ్వరికీ తెలియదు.

4-2-1916 తేదీని కాశీవిశ్వవిద్యాలయ శంకుస్థాప నోత్సవ సభలో గాంధీజీ చేసిన ఉపన్యాసం పత్రికలలో చదివిన వినాయక్ గాంధీజీతో ఉత్తర ప్రత్యుత్తరాలు సాగించాడు- నిస్సంకోచంగా తన సందేహాలు గాంధీజీ ముందుంచాడు. తాత్త్విక ప్రశ్నలు సిద్ధాంత పరమైనవి ఉన్నాయి. చివరకి బాపూ వీటన్నిటికి సమాధానాలు ఉత్తరాలద్వారా సాధ్య పడవు అందుచేత అహమ్మదాబాద్ వస్తే కొచరబ్ - ఆశ్రమం లోనే నీశంకలకన్నిటికీ సమాధానాలు పొందవచ్చునని వ్రాశారు. ఆ మహిమాన్వితమైన సమాగమం 7-6-1916 తేదీని జరిగింది.

సబర్మతీ ఆశ్రమంలో పూర్వంనుంచీ ఉన్న "మామా ఫడకే" ఆరోజున వినాయక్‌ని స్వయంగా ఆశ్రమంలోకి తీసికొని

వెళ్ళారు. గాంధీజీ ఆ సమయంలో వంటశాలలో కూరలు తరుగుతున్నారు. ఇది గాంధీజీ దినచర్యలో భాగం. కూరలు తరుగుతూఉండగానే సంభాషణ జరిగింది. సంభాషణలో ఈ ఇరవై యేళ్ళయువకుడికి స్వాగతంచెపుతూ గాంధీజీ యథావిధిగా ఆశ్రమంలో సభ్యుడుగా చేరమని చెప్పారు. ఈ సమావేశం వినాయక్ జీని ప్రభావితం చేసింది. భావేజీ దీన్నిగురించి ఇలా వ్రాశారు—

"కాశీలో ఉండగా హిమాలయాలకు వెళ్ళాలనేది నాముఖ్యమహాత్వాకాంక్ష. బెంగాల్ వెళ్ళాలనికూడ లోపల ఒక కోరిక ఉంది. కాని ఆరెండింటిలోను ఒక్క స్వప్నమూ ఫలించలేదు. భగవంతుడు నన్ను గాంధీజీ దగ్గరకు చేర్చాడు. వారిలో నాకు కేవలం హిమాలయాల శాంతిమాత్రమేకాక (బెంగాల్ దేశానికి ప్రత్యేకమైన) ఉజ్జ్వల దేశభక్తికూడ లభించింది. నా రెండు కోరికలూ ఫలించాయని నామనస్సులో అనుకొన్నాను."

కొన్నివారాలవరకు వినాయక్ ఆశ్రమ కఠిన కార్యక్రమంలో పాల్గొన్నాడు. ఒక సామాన్యమైన ఆశ్రమవాసి లాగే అతడు వంటశాలలోను ఉద్యోగ (పరిశ్రమ)శాలలోను ఆశ్రమానికి చెందిన తోటలలోను పనిచేశాడు. ఒకరోజు తెల్లవారు జామున నాలుగుగంటలకు వినాయక్ భగవద్గీతా శ్లోకాలు, ఉపనిషన్మంత్రాలూ, ఉచ్చైఃస్వరంలో గానం

లేరు. దేశంలో ఎక్కడికో వెళ్లారు. తిరిగి వచ్చాక ఈ వృత్తాంతం విని ఆయనన్నారుకదా? "మురికి తొలగించి శుభ్రం చేయటమనేది ఒక చక్కని ధార్మిక కార్యం. ఇంక ఇది మన నిత్యకృత్యాలలో ఒకటవుతుంది. ఇది నచ్చనివారు ఆశ్రమం విడిచిపెట్టేయవచ్చు." అని. కొందరాశ్రమవాసులు దీనిమీద నిజంగా ఆశ్రమం వదలిపెట్టి వెళ్లిపోయారు వారిలో గాంధీజీ అక్కగారుకూడా ఉంది.

ఆశ్రమంలో మొదట మిల్లుదారంతోటే బట్టనేసేవారు. కొన్నేళ్లతర్వాత చరఖా వచ్చింది. చేతితో వడకటం మొదలయింది. వడికిన బట్ట ముతకగా ఉండేది.

వినోబా వచ్చాక వడకటంలోను నేత నేయటంలోను చాల మార్పు వచ్చింది. వినోబా గణితశాస్త్రం అధ్యయనం చేసిన వాడవటంచేత ప్రతివిషయం గణితదృష్టితో చూస్తారు. అసలు వినోబాకు (రాట్నంతో) వడకటం ఆయన శిష్యుడు కృష్ణదాసుగాంధీ నేర్పాడు. త్వరలోనే ఆయన ఖాదీ శాస్త్రంలో నిష్ణాతుడయ్యాడు. తర్వాత గాంధీఆశ్రమంలో కూడ నూలుతీయటం నేతనేయటం అనేదానికి ఒక సువ్యవస్థిత శాస్త్రరూపాన్నిచ్చారు. ఈ పనిమీద ఆయన గంటలకొలది పరిశ్రమచేసేవారు. అనేకమంది ఆశ్రమవాసులకు, ఆశ్రమ రాష్ట్రీయశాలలో విద్యార్థులకుకూడ ఆయన ఈకళ నేర్పారు. కోచరబ్‌లో ఆశ్రమం రెండు సం॥ ఉండి సబర్మతికి (ఇప్పుడున్నచోటికి) వచ్చింది. ఇక్కడకూడ వినోబా నూలుతీయటం, నేయటం మురికి తుడిచి శుభ్రంచేయటం విద్యనేర్పటం చేశారు.

కొన్ని నెలలాయన ఆశ్రమపు వంటశాలలో వంటపనిచేశారు. ఆయన చేపట్టినపని ఏదైనా దానిమీద తన మనోలగ్నత కార్య కుశలతలయొక్క ముద్రవేసిగాని వదిలిపెట్టరు. రాష్ట్రీయశాల (పాఠశాల)లో ఆయన ఉపాధ్యాయుడుగా ఉన్నప్పుడు చదువు చెపుతూఉంటె ఆయనస్వరం ఆవీధిఅవతల ప్రక్కకికూడ వినిపించేది. విద్యార్థులకు బోధించేటప్పుడాయన తన ప్రాణ మిచ్చి వాళ్లని పరిపూర్ణుల్ని చేస్తున్నారా! అనిపిస్తుంది. అర్థ మనస్కతతో పనిచేయుట మాయనకు నచ్చదు. "యోగఃకర్మ సుకౌశలమ్" అనే గీతావాక్యం ఆయనకు జీవనాదర్శమయింది.

నెలల తరబడి వినోబా సబర్మతినుంచి బాల్చిలతో నీరుతెచ్చి ఆశ్రమంలో మొక్కలకు పోశారు. రోజు కైదు గంటలీ కార్యక్రమముండేది. వినోబా చేసే ఈ కఠిన పరిశ్రమపైపు ఆశ్రమ వాసులైన ఇతర సభ్యుల దృష్టి కొన్ని వారాలవఱకు పడలేదు. ఇదివారు గమనించినపుడు ఆయన దుర్బల శరీరము- ఈ పరిశ్రమ శీలత చూచి ఆశ్చర్యచకితులై పోయారు. ఒకనాడు గాంధీజీ- "వినోబా! ఇంత పరిశ్రమ నీవెలా చేయగల్గుతున్నా"వని అడిగితే వినోబా వినయంగా - బాపూ! ఇదంతా చేసే బలం నాకు శరీరంకాదు, మనస్సిస్తోంది" అన్నారు.

ఒకసారి గుజరాతీ బోధకుడు సెలవు మీద వెళ్ళినపుడు గాంధీజీ వినోబా నా పని కూడ చక్కబెట్టమన్నారు. ఆశ్ర మంలోకి వచ్చాక వినోబా వ్యవహారానికి తగినంత గుజరాతీ నేర్చుకొన్నారు గాని అంతకంటె లేదు. అందుచేత మొదట

ఇటూ అయితే క్రింద నీటిలో పడేవారే. కాని యిక్కడ గణి తమే ఆయన్ని రక్షించింది, కళ్ళతో చూడలేక పోతున్నారు కాని లెక్క ప్రకారం సరియైన అంచనాతో అడ్డచెక్కలమీద పరుగెత్తి ఆయన వంతెన దాటనేదాటారు. "వినోబా! ఎడమ వైపుకు దూకేసెయ్యి" అని కాకా అరిచాడు. ఆయన దూకారు. బ్రతికి బయటపడ్డారు. గాంధీజీ ఈ సంగతివిని "కళ్ళజోడు కొనుక్కో, ఇక ముందెప్పుడూ ఇటువంటి సాహసం చెయ్యకు" అన్నారు. అటుపైన వినోబా కళ్ళజోడు చెప్పులు వాడడాని కంగీకరించారు.

ఆశ్రమంలో ప్రార్థన సమావేశంలో కూడ హాజరు తీసి కొనే అలవాటుంది. ఆశ్రమ వ్యవస్థాపకులు మగన్‌లాల్ గాంధీ పేర్లు పిలుస్తూ ఉండేవారు. గాంధీజీతో సహా ఆశ్రమవాసు లంతా "ఓం" అని హాజరు పలుకుతారు. ఒకరోజున మగన్ లాల్‌జీ హాజర్ తీసికొని ఆశ్రమవాసులు మొత్తం పదిహేను గురు హాజరయ్యారన్నారు. వినోబా "నిజానికి హాజరైనవారు పద్నాలుగురే"అన్నారు. అందరూ ఆశ్చర్యపడ్డారు. మగన్‌లాల్ మళ్ళీ పదిహేనుగురని చెప్పారు. బాపూజీ వినోబాతో నీ ఉద్దేశ్యమేమిటన్నారు. అప్పుడు వినోబా శరీరాలతో పదిహేను గురు హాజరయ్యారుగాని హాజరు తీసికొనే ఆయన మనస్సు పనిమీద ఉంది. కనుక ఆయన హాజరైనట్లు కాదన్నారు. అప్పుడు గాంధీజీ "నిజమే, ప్రార్థనలో మనస్సును భగవంతుని మీద ఏకాగ్రతతో లగ్నం చేయాలి. లేకపోతే ప్రార్థనకు విలువే లేదన్నారు.

ఆశ్రమంలో విద్యార్థి వసతి గృహానికధిపతిగా అధ్యాపకుల్లోంచి ఒకర్ని విద్యార్థులే ఎన్నుకొంటారు. ఒకసారి కలేల్కర్ సాహెబ్‌ని కాకుండా విద్యార్థులు వినోబానెన్నుకొనేసరి కందరికీ ఆశ్చర్యమేసింది. ఎందుచేతనంటే వినోబా స్వభావం కఠినమైనది. ఆయన పిల్లల యెడల కఠినంగా ప్రవర్తిస్తాడని అందరూ అనుకొన్నారు. ఆయన వసతి గృహాధిపతి అయ్యారు. ఆయన ప్రతిరోజు ప్రొద్దున్నే చాల ప్రేమతో విద్యార్థుల్ని మేలుకొలిపేవారు. తన సహజ మధురస్వరంతో శ్లోకాలు (భజనలు) కీర్తనలు పాడేవారు. దానితో నిద్రపోయే బాలురానందంతో భక్తి వాతావరణంలో మేల్కొనేవారు. ఈ విధంగా మేల్కొల్పటమనే పద్ధతి బాగుంది. త్వరలోనే ఆయన సర్వప్రియుడైన ఛాత్రాలయ గృహపతి, ప్రేమపాత్రుడైన అధ్యాపకుడు అయ్యారు. ఆయన తన విద్యార్థుల్ని హృదయపూర్వకంగా ఆదరించేవారు.(తరువాత) అఖిల భారత సర్వసేవా సంఘాధ్యక్షుడైన వల్లభస్వామి, ఛగన్‌లాల్ గాంధీ పుత్రుడైన ప్రభుదాస్ కృష్ణదాసుగాంధీ కూడ వినోబా శిష్యులే. జుగత్‌రామ్‌దవే, కిశోర్‌లాల్ మశ్రువాలా. అప్పాసాహెబ్ పట్వర్ధన్, ఈ రాష్ట్రీయ విద్యాశాలలో వినోబాతోపాటు ఉపాధ్యాయులుగా ఉన్నారు. కాకాసాహెబ్ కలేల్కర్ ఈ విద్యాలయానికి ప్రాచార్యులు. తర్వాత ఆయన గుజరాత్ విద్యాపీఠానికి ఉపకులపతిగా నియుక్తులయ్యారు. ఆశ్రమంలో మొదట వినోబా బునాయీశాల (నేత నేసే) వరండాలో ఉండేవారు. తెల్లవారు జామున నాల్గు గంటల నుంచి శ్లోకాలు

మంత్రాలు ఉన్నత మధుర స్వరంతో చదవట ప్రారంభిం
వారు. తర్వాత హృదయకుంజ్ దగ్గఉన్న కుటీరంలో ఉం
టం జరిగింది. హృదయకుంజ్‌లో బాపూ, బా ఉండేవారు
ఈ వినోబా కుటీ ఇప్పటికీ అలాగే ఉంచేశారు. వినోబా వార్ధా
వెళ్ళారు. ఇందులో మీరాబహెన్ ఉంటూ వచ్చారు.

ఛాత్రాలయంలో వినోబా వ్యాయామ శిక్షకుడుగా
కూడ పని చేశారు. విద్యార్థులకు రోజు సూర్య నమస్కారాలు
ఇతర వ్యాయామము నేర్పేవారు. కబడీ, ఖోకోలలో కూ
ఆయన పాల్గొనేవారు. హింసా ప్రవృత్తితగ్గి అహింసా సహ
కార భావాల్ని పెంపొందించగలిగే ఆటలనెన్నుకొనే ప్రయ
త్నం చేసేవారు. క్రికెట్ వంటి పాశ్చాత్య క్రీడలకెప్పుడూ ఆశ్ర
మంలో ప్రోత్సాహం లేదు. విద్యాలయంలో విద్యార్థులకు
దేశభక్తులు, నాగరకులు, స్వాతంత్ర్య సమరయోధులు కాగలిగే
లాగ శిక్షణ గరపుతూ ఉండేవారు.

ఆశ్రమంలో వినోబా ఒక నిమిషం కూడ విశ్రాంతి
లేకుండా ఛాత్రాలయం (హోస్టల్)లో విద్యార్థుల్ని చక్కదిద్ద
టం, పాఠశాలలో వివిధ విషయాలు బోధించటం, కొన్ని
గంటలు నూలు తీయటం, నేయటం, వంట చేయటంలో సాయ
పడటం, పిండి విసరటం, పార, గునపం తీసికొని తోటలో పని
చేయటం, ఇవన్నీ చేస్తూనే ఉండేవారు.

చదువు చెప్పేటప్పుడు కూడ శక్తినంతనీ ఉపయోగించి
శ్రమపడి చెప్పేవారు. ఏ పని చేసినా తన్మయత్వంతో చేయటం

ఆయన స్వభావం. ఆయన మంచి నేర్పుగల ఉపాధ్యాయుడు. ప్రభుదాసుకు వ్యాకరణం చెప్పటం కాకా కలేల్కర్, నరహరి పరీఖ్ లకు సాధ్యపడకపోతే గాంధీజీ ఆయన్ని వినోబా దగ్గరకు పంపారు. వినోబా ఆయనకి సంస్కృతం చెప్పటం మొదలు పెట్టారు. ప్రత్యక్షంగా వ్యాకరణం చెప్పక రఘువంశంవంటి మనోరంజకమైన గ్రంథం చెప్పటం ద్వారా దాన్ని బోధించారు. ఆయన సంస్కృతంలో బాగాలోతులు తెలిసిన విద్వాంసుడు. కాని ఆయనకి కాళిదాస శాకుంతలం చదవాలనే కోరికైనా ఎప్పుడూ కలగలేదట. సంస్కృత సాహిత్యంయొక్క గొప్పదనం దాని ఆధ్యాత్మికతలోనేగాని సాంసారిక విషయాల్లో లేదనేది ఆయన నిశ్చితాభిప్రాయం.

ఒకసారి ప్రభుదాసుగాంధీ "నాకేదైనా చేయదగిన ముఖ్య విషయం చెప్పండి" అనడిగితే వినోబా "శరీరంతో పని చెయ్యి- అప్పుడు కూడ భగవన్నామస్మరణ చేస్తూఉండు. సఫలమూ ధీర్ఘమూ అయిన జీవనానికిదేమార్గ"మన్నారు.

వినోబా, ఆశ్రమంలో శుద్ధ ఖాదీ తయారవటం మొదలయ్యాక మూడైపైయిదు అంగుళాల వెడల్పున్న ధోతీకట్టుకోవటం ప్రారంభించారు. చొక్కా తొడుక్కోక కేవలం భుజం మీదవేసుకొనేవారు. మెల్లమెల్లగా చొక్కా మానేశారు. ధోవతి యొక్క మిగిలిన భాగమే శరీరం మీద కప్పుకోవటం జరిగేది. కొన్నాళ్ళ తర్వాత ధోతీ వెడల్పు 27 అంగుళాలకు తగ్గించారు. ఒంటిమీద మరో కుట్టనిగుడ్డ వేసుకోవటం మొదలు పెట్టారు. ఇదే యిప్పటికీ ఆయన ధరించే దుస్తుల పద్ధతి.

ఆశ్రమ జీవనం కఠినమూ, పరిశ్రమ ప్రపూర్ణమూ అయ్యేసరికి కొందర విసిపోయి ఇంటికి వెళ్ళిపోతామన్నారు. వ్యవస్థాపకుడు వినోబాను సలహా అడిగితే వెడతామన్న వాళ్ళని వెళ్ళనివ్వండి. నియమ రహితంగా చాలమంది ఉండటం కంటె నియమ పూర్వకంగా కొద్దిమంది ఉండటమే మంచిదన్నారు. సిద్ధాంతం, నియమం, అనేవాటి విషయంలో సడలింపు ఆయనకు గిట్టదు.

వినోబా తమ్ముడు బాలకోబా బునాయీశాలలో గంటలకొలది పనిచేస్తేవాడు. దాని వ్యవస్థాపకుడు ఛోటేలాల్. ఆయనతో తేడావచ్చి బాలకోబా ఆయన చెప్పినట్లు చేయనన్నారు. ఆయన క్రమశిక్షణ చర్య తీసికొంటానంటే ఆ విషయం బాలకోబా వినోబా దృష్టికి తెచ్చారు. వినోబా "ఆయన దగ్గర పని చేసే వాళ్ళంతా ఆయన చెప్పినట్లు వినాల్సిందే ప్రతివాడూ ఏదో ఒక పేచీపెడితే ఏ సంస్థా నడవదు. నీవు చెప్పేది సరియైనదే కావచ్చు. నీ అభిప్రాయం నీవాయనతో చెప్పావు. ఇంక నిర్ణయమాయనదే. ఆ నిర్ణయం నీవు పాలించవలసిందే"అన్నారు. బాలకోబా ఒప్పుకొన్నారు. వ్యవహారం సమాప్తమయింది.

వినోబా ఆశ్రమానికి వచ్చాక ఆయన సన్నిహిత మిత్రులు రఘునాథ శ్రీధర ధోత్రే, గోపాలరావు కాలే, బాబాం మోఘే, ద్వారకానాథ్ హర్కారే కూడవచ్చి ఆయనతో కలిశారు. చిన్నతనంలో ఆలోచించి అర్థం చేసికొని కలిసిపోయిన మిత్రులు అన్ని పరిస్థితులలోను ఆయనతో బుజం బుజం కలిపి పనిచేస్తూ వచ్చారు. జమనాలాలీజీ బజాజ్ వర్ధాలో కూడ సబ

ర్మతీ ఆశ్రమంవంటి సత్యాగ్రహాశ్రమం ఒకటి ఉండాలని కోరారు.

ఈ ఆశ్రమస్థాపన కోసం ఈ మిత్రులంతా వార్ధా కూడ కలిసి వెళ్ళారు.

## * నందుని వందనం

(వినోబా గృహత్యాగంచేసి బాపూ ఆశ్రమంలో చేరినప్పుడు ఆయన తన తల్లిదండ్రులకు (మహారాష్ట్రి) పద్యబద్ధంచేసి వ్రాసిన (1-1-1917 నాటి) లేఖకు ఈ గ్రంథకర్త చేసిన పద్యానువాదం.)

ముందు తల్లికి తండ్రికి వందనమ్ము
నందనుడనైన నేనిపు డంది యిచ్చి
పిదప ప్రభువునకర్పింతు పదవిహీన
దీనదాసుడనైన నాదైన వినుతి.

భవదీయాశీర్బలమున
ప్రవిమలమౌ ప్రభుకృపాప్రభావము వలనన్
నివసించుచుంటి, నాశ్రమ
భువి, నేము న్నింటనున్న, పోలిక సుఖినై

శ్రేయస్స్థానము విడిచియు
శ్రేయస్కర మాశ్రమమ్ము చేరితి జింతన్,
శ్రేయశ్శ్రీయోభావ వి
ధేయులు నను జేసిరిచట తృప్తునిగాగన్

మాతృమానసముందు నాత్మజునిగూర్చి
సంతతమ్మును చింతావిషణ్ణమగుచు;
వ్యర్థమైనది చింత తా నందనేల ?
సర్వమెఱిగెడి నాజగజ్జనని తానె !

అందులకే నాప్రార్థన;
చెందకుడు విషాదమెపుడు చిత్తములందున్
పొందిన ప్రభుకృప, దాసుడు
పొందునె తా, మృతిని, విషము భోజనమైనన్ ?

* శివ - కృష్ణ - దత్త - శాంతుల
కివియినా దీవనలు శక్తిహీనములైనన్
శివసంకల్పాచారం
బవుటన్ వారలకు ప్రీతి నందింపదగున్

---

* శివాజీ, కృష్ణ, (బాలకోటా) దత్తాత్రేయుల సోదరులు, శాన్తి సోదరి.

# చివరిదాకా బాపూతో

1916లో నేను బాపూదగ్గఱకు చేరాను. అప్పుడు నేను 21 సంవత్సరాల కుఱ్ఱవాణ్ణి. ఆయన చాల నిశ్చితాభిప్రాయా లతో ఆశ్రమంలో ఉన్నారు. ఆయన భారతదేశంలో పర్యటిస్తూ మధ్య మధ్య ఆశ్రమంలో ఉంటూ ఉండేవారు. కాని జీవనవిషయకమైన ఆయన ఆలోచనలు స్థిరమై పోయినాయి. అప్పటినుండి చివరివఱకు ఆయన ఆలోచనలుకొన్ని మారుతూ వచ్చాయి. అంటే మూలభావాలకు వికాసం (పర్పదేది) కలిగేది కాని గౌతమబుద్ధుడినుంచి వస్తూఉన్న మూలభూతమైన అభిప్రాయం— ప్రేమతో వైరాన్ని జయించు. అక్రోధంతో క్రోధం జయించు, సత్యంతో అసత్యాన్ని జయించు. అనేదే దృఢంగా ఉంది. ఆయన దాన్ని ఇరవై సంవత్సరాలు ప్రయోగం చెయ్యటమయిపోయింది. కేవలం యౌవనంలో 30 ఏళ్లవయస్సులో సత్యాగ్రహ రూపకల్పన ఆయన చేశారు. అప్పటి నుంచి చివరివఱకు సత్యాగ్రహిగా జీవితం గడిపారు. అప్పటి నుంచీ నేనాయనదగ్గఱ ఉన్నాను. నేనొక జిజ్ఞాసువైన బాలకుణ్ణిగా ఆయనదగ్గఱ చేరాను. చివరివరకు ఆయన ఆజ్ఞాను సారంగా ఆయన మార్గదర్శనంలోనే సర్వదా ఆయనదగ్గఱ ఉన్నానని చెప్పగలను.

2–10–62 —వినోబా

## మంచిగుణం

మా ఆశ్రమానికొక తండ్రి తన పిల్లవాణ్ణి తీసుకొనివచ్చి "తమరు ఇతన్ని అట్టేపెట్టుకోండి" అన్నాడు. "ఈ కుఱ్ఱవాడిలో ఉన్న గుణమేమి"టని నేనడిగాను. ఆయన అన్నాడు "కుఱ్ఱాడు దుష్టుడు ఎవరి మాట వినడు" అని. నేనన్నాను— మంచిగుణం. ఎవరి మాటా విననివాడే కుఱ్ఱవాడు. లేకపోతే అతన్ని ప్రౌఢుడనాలి అని". ఈ మాట వినేసరికి ఆ కుఱ్ఱాడికి ఆశ్చర్యము కలిగింది. నేనతన్ని నా దగ్గఱ ఉంచుకొన్నాను. అతని కేనియమంగాని నిర్బంధంగాని పెట్టలేదు. కాని అతడు అన్ని నియమాలు సరిగా పాలించాడు. స్వతంత్రుడై ఉన్నాడు.

— వినోబా

## Vinoba

He had taken one year's leave from Gandhiji's Asrama to study and imbibe Hindu religious thought enshriened in the Upanishads, the Githa, the Brahmasutra, Sankara Bhashya, the Manusmrithi, Pathanjali's yoga Darsan, Nyayasutra Vaiseshik Sutra and yajnavalkya smrithi. .... .... .... .... .... .... ....
He had the potential of excelling Gandhi and starting a new era in human history. But he held himself back.

Indian Express 23-1-83

# మహర్షి

వినోబాజీ వ్యక్తిత్వంలో జ్ఞాన భక్తి కర్మయోగాల విలక్షణ సమన్వయం అద్భుతంగా కనిపిస్తుంది. ఆయన వేదాలు ఉపనిషత్తులు ఇతర సంస్కృత ధర్మగ్రంథాలు అధ్యయనం చేసినతీరు సాటిలేనిది. భారతీయ, విదేశీభాషలు సుమారు పదహారింటిలో ఆయన జ్ఞానంకూడ విశిష్టమైన దనే చెప్పాలి. ప్రేమ, కరుణ, భావాలతో ఆయన హృదయం నిండిఉంటుంది. ఆ స్వభావంచేత ప్రజలు ప్రభావితులుకాక తప్పదు. పదమూడు సంవత్సరాలు భారతదేశం భిన్న భిన్న ప్రాంతాలలో పాదయాత్ర చేశారు. ఈదూరం 36,500 మైళ్ళు. అంటే భూమి చుట్టుకొలతకంటె ఎక్కువే. ఈ పాదయాత్రలో ఆయన 44 లక్షల ఎకరాల నేల పేద, ధనిక, మధ్యతరగతి, దాతల నుంచి సంపాదించారు. అందులో 13 లక్షల ఎకరాలభూమి పొలంలేని రైతుకూలీలకు పంచిపెట్టబడిందికూడ. ఆయన సంకల్పించిన మొత్తంతో పోలిస్తే ఇది చాల చిన్నదైనా దేశంలో అన్నిరాష్ట్రాల ప్రభుత్వాలు కలిసి 24 సం॥ స్వాతంత్ర్యం తర్వాతకూడ చెయ్యలేకపోయినంత పెద్దదే. ఇదే కాక భారతదేశపు 5,60,000 గ్రామాలలోనుంచి 1,60,000 గ్రామాల గ్రామదానం ఆయనకు లభించింది. వీటిలో ఎక్కువ భాగం, బీహారు ఒరిస్సా రాష్ట్రాలలోనుంచి వచ్చింది. ఇదంతా

ఆయన ఒక్కడి ప్రయత్న ప్రభావంవల్ల— ప్రభుత్వ ప్రత్యక్ష సహాయం ఏమీలేకుండానే జరిగింది. పవేలమంది ఉత్సాహవంతులైన సర్వోదయ కార్యకర్తలాయనవెనక ఉన్నారనటంలో సందేహమేమీలేదు. వారు శ్రద్ధాభక్తులతో ఈ ఉద్యమాని కాత్మార్పణం చేసుకొన్నారు. జ్ఞాన భక్తి కర్మల అద్భుత త్రివేణీ సంగమం వినోబాజీని అపూర్వంగా ఈ ఆధ్యాత్మికౌన్నత్యాని కెక్కించింది.

ఈ భూదాన గ్రామదానోద్యమాల విలువ అంకెలను బట్టి కట్టకూడదు, పండిట్ నెహ్రూ చెప్పినట్లు అసలు గొప్పదనమనేవి ఎకరాలసంఖ్యకాదు. ప్రజలలో ఉత్పన్నమవుతున్న నూతన భావన, నవీన తేజస్సు ముఖ్యవిషయాలు. భావేజీ ఏమన్నారంటే— "ప్రత్యక్షంగా దానం చేయబడుతున్న భూమి గొప్పవిషయమేమీ కాదు. అది ప్రేమకు కరుణకు చిహ్నంమాత్రమే. భూదానం చేసేటప్పుడు దాత, ప్రతిగ్రహీత, ఈ ఇద్దరి హృదయాలమీద ప్రభావం పడుతుంది. అసలు విషయం ఆధ్యాత్మిక పరివర్తనమే. భూదాన గ్రామదానోద్యమం ఒక నవీనమానవుణ్ణి నిర్మిద్దామనుకొంటోంది. భూమి రైతుకితల్లి. నేను ఈ తల్లి పాలిండ్లలోపాలు నింపాలని ప్రయాసపడుతున్నాను."

బాబా భూదానోద్యమానంతరం తన కార్యక్రమాలు పరిమితం చేసుకొన్నారు. ఆయన ఛలోక్తిగా "ఇప్పుడు మేము ప్రైవేట్ ప్రాక్టీసు ప్రారంభిస్తాం— అంటే వ్యక్తితోగాని వ్యక్తులలోగాని ఇంటివిషయాలు సొంతవిషయాలే మాటలాడ

తాం" అనేవారు. పౌనార్ ఆశ్రమంలో దీర్ఘ మౌనవ్రతాలు ప్రారంభించారు. ఆయన పొలాలలో గంటలతరబడి మట్టి త్రవ్వడం, రాళ్లేరటం చేస్తూ ఉండేవారు— కాని, ఆశ్రమ వాసులతోగాని అతిథులతో గాని మాటలాడటాని కిష్టపడే వారు కాదు.

ప్రాచీన భారత ఋషుల్లాగే బాబా కూడ భారతదేశంలో ఆశ్రమాలు స్థాపించారు. పౌనార్‌లోని బ్రహ్మవిద్యామందిర్ కాక అస్సాంలో ఉత్తరలఖింపుర్ జిల్లాలో "మైత్రీఆశ్రమ్" స్థాపించారు. ఈ ఆశ్రమం ఉద్దేశం-దేశంలోపల-వెలుపలఉన్న ఇరుగు పొరుగు వారితో అన్ని స్థాయిల్లోను మైత్రి పెంపొందించుకోవటమే. బోధగయలో ప్రసిద్ధబుద్ధమందిరం దగ్గర "సమన్వయ ఆశ్రమం" స్థాపించారు. దాని ఉద్దేశ్యం ఉపనిషద్ధర్మానికీ బుద్ధుని ఉపదేశాలకీ. మధ్య సమన్వయం సాధించటం. దక్షిణాదిని బెంగుళూర్‌కి ఆరుమైళ్లలో "విశ్వనీడమ్" స్థాపించారు. ఇది సర్వోదయానికి అంతర్ రాష్ట్రీయ కేంద్రం. ఈ ఆశ్రమంలో గత పదేళ్లనుంచి సర్వోదయ సిద్ధాంతంమీద అనేక ప్రయోగాలు జరుగుతున్నాయి. పఠాన్‌కోటలో ప్రస్థాన-ఆశ్రమ"ముంది. భారతదేశం జమ్మూ - కాశ్మీర్ - పాకిస్తానుల సరిహద్దుకి ఎక్కువ దూరంకాదు. రాష్ట్రీయ సమైక్యమూ సాంప్రదాయిక స్వభావమూ పెంపొందించటానికి ఇది ఒక ఆదర్శ కేంద్రంగా నిలబడగలదు. ఇందోర్ పట్టణాన్నానుకొని "విసర్జన-ఆశ్రమం." ఇవి, గతించిన విలువలు విడిచి సమాజంముందున్న విలువల విశేషసృష్టికి అనేక

ప్రయోగాలు వివిధ నిర్మాణాత్మక కార్యాలద్వారా చేస్తోంది.

పూర్వకాలంలో చాలమంది ఋషులు వ్యక్తిగత సాధన, తపస్సుచేశారు. వినోబా దృష్టిలో ఈనాడు విజ్ఞానము సామూహికసాధన, ఆధ్యాత్మికకృషి కోరుతోంది. జగత్తులో శాంతి సద్భావాలు నెలకొల్పటానికి ఇటువంటి సాధనలోనుంచి అంతర్ రాష్ట్రీయ స్థాయితో నూతన సత్యాగ్రహం ఉద్భవించ గలుగుతుంది. ఆయన విదేశీమిత్రులకు సర్వోదయమర్మం "లోకహితార్థం జీవించటమే" అని వివరించారు.

అణ్వస్త్రాలు ప్రపంచంముందు రెండు విషయాలుంచి ఏదో ఒకటి ఎన్నుకోమంటున్నాయంటారు, భావేజీ. అహింస నైనా స్వీకరించు, మానవజాతి నిర్మూలనకైనా సిద్ధపడు. అని పిలుస్తున్నాయట. వస్తులంయొక్క కొనలు దగ్గరగా ఉంటాయి. అవి ఒకటి అహింస, రెండవది అణ్వస్త్రం. 1962 జూన్‌లో క్రొత్తఢిల్లీలో జరిగిన ప్రపంచ అణ్వస్త్ర వ్యతిరేక పరిషత్తు" కిచ్చిన సందేశంలో వినోబా—

"అణ్వస్త్రాలు సమాప్తం కావలసిందే. కాని ఆదినుంచీ వచ్చే ఆయుధాలుకూడ ఏమీ తక్కువ భయంకరమైనవికావు. అణ్వస్త్రాలు మనని అహింసకు దగ్గఱకు జేరేటట్టు ప్రేరే పిస్తున్నాయి. ఎందుచేతనంటే అవి మానవుని ఆలోచనా జ్ఞానాన్ని మేల్కొలుపుతున్నాయి. కాని పిస్తోల్సు, కత్తి మాత్రం అహింసను దెబ్బకొట్టి దూరంగా తరుముతున్నాయి.

ఈ ఆయుధాలు చూడటానికి చిన్నవికాని ఇవే అణ్వస్త్రాలకు జనకస్థానంలో ఉన్నాయి" అన్నారు.

మానవ జీవనంలో అన్ని మంచిమంచి విషయాలలాగే మతంలోనూ అనేక చెడ్డవిషయాలు చేరి ఉన్నాయి. అందుచేత వాటిలో అనేకం అనవసరమైన కర్మకాండలు తొలగించి సర్వ సామాన్యమైన మంచి విషయాలు వెలుగులోకి తేవలసి ఉంది. వినోబా వేదాలు, ఉపనిషత్తులు, మనుస్మృతి, భాగవతం, శంకరాచార్యులవారి గ్రంథాలు, అలాగే తుకారాం జ్ఞానదేవ్, ఏక్‌నాథ్, మొదలైన మహారాష్ట్ర సాధువుల గ్రంథాలు చదివి వాటిలో ఉన్న సారాన్నుద్ధరించి సంకలనాలు ప్రచురించారు. కురాన్, బైబిల్ సారాలు కూడ ప్రకటించారు. బుద్ధుని ఉపదేశ సారమైన ధమ్మపదం విషయక్రమం మార్చి మును పే ప్రకటించారు. వినోబా తన అస్సాంయాత్రాదినాల్లో అస్సాం భక్తకవి శంకరదేవ్ యొక్క "నామఘోష" యొక్క సారం ప్రకటింపజేశారు. నాలుగు వేదాలను అధ్యయనం చెయ్యటంలో కొన్ని గంటలు వినియోగించేవారు. ఆక్స్‌ఫర్డ్ ఇంగ్లీషు డిక్షనరీలో నుంచి మన రాష్ట్ర భాషయైన హిందీలోకి తేలికగా తీసికోదగిన పదాలు ఎన్నో గుర్తు పెట్టారు. ఈ పదాలతో ఒక కోశం నాగరివర్ణ క్రమానుసారంగా ప్రచురించాలని ఆయన సంకల్పం.

హిందీ ఉర్దూలలో సమానంగా వాడబడే సుమారు మూడువేల శబ్దాలతో ఉర్దూ హిందీ వ్యవహార కోశం ప్రకటింప బడింది.

ఇదంతా స్వతంత్ర పరిశోధన కార్యక్రమం. వినోబా తన భూదానోద్యమ యాత్రాకాలంలో దేశం విభిన్న ప్రాంతాలలో తిరుగుతూ చేస్తూ ఉండేవారు. ఇదేపని ఏ ప్రభుత్వానికో పరిశోధన సంస్థకో అప్పగించి ఉంటే లక్షరూపాయల వ్యయమయ్యేది. ఫలితమింత బాగుండేదో లేదో.

"నేను జీవితంలో చేసిన పనులన్నిటికీ ముఖ్యోద్దేశం హృదయాలను కలపటమే" అన్నారు వినోబా. భిన్న భిన్న మతాలను గురించి ప్రచురించిన ఈ గ్రంథాలలోను ఇదే ఉంది. "విజ్ఞానం ప్రపంచాన్ని చిన్నదాన్ని చేసేసింది. అది మానవుల్ని పరస్పరం దగ్గరకు తేవాలనుకొంటోంది. అందుచేత మానవుడు జాతుల పేరిట మతాల పేరిట విడిపోయి ఎవడిమట్టుకు వాడు తానే ఇతరుల కంటె ఉన్నతుణ్ణనుకోవటం మంచిది కాదు. మనం ఒకరినొకరు అర్థం చేసుకోవటానికి ఒకరి సద్గుణాన్ని మరొకరు గ్రహించటానికి ప్రయత్నం చేయాలి" అనేది ఆయన కోరిక.

ఈ ధార్మిక ఆధ్యాత్మిక విషయాలే కాక ఆధునిక భారతదేశ సమస్యలు కూడ ఆయన గమనించేవారు. రాజకీయ నాయకుల్లో పెరుగుతున్న ఈర్ష్యాద్వేషాలు తగ్గించటానికి 60 ఏళ్ళ వయస్సు వచ్చాక (క్రియాత్మక) రాజకీయ కలాపాలలో నుంచి విశ్రాంతి తీసికోవాలని సూచించారు. మంత్రి పదవికి ప్రమాణ స్వీకారం చేసిన తరువాత పాలక వ్యవస్థలో ఉన్నవారు పార్టీ రహిత ప్రజాసేవకులు కావాలనేది ఆయన నిశ్చితాభిప్రాయం. లోకసభాధ్యక్షులిల్లాగే చేస్తున్నారు. ఇది

మంచి ఆచారం. మంత్రులకు కూడ ఇది వర్తించాలి. స్వాతంత్ర్యం వచ్చాక ప్రభుత్వం వ్యవసాయాభివృద్ధి మీద తగినదృష్టి పెట్టలేదనీ, ముఖ్యంగా ఆహారధాన్యాల ఉత్పత్తి విషయంలో తన కాళ్ళమీద తాను నిలబడేటట్టు జనానికి నూతులు, చెరువులు మొ॥ వాటినిర్మాణానికీ మరమ్మతులకీ తగిన శ్రద్ధ చేయలేదనీ ఆయనకు బాధ. ఇందువల్ల ధాన్యం పైనుంచి తెప్పించుకోవటం, (హద్దుమీరి) ప్రజ ఇబ్బందులు పడటం జరుగుతోందని రెండవది ప్రాథమిక స్థాయినుంచి విశ్వవిద్యాలయ స్థాయివరకు విద్యా విధానం మారాలి. అది జరుగలేదనేది కూడ ఆయనకు బాధ కలిగించేది. గాంధీజీ సూచించిన బేసిక్ విద్యా విధానాన్ని ఈ కష్ట పరిస్థితులలో బాగా ఆలోచించి ప్రయోగాత్మకంగా అమలు జరిపి చూడాలనీ ఆయన భావించేవారు. అదనుంచి దీన్ని పునర్వ్యవస్థీకరించాలని ఆయన సూచన. నవ్వుతూ నా మాట ఎవరు వింటారంటూ ఉండేవారు. గుజరాతీలో ఉన్న సామెత చెప్పేవారు— "రాజు మాటలాడితే దళం (సేన) కదులుతుంది. ఫకీరు మాటలాడితే గెడ్డం కదులుతుంది" అని.

వినోబా సామాజిక, రాజనైతిక, శైక్షణిక (విద్యాసంబంధ) నిర్మాణాత్మక, ఆధ్యాత్మికరంగాల్లో పని చేసిన మహా కర్మయోగి. ఋషీశ్వరుడు. 1940కి పూర్వం భారతదేశానికి వెలుపల బహుశః ఆయన తెలుగరేమోకాని ఇప్పుడాయన విశ్వమాన్యుడయ్యాడు. విదేశాలకు చెందిన పలువురి చూపులు ఆయనవైపు లగ్నమై ఉన్నాయి. మొదటి సత్యాగ్రహి రూపంలో ఆయన పేరు లోకంలో లక్షల కోట్ల జనం నాలుకల

మీద నాట్యమాడింది కాని ఇప్పుడు పాదయాత్రిక సాధు యోగి రూపంలో మిత్రులు, ప్రశంసకులు, అంతకుమించి అధిక వ్యాపక సముదాయము ఆయన్నెరుగుదురు. ఆదరించారు.

1962లో "బెర్ట్రాండ్ రసెల్" ఆయన్ని "అణ్వస్త్ర విరోధి—అభియానం"లో పాల్గొనుమని లండనుకు ఆహ్వానించాడు. అప్పుడాయన్ని మానవ ప్రవృత్తులలో వివేకానికి ప్రతీకగా అభివర్ణించాడు.

ప్రసిద్ధ గ్రంథకర్త, నవలాకారుడు అయిన ఆర్థర్ కోర్స్లర్ గత సంవత్సరాలలో వినోబాను మూడుసార్లు కలుసుకొన్నాడు. భూదానోద్యమాన్ని ఆయన "గాంధీ తర్వాత అన్నిటికంటె పెద్ద శాంతిమయ క్రాంతి"గా భావించాడు. ఈ ఇరవయ్యోశతాబ్దంలో భారతదేశానికి చెందిన ఒక సాధువు కనీసం ఒక హద్దువరకు చరిత్రని ప్రభావితం చేయగలుగుతున్నా" డని ఆయనకు నిశ్చయం కలిగింది.

భూదానోద్యమ వికాసం భారతదేశపు ధూళిధూసరిత గ్రామీణ క్షేత్రాల్లోనే జరిగినా వినోబా యొక్క తత్త్వజ్ఞాన ప్రభావం మాత్రం అంతర్జాతీయక్షేత్రంలో బహుదూరగామి అవుతుందని భారతదేశంలో మాజీ అమెరికా రాయబారి "ఎల్స్‌వర్త్ బంకర్" అన్నారు. 1958లో వినోబాకు సామాజిక నేతృత్వ సందర్భంలో "మెగసే" పురస్కారం యిచ్చిన సందర్భంలో ఈ మాటలంటూ ఆయన వినోబాను లోపల పెద్ద ఆత్మ ఉన్న తన చిన్న శరీరాన్ని ఉపయోగించి ప్రాచీన భార

తీయ సంప్రదాయ సారతత్త్వానికి మూర్తత్వాన్ని ప్రదానం చేసిన సత్పురుషుడని ప్రశంసించారు.

ప్రసిద్ధ ఆంగ్ల కవి టెనిసన్ మనుమడు హేలమ్ టెనిసన్ చాల రోజులు వినోబాతోపాటు పాదయాత్రలో ఉన్నాడు. ఆయన భావేని మూర్తిమంతమైన భారత దేశమన్నాడు. ఆయన మాటలీవిధంగా సాగాయి. "ఇరవైయో శతాబ్దం తన జెట్ విమానాలవల్ల వైభవశాలి అనిపించుకోవచ్చు గాక. కాని సాధు పుల సంబంధమున్నంతవరకు అది దరిద్రమైనదే. ప్రగతి అని మనమనుకొనేది మనిషి అంతర్యంలో మారనంతవరకు ప్రగతి ఏమీ కాదు. అని మనం గుర్తుంచుకోవాలి. ఈ విషయం వినోబా మనకు జ్ఞాపకం చేస్తున్నారు. దీనిచేత మానవుడు ప్రభావితుడై అశాంతి పొందుతున్నాడు. సత్పురుషులలో కూడ అత్యంత సూక్ష్మప్రలోభనముంటుంది అది త్యాగాహంకారం. కాని వినోబా దాన్ని తన దగ్గఱకు కూడ రానియ్యలేదు. తన నను కరించమని ఆయనెప్పుడూ ఎవరికీ చెప్పలేదు. తన అద్భుత గాం భీర్యంతో ఆయన పురోగమించారు". ఒకానొకడు "తమ ఈ ఉద్దేశ్యం పూర్తవుతుందా?" అనడిగాడు. వినోబా జవాబు —

"నిప్పు కేవలం మండుతుంది. ఎవరైనా దానిమీద గిన్నె పెట్టాలనీ, అందులో నీళ్ళు బియ్యంపోసి దానిమీద తన అన్నం వండుకోవాలనీ అదేమి ఆలోచించదు. (ఆ చింత దానికేమి

లేదు. కేవలం మండటమే దాని కర్తవ్యం. ఇంతకుమించి ఏమీ లేదు".

డా॥ లాంజా డెల్ వాస్తో అనే ఆయన ఇటలీకి చెందిన ప్రసిద్ధకవి, కళాకారుడు, గ్రంథకర్త. భారతదేశంలో ఆయన్ని ప్రేమతో "శాంతిదాస్" అంటారు. ఆయన "గాంధీ నుండి వినోబా- ఒక క్రొత్త తీర్థయాత్ర" అనే ఒక చక్కని చదవ దగిన పుస్తకం వ్రాశాడు. ఆయన వినోబాను గాంధీజీకి ఆధ్యాత్మిక వారసుడుగా భావిస్తూ "భారతదేశపు సామాజిక, ఆర్థిక విప్లవంలో వినోబా పాత్ర నాటకీయమూ, చమత్కార పూర్ణమూను" అంటాడు.

భూసంస్కరణ గ్రామీణ క్షేత్రంలో క్రాంతి నిమిత్తంగా ఆయన ప్రేమతోను కరుణతోను చేసిన నిర్మాణాత్మక కృషి వర్ణనాతీతం. ఒక మహావిద్వాంసుడు స్వతంత్ర సర్వతోముఖ ప్రతిభాశాలి, సఫలసదాలోచనాపరుడు, అన్నిటినీమించి ఉన్నత స్థితిలో ఉన్న మహర్షి అయిన వినోబాభావేజీని యావ ప్రపంచ మానవకోటి ఆదరంతో కృతజ్ఞతతో గుర్తుంచుకొంటుంది.

## * ఋషి - కృషి :-

ఋషికూడ కృషి చేయాలంటూ అనుభవంతో చెప్పిన మాటలీ క్రింది విధంగా ఉన్నాయి.

* మే '82. మైత్రి

"కృషి మహాపవిత్ర కార్యం. ఇది అన్నింటి కంటె పెద్ద ఉపాసన. మానసిక వికారాల్ని శమింప చేయటానికిదొక అద్భుతమైన ఉపాయం. ఋషికీ కృషికీ అత్యంత సన్నిహిత సంబంధముంది. కృషిని పాపమని భావించేది మతం కాదు. వేదాలలో కృషి యెడల చాల ఆదరముంది. కృషి వికాసానికి ఋషులు సందేశమిచ్చారు. ఇలాగే భగవాన్ ఋషభ దేవుడు కూడ కృషి నుపదేశించాడు. ఋషిచేసే కృషి అంటే చేతికృషి (వ్యవసాయం) ఇంటి నుండి విముక్తుడై ఋషిజీవనం సాగించే వ్యక్తికైతే వ్యవసాయం అనివార్యం. మనం శ్రమకు విలువ నివ్వాలనే పట్టుదల కలవారమే. కనక ఐతే, అన్నిటికంటె ఉత్తమశ్రమ వ్యవసాయమే. అందుకే నేను "ప్రధానమంత్రి కూడ కృషి కోసం ఒక గంట వినియోగించాలని" చెప్పాను. దీనివల్ల దేశంలో ఆహార సమస్య పరిష్కరింపబడటమే కాక అన్నిటి కంటె గొప్పలాభం ఆధ్యాత్మిక వికాసం కలగటం.

మనం మిక్కిలి ఎక్కువగా ఏదో విధంగా ప్రకృతికి దరి చేరగలగుతున్నామంటే అది భూమిపైనే. భూమి అందరికీ తల్లి. మాతృసేవ చేయటమనేది ఏ అపవాదనూ లేకుండా ఎల్లాగైతే అందరికీ అనివార్యమో అలాగే భూమాతృసేవ చేయటంకూడ అందరికీ అనివార్యం కావాలి. ఇందుచేత నేను ఋషులకు వ్యవసాయం చేయమని సలహా ఇచ్చాను. నేడు దేశంలో అయితే అనుత్పాదకుల సంఖ్య రోజురోజుకీ పెరిగిపోతోంది. ఋషిగణం కూడ తమను అనుత్పాదకుల లెక్కలో వేసుకోవటం నాకిష్టం లేదు. అందుచేత ఋషి కృషి చేయాలంటున్నాను".

వినోబా- భూదానయజ్ఞ 28-11-58

# బ్రహ్మ నిర్వాణం

భీష్ముడు యుద్ధంలో పరాజితుడై పడిపోయినప్పటికీ అంపశయ్య మీద పడుండి స్వచ్ఛంద మరణశక్తిని వరంగాపొంది ఉండటంచేత ఉత్తరాయణం కోసం నిరీక్షించాడు. ధర్మరాజం తటివాడి కెన్నో ధర్మరహస్యాలు బోధించే అవకాశం లభించింది. తనకున్న శ్రీకృష్ణ భక్తికి ఫలితాన్నందుకోగలిగాడు. సమయాన్ని సంయమంతో గడిపి శ్రీకృష్ణుణ్ణి కోరాడు తన శరీరత్యాగాని కనుమతి నిమ్మని.

"బలము నీవ నాకు భక్తుండ నీ యెడ
నాలు బిడ్డలేని యట్టివాడ!
గావు, నన్ను, నధిక కారుణ్యమున, నిమ్ము
నుజ్ఞఁ గమలదళమనోజ్ఞ నయన" అన్నాడు.

వాసుదేవుడు దేవవ్రతుణ్ణి చూచి

"కీడొకష్డు లేదు కృతపుణ్యుఁడవు, తండ్రి
వలని భక్తి పెంపుగలవు, దాన
గాదె! బంటువోలెగాంగేయ, మృత్యువు
నీ వశమున నిలిచె నిర్భయముగ" అని

అనుమతించి వసువులను పొందుమన్నాడు.

భీష్ముడు ధర్మరాజుకు చెప్పవలసిన మాటలు చెప్పి "యూరకుండి ధారణాను క్రమంబున సమాహితాత్ముండయి వాయువులు సన్నిరుద్ధంబు చేసిన నవి యూర్ధ్వగతిం గైకొనియె నమ్మహాత్మునా డవయవంబులం బ్రాణంబులు వాపికొనుచు వచ్చు నయ్యై చోట్లు శల్యరహితంబు లగుచుండె నట్లగుటం గాంచి కృష్ణాదులగు నఖిలజనంబులు నాశ్చర్యభరితాంతఃకరణు లగుచు గీర్తించి రాసంయమచరితునిచే సర్వావయవ సన్నిరుద్ధంబై యాత్మ మూర్ధంబు భేదించి మహోల్కాకారంబున నాకసంబున కెగసి కొంత దవ్వరిగి యంతర్హితం బయ్యె".

ఈ విధంగా భీష్మనిర్వాణం జరిగింది. ఇచ్ఛానుకూలంగా నిర్వాణం పొందటాన్ని హాయిగా వేసికోగలగటం లాంటిదే ఇచ్ఛాపూర్వకంగా మృతికి స్వాగతం పలకటం కూడ నని భావేజీ మహా నిర్వాణం మనకు సూచించింది.

భీష్ముడెంత లోకజ్ఞుడో ఎంత తత్త్వజ్ఞుడో వినోబా అంత లోకజ్ఞుడు. అంత తత్త్వజ్ఞుడు మాత్రమే కాక అంతటి ధర్మ సూక్ష్మమర్మజ్ఞుడు కూడ అని ఆయన జీవితం సాక్ష్యమిచ్చి ప్రత్యక్షమైంది.

ఏషా బ్రాహ్మీస్థితిః పార్థ నైనాం ప్రాప్య విముహ్యతి।
స్థిత్వాస్యామంతకాలేపి బ్రహ్మనిర్వాణమృచ్ఛతి ॥ (గీత)

స్థితప్రజ్ఞ లక్షణాలు సమాప్తిచేస్తూ "ఈ స్థితి యే బ్రాహ్మీస్థితి. దీనిని పొందినవాడు దీనినుంచి యింక జారిపోడు.

(మోహపడడు). మరణసమయంలోకూడ ఇందులో ఉండిపోయి బ్రహ్మనిర్వాణం పొందుతాడు” అన్నాడు భగవంతుడు. సమాధిస్థితిలో మానవుడు ఇతర చిత్తవృత్తులు విడిచి ఇష్టదేవ చింతన వృత్తిమాత్రమే మిగుల్చుకుంటాడు. ఇది మనో మాలిన్యం తొలగిస్తుంది. ఇది ధ్యానసమాధి. ఈధ్యానసమాధి రూపమైన వృత్తికూడ తొలగిపోతే వృత్తి శూన్యత ఏర్పడు తుంది. స్థిరత్వం సిద్ధిస్తుంది. దీన్నే యోగశాస్త్రంలో “ప్రజ్ఞ” అంటారు. ఈ ప్రజ్ఞ స్థిరపడ్డాక చిత్తం, నిర్మల ప్రసన్నంగా ఆత్మనిష్ఠతో ప్రకాశిస్తుంది. ఇదే బ్రాహ్మీస్థితి. బ్రాహ్మీస్థితి నిత్యమైనది. అది ప్రాప్తమైతే దానిలోనుంచి చలించటం ఉండదు. “నైనాంప్రాప్యవిముహ్యతి” అంటే అదే. ఆత్మ జ్ఞానానికి ఇతర జ్ఞానానికీ ఉన్న భేదా ఇదే. ఇతర జ్ఞాన రూపాలు తాత్కాలికంగా కృత్రిమమై ఉంటాయి. పోతాయి.

బ్రాహ్మీస్థితి మాత్రం (అదిసిద్ధించాలేగాని–సిద్ధించేదాకా జరిగేది సాధనావస్థ) ఆ పత్కాలంలోనూ ఉంటుంది. మరణ కాలంలోనూ ఉంటుంది. లక్షలాది జన్మలవరకు ఆత్మజ్ఞాన మనేది ప్రాప్తించకపోవచ్చు, కాని సిద్ధించిన తర్వాత అంత కాలంలో కూడ నిస్సంశయంగా ఉండితీరుతుంది. కనుక— బ్రహ్మనిర్వాణం లభించినట్లే.

శంకరాచార్యులవారు “మరణానికిపూర్వం ఒక్క క్షణం ముందు ఈస్థితి లభించినా మానవుడు బ్రహ్మనిర్వాణం పొందుతాడ”ని వివరించారు. ఈ స్థితి అత్యంత వికటమని తలంచ బడే చరమదశలోకూడ బాధించదు. ఆసమయంలో కూడ

దృఢంగా చలనరహితంగా ఉంటుందని ఈ శ్లోకం ధ్వనిస్తోం
దంటారు వినోబాజీ.

బ్రహ్మనిర్వాణమంటే బ్రహ్మయందు లీనమగుట.
కలిసిపోవుట అని అర్థం. "నేను మొదటినుండి బ్రహ్మనే కాని
దేహాభిమానరూపమైన తెర నాకు— బ్రహ్మకు మధ్య అడ్డు
పడింది. దాన్ని తొలగించి బ్రహ్మలో కలిసిపోవటం అనేదే
నా బ్రహ్మనిర్వాణం. ఇదే జీవితానికి సఫలత." కాబట్టి
వినోబా :—"వ్యక్తిగత సంసారం, జ్ఞానధ్యానాదులు, అన్నీ
బ్రహ్మనిర్వాణాన్ని లక్ష్యంగా పెట్టుకొని ఆచరించాలనేదే
ఈ శబ్దంద్వారా మనకి గీత బోధిస్తోందంటారు.

బౌద్ధులు బ్రహ్మనిర్వాణం అనేదాంట్లో "బ్రహ్మ"
శబ్దం తొలగించి నిర్వాణ మనేది స్వీకరించారు. మానవుడు
నేను, నాది, అనేభావం విడిచిపెట్టి అహంకారమనే కుండ
బద్దలుకొట్టి పురోగమించాలనే ఊహను సూచిస్తూ వారు
నిషేధాత్మకభాష వాడారనుకొంటా, నని వినోబా అన్నారు.
మన ధర్మశాస్త్రంకూడ మనిషి చనిపోయినప్పుడు కుండ
బద్దలుకొట్టించటాన్ని ప్రచలితం చేసిందంటే— అహంకారం,
వాసనలూ, పూర్తిగా నశించాలని సూచించటమే దాని
తాత్పర్యమనాలి.

వైదికులు నిషేధభాషకంటె విధాయకభాష మెచ్చు
కొంటారు. మోక్షమనేదాన్ని అభావ మనటంకంటె భావమన
టమే వారికిష్టం. "నేనునశించిపోయాను, శూన్యమైపోయాను"

అనుకోవటంకంటె, "నేను విశ్వవ్యాపకమయ్యాను" అనటం విధాయకం (Positive) బ్రహ్మ అంటే పరబ్రహ్మ. అది విశ్వవ్యాపకం. దానిలో కలిసిపోవటమంటే నేను విశ్వవ్యాపకమయ్యాననటమేకదా! చెప్పేతీరులో విధాయక నిషేధపద్ధతులే వేరుగాని బ్రహ్మనిర్వాణమన్న వేదమార్గగాముల మాటకీ నిర్వాణ మన్న బౌద్ధుల శబ్దానికీ చివరికి భావం ఒకటే అవుతుంది. "నేను" అనేది బౌద్ధులకు కిట్టదు. కనుక వారు దానిని నిషేధంగా చెప్పారు. వైదికుల మాటలో కూడ "నేను" ఎగిరిపోయి బ్రహ్మమాత్రమే నిల్చిందన్నమాట.

ఈవిధంగా దీన్ని ఉభయార్థ సంగ్రహాకారిగా గీత తేల్చివేసిందని భావించిన భావేజీ, జీవితాంతం తాను చేసిన జ్ఞాన ధ్యాన సమాధి సాధనావస్థ అధిగమించి బ్రాహ్మీస్థితి నందుకొని అంతకాలంలో బ్రహ్మనిర్వాణం పొందినట్లు మనం భావించటంలో విప్రతిపత్తిలేదు. "ఏకం బ్రహ్మచ శూన్యంచ యఃపశ్యతిసపశ్యతి" అనే స్థితికి ఆయనవచ్చి అంతర్ముఖుడైన కొద్దీ బాహ్యవ్యవహారరూపమైన ఆహార పానీయాలతో నిమిత్తం లేక పోయింది. అందుచేత అవివేకపోయినా ఆయన ముఖంలో బ్రహ్మతేజస్సు ఉద్దీప్తమై భాసించింది. జ్ఞాన భక్తి కర్మయోగాల సమన్విత సాధన సాధించిన మహాయోగి ఆయోగంతోనే చివరికి తను త్యాగం చేశాడని భావించటాని కనువైన వాతావరణం ప్రత్యక్షమైంది.

## దివసా అవసాన రమణీయాః

1982 నవంబరు ప్రారంభం నుంచి బాబా స్వాస్థ్యం చెడింది. కొన్ని సంవత్సరాలుగా రోజుకి 45 తులాల పాలు, 11 తులాల నీరు తొలగించిన పాల విరుగు, 10 తులాల తేనె ఆహారంగా జీవిస్తున్న బాబా ఆరోగ్యం పాటు తప్పిన సంగతి నవంబరు నాల్గవ తేదీని పత్రికల కెక్కింది. మంచి మంచి డాక్టర్లు పౌనారు చేరుకొన్నారు. వైద్యం బాగా జరిగింది. ఆప్తులు సహచరులు వచ్చారు, గుండెకు చెందిన వ్యాధి అదుపు లోకి వచ్చింది. అందరికి ఆదుర్దా తగ్గింది. నవంబరు ఎనిమిదవ తేదీని ఆఖరి ఆహారం తీసికొని బాబా "ఇంక పథ్యం, జలం ఔషధం, సమస్తం సమాప్తం" అని తన నిర్ణయం ప్రకటించారు. ప్రతి రెండు గంటలకీ ఆహారం తీసికోవలసిన అవసర మున్న శరీరానికి ఇటువంటి నిర్ణయంతో ఆహారం ఆపివేయటం దేశానికే కలత కలిగించింది. చికిత్సకులు, ప్రజానాయకులు, నిర్మాణ కార్యక్రమ సహచరులు మొ॥వారు బాబాను ఒప్పించి ఆహారం తినిపించాలని ప్రయత్నించారు. కాని "సమాప్తం" సమాప్తమే. నీరైనా త్రాగించగలుగుతామేమో అని డా॥ సుశీలానయ్యర్ వంటివారు శ్రమపడ్డారు. బాబా నిర్ణయం నిర్ణయమే. ఇది ఆయన స్వభావం. ఆహార పరిత్యాగాన్ని ఔషధ నిరాకరణనీ కొందరు ప్రాయోపవేశమన్నారు. కొం

దరు జ్ఞానదేవాదియోగులవలె జీవిత సమాధి యొక్క ఉత్కర్ష అన్నారు. ఏడు రోజులు వచ్చే పోయేవాళ్ళ ప్రవాహం అద్భుతమైంది. నలుదిక్కుల నుంచీ సైకిళ్ళు, మోటార్లు, బస్సులు, రైళ్ళు, విమానాలు మొ॥ వాటిమీద వచ్చేవాళ్ళ సంఖ్య తగలేదు. అందరికంటె ముఖ్యంగా వినోబా అన్నమూ నీరూ మానిన వార్త వినగానే నాగపూర్ నుంచి పరుగెత్తుకు వచ్చిన పద్నాలుగేళ్ళ కుఱ్ఱవాని సంగతి చర్చనీయాంశమైంది. అతడు పౌనార్ వచ్చి బాబా దర్శనం చేసి కుటీరం నుంచి బయటకివస్తూనే స్మృతి తప్పి పడిపోయాడు. ఇలాగే ఫ్రాంస్ నుంచి పరుగుపరుగున వచ్చిన సోదరి "రీతా"కు మాత్రం స్మృతి యెక్కడుంది? ఆమె చెప్పులతోనే బాబా కుటీలో ప్రవేశిస్తూ ఉంటే కొందరు చెప్పులు విడవాలని గుర్తుచేశారు. ఎన్నిరకాల వాళ్ళెంత మంది వచ్చారని చెప్పగలం? వచ్చిన వాళ్ళకక్కడ చోటుచాలక దత్తపురీ, గోపురీ, వార్ధా మొదలయినచోట్ల మకాం చేశారు. కాని బాబా చుట్టూ తిరుగుతూనే ఉన్నారు. ఆశ్రమ వాతావరణంలో మాత్రం మార్పులేదు. అసహజత్వం గాని, భారంగాని సమాధి భంగంగాని లేదు. గీతాఈ, రామ చరితమానస్, విష్ణు సహస్రనామం, సర్వధర్మ ప్రార్థన, భక్తి గీతాలు, అన్నీ యథాతథంగానే సాగిపోతున్నాయి. ఆకాశ వాణివారు, పత్రికలవారు సమాచారం కోసం ఉత్కంఠచూపు తున్నారు. కాని బాబా యొక్క సంకల్పజన్యమైన యోగం అన్ని వార్తలనీ అదుపులో పెట్టింది. అందువల్ల ఎంతసేపూ ఒకటేమాట— "బాబా ఆరోగ్యం మునపటిలాగే ఉంది". అనేదే ఆ మాట డా॥ త్రివేదీ, డాక్టర్ రవిశంకరశర్మ, డా॥

వంగ మొ॥వారు "మునుపటిలాగే" అనేదాన్ని వివరించటానికి నిరాకరిస్తూ వచ్చారు. వారిలెక్క ప్రకారం ఆ వ్యక్తిని 15ని॥ కూడ ఉంచటం అసంభవం. అతడు 15 ని॥ తర్వాత ఇంకా తీక్ష్ణంగా ఇంకా తేజస్విగా కనిపిస్తున్నాడు. చాలసార్లు డాక్టర్లు తమ అభిప్రాయం మార్చుకోక తప్పటం లేదు.

బాబా నిర్వాణానికి పూర్వమే అస్వస్థత ఏర్పడగానే శ్రీ మండలి వెంకట కృష్ణారావు సహకార శాఖామాత్యులుగా తమ తొలి కార్యక్రమంగా బాబా దర్శనమే చేశారు. బాబా అప్పుడు మండలి వారిని చూచిన చూపుతోనే ఆ మంద హాసంలోనే ఒక సందేశాన్ని గమనించారు. అది స్నిగ్ధంగా, ఆశీర్వచన రూపంగా, ఆదరమేదురంగా భాసించి శ్రీ మండలి వెంకట కృష్ణారావు అందులోంచి ఒక ప్రేరణనందుకొన్నారు. తరువాత భూదానయజ్ఞం ఆరంభించిన గ్రామంలో (పోచంపల్లి) భావేజీ సంతాపసభలో "తమ ఆస్తిని ట్రస్ట్‌గా ఏర్పరచి తమ ఆదాయంలో ఆరవవంతు ప్రజాసేవకి వినియోగిస్తాననే ప్రతిన బూని ప్రకటన చేశారు. వినోబా ఆశయం మేరకు భారత సంప్రదాయాన్ని చేపట్టి తమ ఔదార్యాన్ని నెలకొల్పారు.

మానవముని చెప్పిన ప్రకారం బాబా అనశన వ్రత సమయంలో ఆశ్రమంలో అల్పాహారం ఉండకూడదు. ఈ విషయంలో నిర్ణయం తీసికోవటం ఆలస్యమవుతూ ఉన్నట్లు కనిపిస్తే (రెండోసారి) ఆశ్రమ సభ్యులు రోజుకొక్కసారే భోజనం చెయ్యాలనిచెప్పబడింది. బాబాకు బహుశః ఈ విధంగా ప్రేమాగ్రహంతో భోజనం మానటం మానిపించటం కూడ ఇష్టం

లేదేమో! అందుచేతనే అల్పాహారం బంద్ చెయ్యాలని ప్రకటించిననాడు ప్రొద్దున్నే గం॥ 8-30 ని॥లకు బాబా తన హృదయగతిని గుండె చలనాన్ని బంద్ చేశారు.

ఈ విధంగా చేయటం యోగులకసాధ్యం కాదు. తుది నిశ్వాసం విడిచేముందు- బాబా నావిపు నిమిరారనీ, నన్ను చూడగానే గుర్తించారనీ, నా శిరస్సు మీద చేయుంచి దీవించారనీ, నాకేసి చూచి చిరునవ్వు నవ్వారనీ, ఇలా ఎందరో ఎన్నో చెప్పటం జరిగింది.

చతుర్దశినాటి రాత్రిలాగే అమావాస్యనాటి రాత్రికూడ బాబా ప్రక్కన కూర్చున్నవారు బాబాకు విసనకఱ్ఱతో విసురుతోనే ఉన్నారు. అయితే గతరాత్రి కంటె భేదం బాబా దేహమిప్పుడు మంచుదాళ్ళ మీద కెక్కటమే. క్రమంగా అది చితిమీదికి చేరేలోగా పుష్పశయ్యనధిరోహించింది. ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధీ రష్యా నుంచి శరవేగంతోవచ్చి ఆ దేహం మీద తన శ్రద్ధాంజలి పుష్పాంజలి ఘటించారు. అలాగే దేశ రాజధాని నుంచీ రాష్ట్ర రాజధానుల నుంచీ ఎందరో కేంద్ర మంత్రులూ, రాష్ట్ర మంత్రులూ, అధికారులు, అనధికారులు, అన్ని రంగాలవారూ పరంధామాశ్రమానికి చేశారు. శ్రద్ధాంజలి ఘటించారు. ఆంధ్రప్రదేశ్ నుంచీ వెళ్ళిన వారిలో అప్పటి సహకార శాఖామాత్యులు శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారు, శ్రీ జయహంసాచారిగారితోను చిరంజీవి బుద్ధప్రసాద్ తోను కలిసి బాబా అంతిమయాత్రా ఘట్టంలో ఉన్నారు.

నవంబరు 15వ తేదీ ఉదయం సరిగా 8-30 గం॥లకు ఆయన బ్లడ్ ప్రషర్ తగ్గటం మొదలయింది. ఊపిరి తీసికోవటంతో ఇబ్బంది ప్రారంభమయింది. ఆయనకు తప్పనిసరిగా కొంతబాధ కలిగి ఉంటుంది. కాని పైకేమీ మూలుగుగాని ఏ విధమైన ధ్వనిగాని ఆయన చేయటంలేదు. ఉదయం 9-30 ని॥లకు ఆయన పరమపదించారు.

ఆశ్రమంలో రెండు రాత్రులుగా ఉన్న ఒక విలేకరి అన్నారు:— గత రాత్రి వారెవ్వరూ నిద్రపోలేదట. ఏ క్షణంలోనైనా బాబా మరణించవచ్చుననిపించింది. ఏమయినా ఉదయం ఆయనకు పూర్తిగ స్పృహ వచ్చింది. ఆరు గంటల ప్రాంతంలో ఆయనను చూడటానికి వచ్చిన ఒక ఫ్రెంచి మహిళతో పరిహాసంగా మాటలాడారు కూడాను. "కనీసం కొంచెం మంచినీళ్ళైనా తీసికో"మని ఆమె అన్నప్పుడు తనకు బదులు ఆమెను నీవు త్రాగుమని చేతులతో సంజ్ఞ చేశారు. తర్వాత ఆయన తలుపు మీద వ్రాసిఉన్న "రామహరి" అనే అక్షరాల వైపు చూపించి తానక్కడకు వెళ్ళిపోతున్నానని సంజ్ఞ చేశారు. మూడు రోజులుగా మాటలాడలేనంత నీరసంగా ఉన్నారు.

* నరేంద్రదూబేకథనం (రావతిన్ సింగ్ తో) ప్రకారం.—

నరేంద్రదూబే బాబాతో 1953 నుండి అప్పుడప్పుడుంటు

*"Sunday" 28-11-82 to 4 Dec. '82

న్నారట. పౌనార్ గ్రామంలో ఆయనొక సమాజ సేవకుడు. బాబా ఆయనకు "పౌనే ద్ర" అని పేరు పెట్టారు. బాబా తన మరణదినాన్నెన్నుకొన్నారు. దీపావళి— భగవాన్ మహావీర్, దయానంద సరస్వతి, రామతీర్థ నిర్వాణం పొందినరోజు. గత రాత్రి బాబా రక్తపుపోటు 60కి దిగిపోయింది. కాని అప్పుడు మొకుపులాగ 84 & 120 అయింది మళ్ళీ. ఆయన దీపావళి కోసం ఎదురు చూస్తున్నారు. నవంబరు నాల్గవ తేదీని బాబాకు జ్వరం తగిలింది. ఆశ్రమ పుణ్యస్థానాలకు ఆయన మామూలుగా తిరిగి రావటంలో (నడకలో) ఆయనకు కొంచెం కష్టం కలుగుతూ ఉన్నట్లు కనిపించింది. తర్వాత ఆయనకు బ్రోంకైటిస్ వచ్చినట్లు డాక్టర్లు గుర్తించారు. మర్నాడు గుండెలో నొప్పి వచ్చింది. ఆక్సిజన్ ఇచ్చారు. ఆయన కొద్దిగా గుండె నొప్పి (హార్ట్ఎటాక్)తో బాధపడినట్లు, ఒకరకమైన శ్వాసకోశ (ఊపిరితిత్తుల) వ్యాధి కలిగినట్లు (Some Kind of Pulmonary infecfion) తెలిసింది. బాధ తగ్గించి విశ్రాంతి కలిగించే మందులిచ్చారు. ఈ సమయం అంతటిలోను ఆయన మామూలు ఆహారం తీసికొంటూనే ఉన్నారు. (900—1100 కేలరీల తేనె, కొద్దిగా తోడుకొన్న పాలు, కొంచెం ఇసాబ్‌గోలు, (Isabgol—ఓషధి విశేషం) 50 యేళ్ళుగా ఇవితప్ప మరో రకమైన ఆహారమేదీ ఆయన ముట్టుకోలేదు.

నవంబరు 8వ తేదీనాటికాయనకు పూర్తిగ స్వస్థత చేకూరినట్లు కనిపించింది. సాయంత్రం గం॥ 6—30 ని॥లకు ఆయన సాయంకాలపు భోజనం చేశారు. వార్తాపత్రిక కూడ

చదివారు. రాత్రి గం. 10_30 ని॥లకు కొంచెం నీరు త్రాగి నిద్రపోయారు. మర్నాడుదయం (తెల్లవారుఝామున) 4_00 గం॥లకు ఆహారం తీసికోమంటే ఆయన వద్దన్నారు. ఇంక అప్పటి నుంచి 15వ తేదీదాకా ఆహారం, నీరు, మందు కూడ ఆయన ముట్టుకోలేదు, ఆహార పానీయాలు విడిచిపెట్టేసిన కొద్దిసేపటికే ఆయన పాత సహచరుడైన కాకా అచ్యుతదేశ్ పాండేను కలిశారు. అప్పుడు బాబా అలిసిపోయారు. ఆయనతో "బాబా అలసిపోయాడు" అని తన తలుపు మీద వ్రాసిన "రామహరి" అనే మాటలు చూపించారట.

నవంబరు 10వ తేదీని ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ ఆమె పుత్రుడు శ్రీ రాజీవ్ ఆయన్ని సందర్శించినప్పుడు వారు కనీసం నీరైనా తీసికోమని బలవంతం చేశారు. ఆయన శ్రీమతి ఇందిరాగాంధీతో ఊపిరి పీల్చేటప్పుడు "రామ్" అనీ విడిచే టప్పుడు "హరి" అని అనుమని చెప్పారట. వారు ఆహారం విషయంలో ఆయన్ని బలవంతం చేయలేక పోయారట.

గం. 10_55 ని॥ బాబా అనుచరులు బాబా దేహమున్న పూలపల్లకి ఎత్తి అగ్నిసంస్కారం చేసేచోటికి మోసుకొని రావటం మొదలుపెట్టారు. అన్నిమతాల ప్రార్థనలు జరిగాయి. "బోలో రామ్ హరి" "సత్య కరుణాకీ హరి," సర్వధర్మ ప్రార్థన తర్వాత బైబిలు, కొరాను, గ్రంథ సాహెబ్, బౌద్ధ జైన సూక్తులు చదివారు. ఋగ్వేదంనుంచి అగ్నిసూక్తం పఠింప బడింది. 60 సం॥గా బాబా సేవలో ఉన్న శ్రీమతి మహాదేవి తాయి, చితికి నిప్పంటించారు. బహుశః ఒక స్త్రీ తనకు తండ్రి

వంటివారైన వ్యక్తికి ఈవిధంగా అగ్నిసంస్కారం చేయుట మనేది భారతదేశంలో ఇదే మొదటిది. స్త్రీలు పురుషులు పూర్తిగ సమానులే అని విశ్వసించిన బాబా ఆవిధంగా ఆశించారు. భావేజీ నిర్యాణంతో గాంధీశకం సమాప్తమయిం దనటం నిజమనిపిస్తోంది.

బాబా చిరకాల మిత్రుడు దాదా ధర్మాధికారి స్వాల్పంగా ప్రసంగిస్తూ——

హింసాత్మకంగా తయారయిన మతాలు దైవానికి చెందినవి కావు. దయ్యానికి చెందినవి" అన్నారు. బాబా సోదరుడు శివాజీభావే (ఆయన్నందరు "ఆబా" అంటారు) ఈసమయంలో తానేమీ మాటలాడనన్నారు. తన అన్నగారికి అంత్యక్రియలుకూడ తాను చేయనన్నారు. "సాధువుయొక్క కుటుంబం ఆయన ఆశ్రమమే" అన్నారు.

**అంతిమ క్షణాలు :**

శ్రీ బాలవిజయ్‌జీ గమనించినతీరు ఈ క్రిందివిధంగా ఉంది——.

చివరి కొన్ని నెలలుగా బాబా మతిమరపుగా ఉన్నారని మాకు భ్రమకలుగుతూ వచ్చింది. వారి స్మృతి శక్తి క్షీణించిం దని. కాని అసలుసంగతి అదికాదు. అప్పుడప్పుడాయన ప్రవర్తన వల్ల ఆయన స్మృతితప్పి ఉన్నారని భ్రమకలిగేది.

స్థితప్రజ్ఞ పురుషుని జీవన వ్యవహారం త్రివిధంగా ఉంటుంది. ఒకటి—విశ్వాత్మైక్యం, రెండు ప్రారబ్ధశేషవశం, మూడు ముక్తస్థితి. ఈ మూడుదశలు సుమారు సంవత్సరం నుంచి మాకు ఆయన జీవనంలో దర్శనమిచ్చాయి. అది ఒక స్థితప్రజ్ఞలక్షణమైన బ్రాహ్మీస్థితి............మేము బీహారు యాత్రలో ఉండగా రాజగీర్‌లో ఒక జైనముని "సంథరా" చేశారు. ఉపవాసంలో మూడురోజులు గడిచాయి. మేము పాట్నాలో ఉన్నాం. కొందరు బాబాను కలవటానికి వచ్చారు. విషయం వివరించారు. అప్పుడు బాబా "కనీసం తమరు నీరైనా త్రాగండి" అని సందేశం పంపారు. బాబా సర్వమూ (జలంతో సహా)త్యాగం చేసిననాడు మేము ఆ జైనమునికిచ్చిన సందేశం సంగతి జ్ఞాపకంచేశాం. బాబా "నహీం" అన్నారు. ఇక్కడి సోదరీమణులు, దాదా, అబా, వంటివారుకూడ బలవంతం చేశారు. 14 వ తేదీ సుశీలా బహన్ కూడ చెప్పారు. ఇంతమంది యింత పట్టుపట్టినా బాబా వినలేదు. ఆయనకు స్మృతి (తెలివి) చివరిక్షణం వఱకు ఉంది.

14వ తేదీ రాత్రి ఒంటిగంటకి డాక్టర్ గారు అంతిమ సమయం వచ్చేసిందనీ, ఇంక కొద్దిగంటలే ఉంటుందనీ చెప్పినప్పుడు నేనాయనతో— "ఆయన (బాబా) పాదాలు

చూడండి "రామహరి" జపిస్తూ కాలితో తాళం వేయటం ఆయనకలవాటు. అదే తాళం పాదంతో వేస్తున్నారు." అన్నాను. ఆ తాళంతోపాటే ఆయన జపంసాగుతోంది. ముఖం కదులు తోంది. కాలు ఆడుతోంది. డాక్టరుగారు—"ఇది హృ కగ్గం కావటంలేదు. ఇక్కడ ఆయన నాడి కూడ చేతిలోకి రావటం లేదు. మరి ఈకాలితో తాళం నడుస్తోంది ఏం చెప్పుతాం ? ఈ విషయాలన్నీ ప్రత్యేకస్థాయితో ఉన్నాయి." అన్నారు. అందుకేనానోటివెంట "ఆయన బ్రహ్మనిర్వాణం పొందారు" అనే మాట వచ్చింది.

****************************************

## అ ను భూ తి

అంతటా బ్రహ్మను చూడటం, అంతటా బ్రహ్మనిర్వాణం చూడటం అనే వానిలో భేదం తెలుసుకోవాలి. బ్రహ్మనిర్వాణమును అంతటా చూడటమంటే ప్రపంచాన్నే మోక్షమయంగా చూడటమన్న మాట. ఇది అనుభూతియొక్క చరమసీమ.

—గీతాయీచింతనికా

****************************************

## * ప్రాయోపవేశం :-

జైనశాస్త్రాలు చెప్పినదానికిది సరిపోతుందని భావం టున్నారు. జలాహారౌషధాలు త్యాగంచేసిన మీదట భావేజీ పరిస్థితి క్షీణింపసాగింది. శ్రీమతి ఇందిరాగాంధీ మొ॥ పెద్దలు నాయకులు, నీరు, మందు తీసికోమని బాబాను బతిమాలారు. ఆయన అంగీకరించలేదు. అమూల్యమైన బాబా ప్రాణాలు రక్షింపబడాలనే ఉద్దేశ్యంతో న్యాయసూత్రం ఆధారంగా తీసికొని వార్ధావాస్తవ్యుడు శ్రీ వాలేచాజీ సుప్రీంకోర్టులో అభియోగంకూడ దాఖలు చేశారు. ఆచార్య వినోబా ప్రాణ రక్షణ చేయవలసిందే. ఇందులో భేదాభిప్రాయముండదు. కాని శ్రేష్ఠుడైనజ్ఞానయోగి నిర్ణయాన్ని సామాన్యదృష్టితో చూడ టం మంచిదికాదు. "జీవోన్యః పుద్గలశ్చాన్యః" దేహం వేరు. ఆత్మవేరు. అనేది భారతీయ సంస్కృతియొక్క దృఢవిశ్వాసం. స్థితప్రజ్ఞుడు తన దేహాన్ని ఆత్మోన్నతికి సాధనంచేసికొంటాడు. దేహం క్షీణించినమీదట దాన్ని స్వేచ్ఛగా శీఘ్రంగాత్యజిస్తాడు, దేహంమీద మోహం లేకపోవటంచేత దేహాన్ని త్యజించటానికి అతనికి దుఃఖం కలగదు. జైనశాస్త్రాల్లో గృహస్థుకి "సల్లేఖన" అనేది పదమూడవ వ్రతంగా చెప్పబడింది. యావజ్జీవమూ ధర్మానుకూలంగా వ్యవహరించి చివరకు మృత్యువు పిలుపు విని సాధకుడు సల్లేఖానా వ్రతధారణ చేస్తాడు. సమీపిస్తున్న మృత్యుదేవత ఆహ్వానాన్ని సంతోషపూర్వకంగా స్వీకరించ టాన్నే "సల్లేఖన" అంటారు. సల్లేఖనాధారణచేసే సాధకుడు

---

* ప్రొ. విద్యాధర్ ఉమాతే

మృత్యువంటే భయపడడు. దుఃఖపడడు. సమభావనకలిగి (సమత్వం యోగముచ్యతే) క్రమక్రమంగా ఆహార ప్రమాణం తగ్గించుకొంటూ ఉంటాడు. చివరకి పానీయం (నీరు) కూడ విడిచిపెడతాడు. కషాయమూ విశయమూ, ఆహారమూ, అన్నీ పరిత్యజించి సాధకుడు ఆత్మస్వరూపంలో లీనమై క్షీణ దేహాన్ని విడిచిపెడతాడు. దీన్ని "సమాధిమరణ"మనిగాని "సల్లేఖన" అనిగాని అంటారు.

"మృత్యువునకు శరీరంతో సంబంధముంది గాని ఆత్మతో లేదు" అని నిశ్చయించుకొని అతడు ఆత్మయొక్క విశుద్ధచిద్రసంలో లీనమవుతాడు. అందువల్లనే అతడు మృత్యు సమయంలో ప్రసన్నుడు సంతుష్టుడు, సమభావం కలవాడు అవుతాడు. సల్లేఖన అనేదాన్ని పండిత మరణ మంటారు. అది వందలకొలదిజన్మలని నాశం చేస్తుంది.

ప్రా—"తం మరణం మరియవ్వం జేణ మఓ సుమ్మఓ హోఇ"

సం—"తం మరణం మర్తవ్యం యేన మృతః సుమృతిర్భవతి"

మరణం సుమరణ మయ్యేలాగ మరణించాలని దీని భావం. మరణమనేది "అవశ్యంభావి." (తప్పక జరిగితీరేదే) అనే సంగతి తెలిసికొని దానిని ధీరతతో స్వీకరించటమే సుమరణం.

సల్లేఖన—అభ్యంతరమనీ బాహ్యమనీ రెండురకాలు—క్రోధాదుల్ని కృశింపజేయటం అభ్యంతరసల్లేఖన. శరీరాన్ని కృశింపజేయటం బాహ్యసల్లేఖన. మృత్యువు వస్తోందంటే

సామాన్యుడు భయపడి తప్పించుకొందామని చూస్తాడు గాని సాధకుడు సంతోషంగా స్వాగతం పలుకుతాడు. సల్లేఖన ఆత్మహత్య కాదు. ఆత్మహత్యలో వికార ప్రాబల్యం ఉంటుంది. సల్లేఖనలో వివేక ప్రాబల్యం ఉంటుంది. ఆత్మహత్య వికృతి. సల్లేఖన ప్రకృతి. ఆత్మహత్యలో మానసిక సంఘర్షణ, అసంతుష్టి, అస్థైర్యం ఉంటాయి. ఆత్మహత్యచేసుకొనే జీవుడు ఆధి (మనోదుర్గత) బాధితుడై ఉంటాడు. ఆత్మహత్యకు హేతువులు మానసిక వైఫల్యం దౌర్బల్యం, అసమాధానం, నిరాశ అయి ఉంటాయి. సల్లేఖన ఆత్మహత్యకంటె సర్వథాభిన్నమైనది. ఉపద్రవం, ముసలితనం, వ్యాధి, క్షామం మొదలైన కారణాల వల్ల మృత్యుకాలం సమీపించినప్పుడు కషాయాలు విడిచి శాస్త్రీయంగా (విధివత్) శరీరాన్ని కృశింపజేస్తూ శాంతి పూర్వకంగా ఆత్మయొక్క సచ్చిదానంద స్వరూపంలో లీనమై మృత్యువుకు స్వాగతం చెప్పటమే సమాధిమరణం, ఆత్మశోధన, పరమసామ్యభావ సంప్రాప్తి సల్లేఖనకు హేతువులు.

ఆచార్య వినోబాభావేజీ సర్వశ్రేష్ఠసాధకుడు కావటం చేత ఆయన చేసిన ఈ నిర్ణయం సల్లేఖన. దానిలో వికారాల ప్రాబల్యంలేదు. వివేక ప్రాధాన్యముంది. దేహాసక్తియొక్క త్యాగముంది. ఉత్కటమైన ఆత్మాభిముఖీనత ఉంది. ఆయన పరమ జ్ఞానయోగి కావటంచేత ఆయన నిర్ణయం ప్రకృతి ననుసరించింది. (సహజం) అందువల్ల సామాన్య జనుల జీవనవిషయికమైన కొలబద్ద జ్ఞానయోగి విషయంలో ఉపయోగపడదు. ఆయన నిర్ణయంలో నిశ్చయత్వం, ఆత్మతేజం, వివేక పరాకాష్ఠ

క్షీణదేహంమీద అనాసక్తి ఉన్నాయి. ఆయన నిర్ణయంలో కనిపించే ఆత్మాభిముఖ్యాన్ని గ్రహించి అంతర్నిహిత సత్యాన్ని అర్థంచేసికోవటం మంచిది. వినోబాజీ తీసికొన్న నిర్ణయంలో గోప్యతనం తెలిసికొని సమాజంలో అన్నిస్థాయిలలో ఉన్న వ్యక్తులుకూడ ప్రార్థనద్వారా సుఖచింతన చేశారు."

ఈ అనుశీలనంవల్లభావేజీ—— ""వార్ధకేమునివృత్తీనాం యోగేనాన్తే తనుత్యజాం" అన్న కాళిదాసవాక్యానికి లక్ష్యభూతులైన యోగి అనీ అనాసక్తి, భక్తి జ్ఞాన, వైరాగ్యాలు రూపొందిన సితప్రజ్ఞుడనీ వ్యక్తమవుతోంది.

కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః"

**ఓం**

**శాంతిః శాంతిః శాంతిః**

## మృతి కాదు - జీవనం

కురాన్‌లో ఒక వచనం వచ్చింది. అందులో "భగవన్మార్గంలో నడుస్తూ మరణించిన వారిని మరణించారని అనుకోకండి, మీరు వారిని చూడలేకపోయినా వారు నిరంతరం జీవించియే ఉంటారు" అని ఉంది. ఈశ్వర మార్గంలో చరిస్తూ ఉండగా వచ్చిన మృత్యువు జీవనమే.

"సేవక్" —— వినోబా

# శాంతి కృషి

ఈ కర్మయోగమే భావే నిర్వహించిన భూదానాది కార్యక్రమాలలో వికాసాన్ని పొందింది.

స్వాతంత్ర్యం వచ్చాక సేవాగ్రాంలో సర్వోదయ సమాజస్థాపన చేశాక పండిత నెహ్రూ భావేజీని ఢిల్లీవచ్చి శరణార్థుల పునరావాస కార్యకలాపాలలో సహాయపడమని కోరారు. అప్పుడు వినోబా ఢిల్లీలోను పరిసరాల్లోను ఒక నెల పర్యటించి శరణార్థుల హృదయాలలో ఏర్పడిన నిరాశ, అవిశ్వాసం తొలగించే ప్రయత్నం చేశారు. రాజఘాట్— ప్రార్థన సమావేశాల్లో ఆయన స్పష్టంగా— "గడచిన సంగతులు మరచిపోవాలి. మనస్సు దిట్టపరచుకోవాలి. హిందూ రాజ్యకల్పన అనేది ప్రజలు తమమనస్సులలోంచి తొలగించాలి మతమునేది వ్యక్తిగత విషయం. అది రాజకీయ క్షేత్రంలోకి రారాదు. అన్నిమతాల యెడల ఆదరమున్నప్పుడే అఖండ భారతం ఏర్పడుతుంది. హిందూధర్మం మనకి హృదయాన్ని విశాలపరచుకొనే శిక్షణ ఇచ్చింది. దీన్ని మనం సంకీర్ణముగాను, అసహిష్ణుపుగాను తయారుచేస్తే దానివల్ల కేవల హిందూ ధర్మానికేకాక దేశానికే నాశనం సంప్రాప్తమవుతుంది నిస్సందేహంగా, భౌతికసంపద అవసరమే కాని నైతికమైన ఆధ్యాత్మికమైన విలువలు అన్నిటికంటె పెద్దవి."—కేంద్రీయ శాంతి సమితి సమావేశంలో వినోబా "లక్షలకొలది శరణార్థులు మహా

కష్టాలలో కాలం గడుపుతున్నారు. వీరికి పునరావాసం కల్పించే కార్యక్రమంలో వేగం పుంజుకోవాలి, ఈవిషయంలో మన పద్ధతీకార్యక్రమమూ నిర్ణయించుకొనేటప్పుడు పాకిస్తాన్ ఏం చేస్తోందనిగాని ఏం చెయ్యటంలేదనిగాని ఆలోచించకూడదు. స్వతంత్రబుద్ధితో ఆలోచించి న్యాయమని తోచింది చెయ్యాలి" అని చెప్పారు.

కురుక్షేత్రంలో శరణార్థులకు—— ఇచ్చిన సలహా—— "కురుక్షేత్రం మొదటినుంచీ తీర్థక్షేత్రమే. ఇక్కడ గీతా బోధ జరిగింది. గీత పరిశ్రమచేయకుండ తినటం పాపమని చెప్పింది. కాబట్టి రోజూ ఏదోపనిచేసి జీవనోపాధి కల్పించుకోవాలి. శరణార్థులు తమ పిండి తాము విసురుకోవచ్చు. ఇలాగే నూలు వడకటం మొదలైన కార్యక్రమాలు మనని మునకాళ్లమీద నిలబెడతాయి." ఈయాత్రలో భావేజీ సేవాభావం, మతసహనం, మైత్రి, సహకారం వంటి భావాలు పెంపొందించుకోవలసిన అవసరాన్ని శాస్త్రప్రమాణాలతో ప్రబోధించారు.

## భూదానోద్యమం :-

ఒకటిన్నర సంవత్సరాలు పూర్తిగా శరీరశ్రమ (శాంతి యాత్రలో భావేజీకి కలిగిన మీదట మళ్ళీ నిరాశ్రయులకు పునరావాస కల్పన సాంప్రదాయిక శాంతిస్థాపన జరపటానికి కొంత చేయవలసివచ్చింది. 1949 జూలై మొదటి వారంలో వార్ధా తిరిగి వచ్చారు. "సర్వోదయ" మాసపత్రిక సంపాదకత్వ

కరించారు. దీని మొదటి సంచిక 1949 ఆగష్టు 15వ తేదీని ువడింది. మధ్య మధ్య కళ్యాణసితసింధీ నిరాశ్రయుల బస్తీ ుతూ ఉండేవారు.

సేవాగ్రాంలో విశ్వశాంతి పరిషత్ సమావేశాలు డిసెం ు చివరి వారంలో ప్రారంభమై 1950 జనవరి మొదటివారం కు జరిగాయి. ఇంగ్లండు, అమెరికా, ఫ్రాన్స్, ఇటలీ, ాను, హాలెండ్, చెకోస్లవేకియా, న్యూజీలాండు మొదలైన ాల శాంతి సేవకులు మహాత్మాజీ పుణ్యస్మృతిలో అక్కడ ావేశమయ్యారు. ఈ పరిషత్తు ప్రారంభిస్తూ భావేజీ హింస అంటే హింసాత్మక కార్యక్రమాలలో పాల్గొన ండ ఉండటం మాత్రమే కాదు. మానవతాసేవార్థం రచనా ్మకమైన కార్యక్రమమే దాని నిజ స్వరూపం. అహింసాదేవి అ శక్తిమంతమైన శస్త్రాలున్నాయి. అవి ప్రేమ శస్త్రాలు. ాశకరశస్త్రాలుకావు. సృజనాత్మకమైనవి. అయినా నాశం స్తాయి. ఏం నాశం చేస్తాయి? ద్వేషాన్ని, అన్యాయాన్ని, కటినీ, దారిద్ర్యాన్నీని''.అంటూ అహింసా మహత్వం ప్రపం ానికి వెల్లడించారు. ఆయన యింకా— "బలహీన రాజ్యాల యం తొలగాలనీ, అవి బలపడాలనీ కోరుతూ భారతదేశం హింసా శక్తిని పెంచటానికి కృషి చేస్తోంది. ఇందులో మాకు ాఫల్యం లభించకపోతే ఈ పని పూర్తిచెయ్యటానికి భగవంతు వరినో పంపుతాడు. విశ్వమంతటా అహింస వ్యాపించే వరకు ు కార్యక్రమం సాగుతూనే ఉంటుంది" అన్నారు.

శివరాంపల్లిలో జరిగిన సర్వోదయ సమ్మేళనంలో వినోబా పంచవిధ రచనాత్మక కార్యక్రమం సూచించారు.

1. అంతశ్శుద్ధి, 2. బహిశ్శుద్ధి, 3. శ్రమ, 4. శాంతి 5. సూత్రాంజలి. ఈ కార్యక్రమం నిష్ఠతో కొనసాగించాలని కార్యకర్తలను కోరారు

చివరి సమావేశంలో వినోబా తెలంగాణా వెళ్ళాలనే సంకల్పం వెల్లడించారు. అక్కడ ఒక ప్రక్క సామ్యవాదులు మరొక ప్రక్క సైన్యము ఒక క్లిష్టపరిస్థితి కల్పించారు. వారిని తిరిగి వెళ్ళటానికిముందు ఆయన స్వయంగా పరిస్థితి సంపూర్ణంగా అర్థం చేసుకోవాలని నిశ్చయించుకొన్నారు. "ఈ యాత్రలోను, తర్వాత, ఏంజరుగనున్నదో దైవానికే తెలుసు" అన్నారు.

శ్రీరామనవమి శుభముహూర్తాన (ఆ రోజు 25-4-1951) శాంతియాత్రకు ప్రయాణమయ్యారు. వెంట దామోదర్ దాసు, మహాదేవితాయి, శ్రీమన్నారాయణ్ జీ యొక్క ధర్మపత్ని మదాలస ఇంకా ఒకళ్ళిద్దరు స్థానిక కార్యకర్తలు ఉన్నారు. ఈ పాదయాత్రలో రక్షణ నిమిత్తం పోలీసుగాని సేనగాని సహాయపడటం భావేజీ అంగీకరించలేదు. స్వతంత్ర భారత దేశంలో సర్వోదయోద్యమ చరిత్రలో ఈ యాత్ర విలక్షణత్వాన్ని సంతరించుకొంది.

శివరాంపల్లి నుంచి వినోబా ఉదయమే బయలుదేరి సూర్యోదయమైన కొద్దిసేపటికే హైదరాబాదు చేరారు. అక్కడొక రోజుండి జైలులో ఉన్న సామ్యవాదుల్ని కూడ కలిశారు. వారితో సంభాషణ ప్రేమపూర్వకంగా స్పష్ట రీతిలో సాగింది. 16వ తేదీని హయాత్‌నగర్‌లో మకాం. 17న బతసింగరన్ గ్రామంలో. మూడోనాటి కాయన మకాం పోచంపల్లిలో జరిగింది. ఆ ఊరు నల్గొండ జిల్లాలో ఉంది. సామ్యవాదుల కార్యకలాపాలకు గొప్ప కేంద్రం. పోచంపల్లి జనాభా మూడు వేలు. శ్రీమన్నారాయణజీ సతీమణి కూడ ఆ యాత్రలో వినోబాతో కూడ ఉండటంవల్ల ఆమె చెప్పిన దానినిబట్టి శ్రీమన్నారాయణజీ ఈ క్రింది ఘటనాక్రమాన్ని వివరించారు.

వినోబాజీ గ్రామానికి చేరుకోగానే వేదమంత్రాలతో ఆయనకు స్వాగతమీయబడింది. కొంతసేపయ్యాక యాత్రికులు స్నానపానాదుల నిమిత్తం గ్రామంలోకి వెళ్ళారు. వినోబాజీ స్థానిక శాలలో కొంచెంసేపు విశ్రాంతి తీసికొని వెంటనే ప్రజల ఆర్థిక పరిస్థితి స్వయంగా తెలుసుకోవటానికని ఊళ్ళోకి వెళ్ళిపోయారు. హరిజనవాడతో ప్రారంభం చేశారు. వారిస్థితి తాను కళ్ళారా చూడాలని ఆయన వారి ఇళ్ళలోకి కూడ వెళ్ళారు. వారు తమ మకాంలోకి తిరిగి చేరుకోబోతోంటే కొందరు హరిజనులు ఆయన వద్దకు వచ్చి "మేం పేదవాళ్ళం. పనిలేని వాళ్ళంకూడాను. అందువల్ల బాధపడుతూ ఉన్నాం. దయచేసి మాకు కొంచెం సాయం చేయండి" అన్నారు.

"మీకు నేనే విధంగా సహాయం చేయగలను?" ఆ వినోబా అడిగారు.

"మాకు కేవలం పని కావాలి. అంతకంటె ఏమీవద్దు. దయచేసి మాకు కొంచెం భూమి ఇప్పించారంటే దాని మీద కష్టం చేసుకొని మా పొట్ట మేం పోషించుకొంటాం. ఈ సహాయానికి మీకు మేం ఎప్పటికీ కృతజ్ఞులమై ఉంటాం" (మీ మేలు మరచిపోం) వినోబాకు ఏం చెయ్యాలో తోచలేదు. ఆయన అన్నారు:- నేను మీ ఊరువచ్చి ఒక్కగంటే అయింది. స్నానం విశ్రాంతి అయ్యాక మేమందరం నూలు వడుకుతాం. అప్పుడు మీరు అక్కడికివస్తే మనం కూర్చుని ఆలోచిద్దాం. మీకు భూమి ఎట్లా లభిస్తుంది? అనే సంగతి కూడ నేనాలోచిస్తాను.

ఆ ప్రకారం మధ్యాహ్నం నలభై హరిజన కుటుంబాల వారు వినోబా దగ్గరకు వచ్చారు. దారంతీయుటమైనాక ఈ గ్రామీణులముందు వినోబా ఒక మంచంమీద కూర్చున్నారు. ఒక హరిజన ప్రతినిధి చేతులు జోడించుకొని నిలబడి భూమి కావాలనే తమ కోరికను మళ్ళీ వెల్లడించాడు.

"మేము భూమాత సేవచేస్తాం. ఆతల్లి ఇచ్చిన దానితో మా బిడ్డల పొట్టలు నింపుకొంటాం."

"మీకు ఎంత భూమి సరిగ్గా అవసరముంది?" వినోబా అడిగారు. కొంచెంసేపు వాళ్ళలోవాళ్ళు మాటలాడుకొని [illegible] ఎనభై అన్నారు——

"ఎనభై ఎకరాలు చాలు. మేము నలభై యిళ్లవాళ్లం ఒక్కొక్క కుటుంబానికి రెండేసి యెకరాలు చాలు" వినోబా ఆలోచనలోపడ్డారు. ఉపాయం ఏమీ తోచటంలేదు. అందుచేత నెమ్మదిగా ఇలా అన్నారు.

"నేను ప్రభుత్వంతో మాటలాడతాను. మీకేమన్నా కొంతభూమి లభిస్తుందేమో చూస్తాను. సమస్య కఠినమైనది. అయినా ఏం జరుగుతుందో ప్రయత్నంచేస్తాను."

అప్పుడాయన మనస్సులో బహుశః తన ఎదుట కూర్చున్న వారిలోనే ఎవరైనా ఈ పేదల అవసరం తీర్చగలవారుంటారేమో (ఈ గ్రామస్థులే) అనే ఆలోచన వచ్చింది. ఆయనకళ్లు తెఱచి పైకిచూస్తూ శ్రోతల నుద్దేశించి చిఱునవ్వుతో అనా లేకుండానే అన్నారు. "సోదరులారా! మీలో ఎవరైనా ఈ హరిజన సోదరులకు సాయపడగలరా? వాళ్లు భూమిమీద కాయకష్టంచేసి పొట్టగడుపుకోవాలనుకొంటున్నారు" ఆశ్చర్యకరంగా స్థానిక కార్యకర్తలలోనుంచి రామచంద్రారెడ్డి అనే ఒకాయనలేచి వినోబాముందు చేతులుజోడించుకొని నుంచుని—

"మహారాజ్! నాకు కొంత భూమి ఉంది. దాన్ని దానం చెయ్యటానికి నేను సత్పాత్రకోసం వెదుకుతున్నాను. రెండువందల ఎకరాలలో సగంనేల కొంతమందికి తగినవారికి పంచాలని మాతండ్రిగారి కోరిక. కొన్ని రోజుల్లుగా ఏం చెయ్యాలా అని ఆలోచిస్తున్నాను. కాని ఏమీ తోచటంలేదు. ఈరోజు నాకు బంగారపు రోజుగా వచ్చింది. దయచేసి వంద

ఎకరాల ఈదానం తమరు స్వీకరించండి. ఈదయచూపితే నాకు గొప్ప ఉపకారం చేసినట్లవుతుంది" వినోబాకుగాని ఆయన అనుచరులకుగాని వారేమివింటున్నారో దానిమీద విశ్వాసం కలగటంలేదు. నాటియాథార్థ్యంమీద ఎవరికీకూడ నమ్మకం కలగనంతచక్కగా ఉన్నాయి మాటలు. కాని వినోబాజీ అంగీకారంకోసం రామచంద్రారెడ్డి చేతులుకట్టుకొని నిలబడి ఎదురుచూస్తూనే ఉన్నారు.

వినోబా భావోద్వేగనిమగ్నులై పోయారు. నిజంగా ఇది చమత్కారం. హరిజనులు కేవలం 80 ఎకరాల భూమి అడిగారు. దాత మనస్ఫూర్తిగా వందయెకరాలిస్తున్నారు. వినోబా మళ్ళీహరిజనులవైపు చూచారు. వందయెకరాల దానం సంగతి వాళ్ళూ విన్నారు. కాని వాళ్ళు ఎనభై యెకరాలన్న తమమాటమీదే నిలబడ్డారు. వాళ్ళుమళ్ళీ నిండుమనస్సుతో నేలతల్లిని సేవిస్తామంటూ తమమాటని రెట్టించారు. దురాశ కక్కడ తావేలేదు.

అంగవస్త్రంతో తన కన్నీళ్లు తుడుచుకొని వినోబా "నేనిక్కడకు వట్టిచేతులతో వచ్చాను. రేపుప్రొద్దుటే ఇక్కడి నుంచి ముందు గ్రామానికి వట్టిచేతుల్తోటే వెడతాను. దాన మిచ్చేవారు దానం తీసుకొనేవారు ఇక్కడే మనమధ్య కూర్చున్నారు. వారు మనముందే దానం ఇస్తారు. తీసుకొంటారు. దాత హరిజన సోదరులకు కొంతడబ్బు కొన్ని వ్యవసాయ పరికరాలుకూడఇస్తే వాళ్ళు సహకారపద్ధతిలో సేద్యం చేసుకో గల్గుతారు" అన్నారు.

రామచంద్రరెడ్డి వినోబాముందు సవినయంగా తలవంచి ఈ బాధ్యత స్వీకరించారు. హరిజనులు ఆనందం సంతోషంతో పాటు వినోబా పాదాలు స్పృశించారు. వినోబా అక్కడే అప్పటికప్పుడు ఐదుగురు వ్యక్తులతో ఒక కమిటీ (సంఘం) ఏర్పాటుచేశారు. అందులో దాత, హరిజన ప్రతినిధులిద్దరు అనుభవంగల ఇద్దరు గ్రామకార్యకర్తలు ఉన్నారు.

ఈ విధంగా భూదాన గంగా ప్రవాహం ప్రారంభమయింది. ప్రభుత్వ ప్రభావం లేకుండా ఈ విధంగా స్వేచ్ఛగా భూదానం జరుగుతుందనే భావన వినోబాకు లేశమాత్రంకూడ లేదు. కొన్ని సంవత్సరాలుగా ఆయన భూమిలేని భారతీయ రైతు కూలీల సమస్యను గురించి ఆలోచిస్తూ ఉన్నారు. కాని వారికేమీ ఉపాయం తోచలేదు. పోచంపల్లిలో జరిగిన ఈ ఆకస్మిక చమత్కారం ఆయన్ని గద్గదకంఠుణ్ణి చేసేసింది. ఇది ఆయన అనుకోనిది. అందుచేత అందులో ఆయనకి స్పష్టంగా భగవంతుని హస్తం కనిపించింది.

సాయంకాల ప్రార్థన తర్వాత గ్రామ ప్రజల నుద్దేశించి ఆయన:- "మనిషి చేసేదంతా తన ఆలోచన ననుసరించే చేయడు. ఇటువంటి ఉదాత్త సత్కార్యాల వెనుక సర్వదా ఏదో దైవిక శక్తి ఉంటుంది. నేను ఒక శ్రద్ధాశీలిని. భగవంతుని పేరిట పనిచేస్తూ ఉంటాను. భగవత్సంకల్పమున్నట్లయితే నేను పేదల కోసం ఈ విధంగా భూమి యాచించటానికి ఊరూరా తిరుగుతాను". రాత్రి వినోబా నిద్ర కూడ పోలేక పోయారు. పోచంపల్లి సంఘటనలగాఢ ప్రభావం ఆయన హృదయం మీద

పడింది. మరునాడు ఆయన మరొక ఊరు వెళ్ళటానికి బయలు దేరుతూ ఉండగా రామచంద్రరెడ్డి ఆయన కుటీరం దగ్గఱకు వచ్చి ఆయన పాదస్పర్శచేసి భూదాన పత్రం వారికిచ్చారు. అఖిల భారత కాంగ్రెసు కమిటీ ప్రధాన కార్యదర్శి హోదాలో శ్రీమన్నారాయణ్ జీ కోరిక మేరకు "ఆర్థిక సమీక్షా" అనే కాంగ్రెసు పత్రిక 1–11–1955 నాటి సంచికలో శ్రీరామ చంద్రరెడ్డి ఒక వ్యాసం వ్రాశారు. దాని చివరి పేరాలో రెడ్డి– "నేను భావనలో (భావోద్వేగం-ఆవేశం) పడి ఈ దానం చేశా నని కొందరంటున్నారు. మరి కొందరు నామీద నైతిక భారం పడిందంటున్నారు. కాని "ఇందులో నేనేం తప్పు చేశా"నని నేనడుగు తున్నాను. తన నైతిక కర్తవ్యం తెలుసుకొని పేద లకు భూమి యివ్వటం ఉచితం కాదా? నైతిక కర్తవ్యపాలన తర్వాత మనస్సులోకి ఏ దుర్భావనారాలేదు. (జాలదు) నా హృదయం శుభ్రంగా ఉంది. మనస్సు మీద ఏ బరువూ లేదు. దానికి బదులు శతాబ్దాల బరువు తొలగించుకొని మనస్సు తేలిక పడింది."

ఆ వేళ నుంచి ఊరూరికీ పాదయాత్ర చేసి వినోబా పేదల కోసం భూమి అడగటం ప్రారంభించారు. నిజానికి "భూదాన" శబ్దప్రయోగమయితే పోచంపల్లి తరువాతి మకాం నుంచీ ఆయన ప్రారంభించారు. ఇంకా కొన్నాళ్ళ తర్వాత "యజ్ఞ" శబ్దం దానికి జోడింపబడింది.

ఇంక ప్రతి గ్రామంలోనూ భూదానం లభించటంతో భగవంతుడదే కోరుతున్నాడని భావేకి నిశ్చయమైంది. శ్రద్ధగా

దృఢత్వంతో ఈ ఉద్యమం అఖండరూపంతో కొనసాగించా లనుకొన్నారు. తెలంగాణాకు చెందిన సుమారు అన్ని గ్రామా లలోను లభించిన ఈ భూదానం వాతావరణాన్నంతటినీ మార్చి టంలో ఇంద్రజాలంలాగ చమత్కారంచేసి పారేసింది. పగలు సేనల భయంవల్ల రాత్రి సామ్యవాదుల బాధలవల్ల ప్రజలొక చోట కలుసుకోలేని సమావేశంకాలేని ఆప్రదేశంలోనే ప్రతిరోజూ సాయంకాల ప్రార్థనల్లోకి జనం వేలసంఖ్యలో రావటం మొదలుపెట్టారు. అత్యంత ప్రశాంతతతో వినోబా ప్రవచనాలు వినసాగారు. ద్వేషము హింస క్రమంగా తగ్గుతూ వాటిస్థానంలో ప్రేమ పరస్పరసహకారం కనిపించసాగాయి. వినోబా ప్రజలకు స్వావలంబత నిర్భయత బోధించారు. వినోబా సభలకు సామ్యవాదులూ వస్తూఉండేవారు. క్రమ క్రమంగా వినోబా, భావాలప్రభావం వారిమీదపడుతూ వచ్చింది వినోబా తన ఒక ప్రసంగంలో :—సా మ్య వా దు లు పేదల సహాయంకోసం ధనవంతుల్ని చంపవలసిన అవసరంలేదు. ప్రజాస్వామ్యంలో ఇప్పుడు పిస్తోలుస్థానాన్ని ఓటు ఆక్రమిం చింది. సామ్యవాదులు బహిరంగంగా ఎదుటికివచ్చి ప్రజాభి ప్రాయానికి శిక్షణ ఇవ్వాలి. వారు కనక హింసనువదిలేస్తే ఈపనికోసం నేను వారితోపాటు దేశంమూలమూలలా తిరుగ గలను" అన్నారు. ఈవిధంగా వినోబా తెలంగాణా గ్రామాల్లో తిరిగేటప్పుడు అమాయకులైన గ్రామీణులు "గాంధీజీ మళ్ళీ క్రొత్తఅవతారమెత్తి వచ్చారనేవారు. మరికొందరు గాంధీగా రబ్బాయి మనల్ని కలుసుకోవటానికి వస్తున్నా"డనేవారు.

కొందరు ఏదో దేవత భూలోకానికివచ్చి మనకి భూమినిస్తోం" దనేవారు. రెండవరోజు సూర్యోదయానికి వినోబా రెండవ ఊరు చేరలేకపోతూ ఉండేవారు. భూస్వాములు ఆయన చేతు లతో దోచుకోబడటానికి తమంతట తాము తయారై తో ఉండే వారు. ప్రారంభదశలో భూదానం చేసేవాళ్లు సామాన్యంగా చిన్న, మధ్యతరగతి రైతులే అయిఉండేవారు. కాని భూదా నోద్యమం పురోగమించినకొద్ది పెద్దరైతులుకూడ భూదానం చేయట మారంభించారు. నిజమైన శ్రద్ధాభక్తులతో వినోబాకు స్వాగతం చెప్పటం మొదలుపెట్టారు.

గ్రామీణ సమాజానికి వినోబా తన భూదాన విషయా న్నినేక విధాలుగా తెలియజేస్తూ ఉండేవారు. ప్రజలు పూల మాలలతో ఆయనకు స్వాగత మిచ్చేటప్పుడు—"ఈపువ్వులు సుందరమైనవి కాని వీటితల్లి భూమాత ఇంకా సుందరమైనది. పువ్వులు మీరు పూజకోసం తెచ్చారు. కాని నాకు పూజ అక్కరలేదు. భూమికావాలి. నేను మీబిడ్డని. మీకుటుంబ సభ్యుణ్ణి. మీకు నలుగురుపుత్రులుంటే నేనైదోవాణ్ణి. నాకు నావాటా లభించాలి" అనేవారు—ఇతరులతో పూర్వకా లంలో మన పూర్వులు శాంతి నెలకొల్పటానికి యజ్ఞాలు చెసేవారు. గ్రామాలలో వ్యాపించిన అశాంతి తొలగించటానికి నేనీ భూదానయజ్ఞం ప్రారంభించాను. అందువల్ల సర్వ సామాన్యునికి శుభం కలగజేయటానికి ప్రతివ్యక్తి ఇందులో పాల్గొనాలి" అని, నిత్యశంకితుల సమక్షంలో ఆయన మానవ హితంకోసం తన అచంచల దీక్షను వ్యక్తంచేస్తూ—"మానవ

హృదయం మారగలదు. మన చెడుగులన్నిటికీ ఏకైక చికిత్స అహింసయే అని నేనంగీకరిస్తున్నాను (భావిస్తున్నాను) ఇది మన మానసిక విప్లవం. ఇటువంటి విప్లవం హింసవల్లరాదు. అది బుద్ధుడు క్రీస్తు, గాంధీ చెప్పిన దారినే రప్పించబడ గల్గుతుంది" అని చెప్పేవారు.

సామ్యవాదులతోకూడ ద్వేషము, హింస, హత్యా పద్ధతి విడిచిపెట్టమని చెపుతూ వారన్నదిది— "మానవుడే ప్రవాహంలోనైనా పడ్డప్పుడు కేవలం తన సాహసంతోనే ఈదుకొని గట్టెక్కలేడు. ప్రవాహ తీవ్రత, వేగమూకూడ అతనికి తోడ్పడతాయి. మానవుడు ఇష్టమున్నా లేకపోయినా తనపని చేస్తూనే ఉంటాడు. ఇలాగే యుగప్రవాహం ఇటు వైపు తిరిగినపుడు మనుష్యుడు హృదయం మార్చుకొంటేనే అది సహాయపడుతుంది. ఈనాడు ప్రపంచం ద్వేషమూ, యుద్ధాలు అనే అగ్నిలో కాలిపోతోంది. నాద్వారా కొన్ని ప్రేమబిందువులు పడాలనే భగవత్సంకల్పం అయితే అందుకు నేనానందంగా నిమిత్తమాత్రుణ్ణవుతాను." వినోబా పేదల దగ్గఅనుంచికూడ భూదానం స్వీకరించేవారు. ఒకచోట ఒక రైతు తన ఒక ఎకరంలోనుంచి ఒక కుంట (40వ వంతు) దానం చేయదలచాడు. కాని ఇంత చిన్నపొలం పంచెయ్యాలో ఎవరికీ అర్థంకాలేదు. అప్పుడు వినోబా— దాతతోనే నేనొక మాట చెప్పదలచుకొన్నాను. ఏమిటంటే అతడు తానే ఆపొలాన్ని సేద్యంచేసి దానిమీదవచ్చే ఫలసాయాన్ని పేదల పనులకు ఖర్చుపెట్టటం మంచిది. ఇదె కూడ తనలో తనకు

కలిగిన ఒక విప్లవమే. తనకున్న ఒకఎకరంలోనే ఒక కుంట నేల దానం చెయాలనే ప్రేరణకలగటం. ఎక్కడైనా ఆదర్శాన్ని ఆధారం చేసుకొని విప్లవం జరుగుతుంది. జీవనం ఉన్నతికి పురోగమిస్తుంది".

ఇంకొక ఊళ్ళో భూదానం ప్రత్యక్ష జీవనాన్ని మార్చే అహింసా ప్రయోగమని అభివర్ణించారు. ఆయనన్న దేమిటంటే "అహింస ఆధునిక విజ్ఞానానికి విరోధి కాదు. విజ్ఞానం ఈ భూమి మీదకు స్వర్గాన్ని తేగలుగుతుంది. కాని అది యీ పనిని అహింస యొక్క సహాయంతోనే చేయగలుగుతుంది. మరొక వైపు విజ్ఞానంతోపాటు హింసకూడ సంఘటితమైతే మాత్రం ప్రపంచం ధ్వంసమైపోతుంది." భూదానమే కాక గ్రామస్తులు తమ గ్రామాల్లో చిన్న పరిశ్రమలు (పల్లె పరిశ్రమలు) నెల కొల్పటం ద్వారా స్వావలంబనం పెంపొందించుకోవాలనీ బోధించారు. రైతు కేవలం పొలంతోటే ఇతర పరిశ్రమ లేకండ జీవించలేడు. తమ గ్రామాల్లో ఉత్పత్తి జరిగే ముడి సరుకుతో అక్కడే అవసరమైన సరుకు తయారు చేసుకొంటే గాని రైతు తన జీవితాన్ని నిలదొక్కుకోలేడు. అంటూ ప్రబోధించారు. తెలంగాణాలో వినోబా దినచర్య ఈ విధంగా ఉండేది.

1. ఉదయం నాల్గు గంటలు కాకుండానే వారులేచి కూర్చునే వారు.

2. ప్రార్థనకు ముందు కొంత స్వాధ్యాయం చేసేవారు.

3. అయిదు గంటలప్పుడు పాదయాత్ర ప్రారంభమయ్యేది.
4. తొమ్మిది గంటలకి పది పన్నెండు మైళ్ళు నడిచి ముందు ముకాముకి చేరేవారు.
5. అక్కడ స్నానమూ సాదా భోజనమూ చేసి విశ్రాంతి తీసికొనేవారు.
6. ఇటుపైన రెండు గంటలు పేపరు చూడటం, ఉత్తర ప్రత్యుత్తరాల కార్యక్రమంలో గడిచేవి.
7. అప్పుడొక గంట రాటం మీద నూలు తీసేవారు.
8. నాల్గు గంటలకు ఇంటర్వ్యూలు (సంభాషణలు) ప్రారంభమయ్యేవి.
9. ఐదు గంటలకు ప్రార్థన.
10. ప్రార్థన తర్వాత ప్రవచనం.
11. మళ్ళీ కొంచెం సేపు ఎవరైనా వచ్చి కలవటం.
12. తొమ్మిదింటికి నిద్ర పోయేవారు.

వినోబా యొక్క ఈ చరిత్రాత్మక పాద యాత్ర 51 రోజులు సాగింది. 200 గ్రామాల మీదుగా వెళ్ళారు. పొలం లేని కూలీల కోసం ఈ యాత్రలో వారికి దాదాపు 12 వేల ఎకరాల నేల లభించింది. కోదండరామరెడ్డి, 2 లక్ష్మి బాయీ సంగమ్, 3 కేశవరావు అనే ముగ్గురితో ఒక కమిటి

నేర్పరచారు. దాని సంయోజకుడు (కన్వీనర్) కేశవరావు. ఈ కమిటీకి ఆయన "శూన్య సమితి" అని పేరు పెట్టారు.

ఈ ముగ్గురు కార్యకర్తలు నమ్రతా, సేవా భావాలతో పనిచేయాలని దీని భావం. ఈ యాత్రలో వినోబా సుమారు 500 తగవులు (కేసులు) పరిష్కరించారు. రెండు లక్షల మంది జనంలో ప్రసంగించారు.

ఆయన మకాం చేసిన ఊళ్ళలో ఆయనకు భూదానం లభించని ఊరు ఒక్కటి కూడలేదు. మొత్తం మీద భూదానం రోజుకి 240 ఎకరాల రేటున జరిగింది (Average) నిజాము చాల లోభి అనేవారు. కాని ఆయన కూడ కొంత భూమి వినోబాకు ఇచ్చారు. చెప్పుకోదగిన సంగతేమిటంటే— ఈ పాదయాత్రా ప్రభావం తెలంగాణాలో వాతావరణం మీద బాగా పడింది. వినోబా తెలంగాణా విడిచి పెట్టిన తర్వాతకూడ స్థానిక కార్య కర్తలు ఇంకా లక్ష ఎకరాల భూమిని భూదానంలో పొందగల్గారు.

వినోబా తెలంగాణాలో నిర్వహించిన కార్యక్రమం జవాహర్‌లాల్‌జీని ప్రభావితుణ్ణి చేసింది. భారతీయ ఆర్థిక ప్రణాళిక మీద వినోబా భావాలు విలువైనవని ఆయన తలంచారు. అందుచేత ప్రణాళిక యొక్క ఆఖరి ముసాయిదాకు ముందు వినోబా యొక్క సహాయోగమూ సహామతి లభించాలని భావించి (భావేజీని) ప్రణాళికా సంఘ సభ్యులు భావేజీతో

చక్కగా చర్చించేందుకనువుగా ఆయన్ని ఢిల్లీ రమ్మని ఆహ్వానించారు.

వినోబా పౌనార్‌లో "కాంచన-ముక్తి" ప్రయోగంతో లగ్నచిత్తులై ఉన్నప్పటికీ ఆహ్వానం తిరస్కరించటం ఉచితం కాదని సెప్టెంబరు 12న ఢిల్లీకి పాదయాత్రగా వెళ్ళటానికి నిశ్చయించారు. నెహ్రూజీ సందేహంలో పడ్డారు. పవనార్ నుంచి ఢిల్లీ 800 మైళ్ళు. భావేజీ కాలినడకన వస్తారని ఆయన ఊహించనేలేదు. కాని ఒకసారి ఒక నిశ్చయం చేసుకొన్నాక వినోబా దాన్ని వదలరని నెహ్రూజీకి తెలుసు.

ఇలా నిర్ణయించుకోవటంలో వినోబా ఉద్దేశం ముఖ్యంగా కమ్యూనిస్టుల బెడదలేని చోటకూడ భూదాన కల్పన (అంచనా) అజమాయిషీ చేయాలనేదే. ధనవంతులైన వారు తమ పేదలైన సోదరులను తప్పకుండా ఆదరిస్తారు. భూమినిస్తారు. అనే ఆశ ఆయనకుంది. ఆ ఆశ నెరవేరితే అహింసాత్మక విప్లవానికి బలం చేకూరుతుంది. అందుచేత తాను ఢిల్లీకి పాదయాత్రగా బయలుదేరతారనగా ఆయన చేసిన ప్రసంగం ఫలించి స్థానిక గ్రామీణులు 15 ఎకరాల నేల ఇచ్చారు. మర్నాడు బయలుదేరి రోజుకి 12 నుండి 16 మైళ్ళ వంతున నడిచి సెప్టెంబరు 15కు నాగపూర్ చేరారు. ఆనాడక్కడ తన హృదయాన్నాయన ఈ విధంగా వెల్లడించారు. "భగవంతుడీశరీరంలో శక్తిని నిలిపినంత కాలం దేశంలో తిరుగుతూ భూమిలేని వాళ్ళ కోసం భూమి కోరుతూ ఉంటాను. గాలితో నీరుతో సమానమైనదే భూమికూడ. దాని మీద ఎవరికీ వ్యక్తిగతమైన యాజమాన్యం ఉండకూడదు. అది కేవలం భగవంతుడిది. అది

అందరి ఉమ్మడి ఆస్తి. దాని పంపకం న్యాయంగా జరగాలి॥ మొదటి కాలంలో 110 మైళ్ళు నడిచి 2 వేల ఎకరాల భూమి సంపాదించారు. ఇది రోజుకి మూడు వందల యెకరాలలెక్కని వచ్చినట్లు. తెలంగాణాలో లెక్క రోజుకి 240 ఎకరాలన్న దానితో పోలిస్తే ఇది యెక్కువ కదా! భూదానయాచనా ప్రభావం కమ్యూనిస్టు ప్రభావమున్న ప్రదేశాలకే పరిమితం కాదన్న దానికిది ప్రమాణం. ఇతర ప్రదేశాల్లోకూడా దీని తత్క్షణ ప్రభావం పడింది. పేదలు, ధనికులు, మధ్యతరగతివారు అందరు వినోబాకు భూమినిచ్చారు.

నవంబరు 13కి, సరిగా రెండు నెలలకన్నమాట, ఆయన ఢిల్లీ చేరారు. ఈ యాత్రలో 19000 ఎకరాల భూమి లభించింది.

భూదానంలో లభించిన చిన్నచిన్న ముక్కలలో సహకార పద్ధతిలో వ్యవసాయం చేయించవచ్చుగాని ఇది సేద్యం చేసేవారి యిష్టం మీద జరగాలి. ఈ విషయంలో ప్రభుత్వం బలవంతం కంటె రైతులు స్వయంగా నిర్ణయించుకొనేలాగ ఉండాలి. రష్యాలో మార్క్సు వాదం అమలు పరచటానికి సిద్ధపడినట్లే భారతదేశం సర్వోదయం లేదా భూదానం యొక్క అహింసాత్మక పద్ధతి అనుసరించటానికి సిద్ధపడాలి. ప్రయోగం ఆచరణలో సఫలం కాగలదని నాకు నిశ్చయముంది. కాని తగిన దార్ఢ్యంతో వికాసం తేవాలి. ఇప్పుడీ భూదానం సహజంగా గంగోత్రిలా చిన్నదైనా క్రమంగా పవిత్రనదీ రూపం ధరిస్తుందని దీన్నిగురించి వివరిస్తూ వచ్చారు.

ఆంధ్రప్రదేశ్‌లో మళ్ళీ బాబా 1955లో ప్రవేశించారు. భూదానోద్యమ సందర్భంలో ఈ ఉద్యమానికి సర్వవిధాలా తోడ్పడటానికిగాను ఆం. ప్ర. కాం. సం. కార్యవర్గం సమావేశమై ఒక కమిటీని వేసింది. ఆ కమిటీకి కన్వీనర్ శ్రీ మండలి వెంకట కృష్ణారావు. శ్రీయుతులు మిస్సుల సూర్యనారాయణ, పొన్నాడ శ్రీరామచంద్రుడు, రేబాల బుచ్చిరామిరెడ్డి, రావుల మునిరెడ్డిగారలు సభ్యులు. ఈ కమిటీ 19—10—1955వ తేదీని సమావేశమై తీర్మానించిన దాని కనుగుణంగా పొన్నాడ శ్రీరామచంద్రుడుగారు విశాఖజిల్లానుంచి ఆంధ్రదేశ మంతటా వినోబావెంట ఉన్నారు.

******************************************

# ధర్మ కార్యం

భూదాన యజ్ఞమొక ధర్మకార్యం, ధర్మకార్యంలో భాగస్థులు కాదలచినవారు చిత్తశుద్ధితో రావాలి. ఈ పనిలో ఏవిధమైన పార్టీ(పక్ష) విభేదానికీ తావులేదు. ఇది ఒక నిర్వికారకార్యం. ధర్మకార్యం నిర్వికారంగానే ఉండగల్గుతుంది. "సర్వేషా మవిరోధేన బ్రహ్మకర్మ సమారభే" అని శాస్త్రాలలో చెప్పబడింది. ధర్మకార్యం సర్వేషాం అవిరోధేన జరుగుతుంది. ధర్మకార్యానికెవరితోనూ విరోధముండదు ఆఁ. అధర్మంతో విరోధముంటుంది.

— వినోబా
28-5-1953

******************************************

# చంబల్ లోయ

చంబల్ నది మధ్యప్రదేశ్ నైరృతిభాగంలో కొండల్లో పుట్టి ఉత్తరానికి తర్వాత తూర్పుకి ప్రవహించి చివరికి యమున నలో కలుస్తుంది. చంబల్ ప్రాంతం మధ్యప్రదేశ్ కి చెందిన "భిండ్ మురైనా" జిల్లా; రాజస్థాన్ లో ధోల్ పుర్ జిల్లాలో కొంత భాగమూ, ఉత్తరప్రదేశ్ లో ఆగ్రా ఇటావా జిల్లాల కలయిక, అయిన ప్రదేశం. శతాబ్దాలుగా ఈ ప్రాంతం బందిపోటు దొంగల మెరుపుదాడులకు పుట్టిల్లు. యూనానీ సేనలతో పోరాడటానికి ఈయుద్ధకళలో శిక్షణపొందటానికి తన సేనని చంద్రగుప్త మౌర్యుడుకూడ ఇక్కడకు పంపాడట. మొగల్ చక్రవర్తి బాబర్ కూడ ఇక్కడ కఠినమైన ఆక్రమణలు నెదుర్కోవలసివచ్చింది. అక్బరుకూడ స్వయంగా ఆగ్రాను పరిసరాలలో జరిగే లూటీల నదుపులో పెట్టలేకపోయాడు. ఆంగ్లేయులు కూడ ఈ ఉపద్రవాల నణచటానికి ప్రయత్నించారు. కాని వారూ సఫలురు కాలేదు. 1857 నాటి తిరుగుబాటు రోజులలో వీరతాంత్యాతోపే ఈ అరణ్యాలనే ఆశ్రయించాడు. తన సమస్తసేనాసంచలనాలు కోలాహలాలు ఇక్కడనుంచే చేస్తూఉండేవాడు. స్వాతంత్ర్యం సిద్ధించాక కూడ మూడు, రాష్ట్ర కాంగ్రెసు ప్రభుత్వాలు ఈదొంగలకు వ్యతిరేకంగా ఒక సంయుక్తచర్య ప్రారంభించాయి. ఈ విషయంలో పోలీసులకు సాయపడటానికి సైన్యంకూడ పంపబడింది. కాని యీ సమ్మిశ్రిత ప్రయత్నాలకుకూడ సంతోష

జనకమైన పరిణామం కలగలేదు. ఈ విధంగా ఈ చంబల్ ప్రాంతంలో బందిపోటుల ఉపద్రవాలు ప్రజలకు ప్రభుత్వానికీ కూడ సమస్యగానే తరతరాలుగా ఉంటున్నాయి.

వినోబా కాశ్మీర్‌లో ఉండగా చంబల్ లోయకు చెందిన ప్రసిద్ధుడైన దొంగ మానసింహ పుత్రుడు తహసీల్‌దార్ సింహ్ వ్రాసిన ఉత్తరం అందింది. అతనికి ఉరిశిక్షపడింది. ఉరికంబం ఎక్కేముందు అతడు బాబాదర్శనం కోరుతున్నాడు. వినోబా మేజర్ జనరల్ యదునాథ్‌సింహ్‌ని తహసీల్దార్ సింహ్‌తో కలవమని అలహాబాదు సమీపంలో ఉన్న నైనీ సెంట్రల్ జైలుకి పంపారు. తర్వాత యదునాథ్‌సింహ్ చంబల్ ప్రాంతం కూడ వెళ్ళి అక్కడ మానసింహ-దళంలో ఉన్న ఇతరదొంగల్ని చాలమందిని కలిశారు. అక్కడనుంచి తిరిగివచ్చి ఆయన బాబాతో "కాశ్మీరునుంచి తిరిగి వెళ్ళేటప్పుడు తమరు చంబల్ లోయకు దయిచేస్తే కొందరు దొంగలు తమముందు ఆత్మార్పణం చేయగలరు (surrender)." అనే తన అభిప్రాయాన్ని చెప్పారు. అది విని వినోబా అహింసద్వారా దొంగలు సామాన్య జీవనంలోకి రావటాని కంగీకరిస్తారేమో ప్రయోగం చేసి చూద్దామనే ఆలోచనతో ఆప్రాంతానికి వెళ్ళటానికి ఒప్పుకొన్నారు. డా. ~~కైలాసనాథకట్జూ ఈపనికి ఆయన్ని~~ పట్టుదలతో ఆహ్వానించారు.

పంజాబ్ మీదుగా యమునదాటి ఉత్తరప్రదేశ్‌లో ప్రవేశించి మే ప్రారంభంలో ఆగ్రా చేరారు. దొంగల సమస్యతో సంబంధం ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్, రాజా

స్థాన్ రాష్ట్రాలకుంది. అందుకని కేంద్ర హోంమంత్రి గోవింద వల్లభపంత్ తన సహాచరుడు బి. ఎస్. దాతార్‌తో కలిసి వినోబాను కలవటానికి ఆగ్రా చేరుతున్నారు. ఉత్తరప్రదేశ్ ముఖ్యమంత్రి సంపూర్ణానంద్ కూడ వచ్చారు, అందరు కలిసి కార్యక్రమం రూపొందించాలని. ప్రజాళికాశాఖ తరఫున ఈ చర్చలో శ్రీమన్నారాయణజీ కూడ ఉన్నారు. వినోబా దొంగలకు తమ పూర్వపద్ధతిమాని ఆత్మార్పణం చేయండని శాంతిపూర్వకంగా తెలియజేద్దామనుకొంటున్నారు. ఈ ప్రయత్నంలో వినోబాకు పూర్తిసహాకార మందించాలని నిర్ణయం జరిగింది. మూడు రాష్ట్రాల పోలీసు అధికారులకు శాంతిభద్రతలు వ్యాపింపజేద్దామనే దృష్టితో ఈ సర్వోదయ ప్రక్రియలకు పూర్తిగా సహాయం చేయండని ఆదేశాలివ్వబడ్డాయి.

* 1960 మే 7 వ తేదీని తన ఈ శాంతికార్యక్రమం కోసం మేజర్ జనరల్ యదునాధ్‌సింహ్‌తో కలిసి వినోబా చంబల్ అడవులలో ప్రవేశించారు. ఇంతవఱకు చరిత్రలో ఎవరికీ సాధ్యపడని ఈపనికి వినోబా చేసే యీ ప్రయోగం ఫలిస్తుందా ? అని దేశమంతా జిజ్ఞాస, ఆశ, నిండినదృష్టితో చూడసాగింది.

---

*చంబల్ ఘాటీ ప్రవేశం — 12 మే 1960 అని 'మైత్రి'లో శ్రీ బాలవిజయ్ ఇచ్చిన వివరంలో ఉంది

పినహట్—భిండ్ (మధ్యప్రదేశ్)

---

'ధర్మక్షేత్రే భిండక్షేత్రే సమవేతాయయుత్సవః
పోలీసాః డాకవశ్చైవ కిమకుర్వత సంజయ ।'

ప్రార్థనసభ తర్వాత మొదటి ఉపన్యాసంలోనే వినోబా అన్నారు :— దొంగలైనరో కేవలం (ఒక) భగవంతుడే యెరుగును. కొందరు దొంగ అనే పేరుతో చెడ్డపేరు పొందారు కాని కేవలం వారుమాత్రమే దొంగలనటం సరికాదు. భగవంతుడిదృష్టిలో మరికొందరు ఈ చెడ్డపేరుపడ్డ దొంగలకంటె ఎక్కువ తప్పుచేసిన దోషులు కాగలరు. నేను దొంగల సమస్య పరిష్కరించటానికి వెడుతున్నానని కొందరాశపడుతున్నారు కాని అసలువిషయంవేరు. ఈసమస్యలు పరిష్కరించటానికి నేనవణ్ణి ? మంచివారిని సేవించటానికి ఊరూరా తిరిగే నేను (కేవలం) భగవంతునికొక అల్పసేవకుణ్ణిమాత్రమే." అని. మరో ప్రసంగంలో—"నేను మాత్రం బుద్ధ, క్రీస్తుల పాద చిహ్నాలలో నడవటానికి ప్రయత్నిస్తున్నాను. ఈనాడు ఎండి పోయిన కరుణ ప్రవాహం మళ్లీ ప్రవహింపసాగాలనేదే నాకోరిక."

కొద్దిరోజులకే ఈ శాంతియాత్రాఫలం ఎదురుపడింది. కత్తిరించిన చిన్నచిన్న మీసాల ఒక యువకుడు వచ్చాడు. అతడు బాబా ముందు తన ఆయుధాలుంచాడు. "బాబా! ఇప్పటివరకు నేను తప్పుడు దారిలో ఉన్నాను. ఇకముందు నేనే తప్పుచేయను." అన్నాడు. అతనిపేరు "రామఅవతార్ సింహ్." అతడు సాయంకాల ప్రార్థనలో కూర్చున్నాడు. వినోబా దళం (పరివారం)లో చేరిపోయాడు.

ఆసమయంలో ఈప్రాంతంలో దాదాపు 25000 పోలి సులు నియుక్తులై ఉన్నారు. వీరిలో కొందరైన పోలీసు

అధికారులతో బాబా అన్నారు :— "దొంగ దొంగగానే పుట్టడు. అతను శుష్కించటం లోభిత్వం, క్రూరత, హృదయ హీనత అనే వాటివంట. భూళియూత్రైలులో ఇటువంటి వందల మంది సోదరులతో కలిసే అవకాశం నాకు కలిగించె. వారిలో చాలమంది సౌమ్యులు, భక్తిభావం కలవారు, ధార్మికప్రవర్తన కలవారు నాకు కనిపించారు. మనం దొంగల్ని ప్రేమించి వారి యెడల దయాభావం చూపిస్తూ గ్రామాన్నొక కుటుంబంగా చేస్తే అన్ని సమస్యలు వాటంతట అవే పరిష్కారమవుతాయి. ఈ దొంగలు చాల తిన్నని నిర్భయులైన వీరులు. వారి కార్య మార్గం మారిస్తే వారు చాల సరళత్వంతో సాధుచరితులవ గలరు." అని. తర్వాత అన్నారు— "ఈ సమస్యలు పోలీసులు పరిష్కరించలేరు. ఇక్కడ పోలీసు పోగయితే దొంగలూ పోగవుతారు. దానికితోడు ఇక్కడ ద్వేషం, శత్రుత్వం తిరస్కారమూకూడ నెలకొనే ఉంటాయి. ఇదంతా వంశ పారంపర్యంగా సాగుతూనే ఉంటుంది."

కొన్నాళ్ల తర్వాత మధ్యప్రదేశ్ గవర్నరు హెచ్. వి. పాటస్కర్, ముఖ్యమంత్రి కట్జూ ఇందులో సహకరించటానికి వినోబాను కలిశారు. 2500 సం॥ క్రితం ఒక దొంగ బుద్ధుని యెదుట ఆత్మసమర్పణ చేసికొన్నాడని బాబా విన్నారు. అందువల్ల ఆయన ఈ చంబల్ లోయలో ప్రార్థనాపూర్వకమైన అంతఃకరణతో తనని తాను భగవంతుని చరణాలకు సమర్పించు కొని తిరుగుతున్నారు. హఠాత్తుగ ఒక అద్భుతమైన చమ త్కారం జరిగింది. అది చూచిన బాబా ఆశ్చర్యానికంతులేదు.

హర్షంతో ఆయన పులకాంకితులయ్యారు. చెడ్డపేరుతో ప్రసిద్ధు
డైన దొంగ "లచ్చి", (అతనినెత్తిన ఐదువేలరూపాయల
బహుమానంకూడ పట్టాడి ఉంది) ఆయనముందుకువచ్చి నుం
చుని అన్నాడు——"నేను బొంబాయిలో ఉన్నాను. అక్కడ
నేను పేపర్లలో చదివాను. తమరు చంబల్ ప్రాంతంలో
పర్యటిస్తూ "ఆత్మార్పణచేసి తమ తప్పుడు పనులకు పశ్చాత్తాప
పడు"మని దొంగలకు బోధిస్తున్నారని. నేను తమర్ని దర్శించి
ఈతప్పుడు (చెడ్డ) దారి విడిచిపెట్టాలని నాకు అంతరాత్మ
వినిపించింది. అందుచేత నన్నూ, నాపరివారాన్నీ తమచేతులలో
పెట్టుకొంటున్నాను. (తమకు అప్పగించుకొంటున్నాను.)

వినోబా దీనితో బాగా ప్రభావితులై — "ఈ వేళ నాకు
భగవత్సాక్షాత్కారమయిందనిపిస్తోంది. ఇదంతా ఆయన మాయ.
ఈ సోదరుడు బొంబాయి నుంచి ఆత్మసమర్పణ చేసుకోటానికి
వచ్చాడు. ఇతన్ని ఆ భగవంతుడే పంపాడు. మా కార్యకర్త
ఎవరూ ఇతని దగ్గరకు వెళ్ళలేదు. భగవంతుడితన్ని ప్రేరణ
చేశాడు. ఇతడు వచ్చాడు. రెండున్నర వేల సం॥ క్రితం ఇటు
వంటి సంఘటన ఒకటి జరిగింది. అప్పుడు అంగులిమాలుడనే
చోరుడు బుద్ధ భగవానుని స్పర్శవల్ల సాధువయ్యాడు. కలి
యుగంలో ఇలాంటివి జరగవంటారు. అందుచేత దీన్ని ఈశ్వర
చమత్కారమనాలి. యింకేమీ అనలేము."

మెల్లమెల్లగా ఈ శాంతి యాత్ర ఇంకా ప్రకాశించింది.
మే నెల 19వ తేదీని చంబల్‌లోయకు చెందిన పదకొండుగురు
దొంగల నాయకులు ప్రార్థన తర్వాత "లుక్కా" నాయ

కత్వంలో వచ్చి వినోబా చరణాలముందు తమ ఆయుధాలుం
చారు. "ఇప్పటి వరకు మేముచాల చెడ్డపనులు చేశాం.
అందుకు మాకు దుఃఖం కలుగుతోంది" అన్నారు. ప్రార్థన సభ
యావత్తూ ఆశ్చర్యంతో స్తంభించిపోయింది. చాలసార్లు సత్యం
కల్పనకంటె కూడ విచిత్రంగా ఉంటుంది. మేజర్ జనరల్
యదునాథ్‌సింహ్ విద్రోహులతో (బాబా వీళ్ళని విద్రోహులు
అంటారు.) "అందరు ఒక లైన్‌లో నిలబడండి. చూడాలనుకొనే
జనం చూస్తారు" అన్నారు. ఆ విధంగా వాళ్ళంతా నుంచు
న్నారు. చేతులు జోడించుకొని ఒక్కొక్కడే తన పేరు చెప్పాడు.
కొందరు పత్రికలవారు (వీరితో) కరచాలనంకూడ చేశారు.
తర్వాత బాబా ఎదుట సమర్పించిన ఆయుధాలు వగైరా ప్రోగు
చేసి పోలీసులు స్టేషనికి తీసుకువెళ్ళారు. అక్కడ తబిసీలుగా
అన్ని విషయాలూ నోట్ చేసుకొన్నారు.

మర్నాడు ఆత్మార్పణ చేసికొన్న దొంగలు కూడ
బాబాతోపాటు ముందు మకాముకు వెళ్ళారు. వీళ్ళని దగ్గరగా
వచ్చి చూడాలని పెద్దగుంపు ఏర్పడింది. తన ప్రవచనంలో
బాబా— "ఇక్కడ దొంగల సమస్య ఉందంటున్నారు. కాని
యీ సమస్యకు ముఖ్యకారణం పేదరికం, వ్యక్తిగత శత్రు
త్వం, పోలీసూను. ఈ సమస్యకు నాల్గవ కారణం పార్టీ రాజ
కీయం, ఎన్నికలు. ఈ కారణాల్ని కనక దూరంచేస్తే దొంగల
సమస్య దానంతట అదే పరిష్కారమయి పోతుంది" అన్నారు.
ప్రవచనం పూర్తయ్యాక మరో ముగ్గురు దొంగలు ముందుకు
వచ్చి ఆత్మార్పణ చేశారు. కొత్త జీవనం ప్రారంభిస్తామని
బాస చేశారు.

మే 22న జైలుకి వెళ్ళేముందు దొంగలు బాబా దగ్గఱ సెలవు తీసుకొన్నారు. వినోబా దళంలోని సోదరీమణులు వాళ్ళనుదుట తిలకంపెట్టి రాఖీ (రక్షా బంధనం) కట్టి ఉన్నత భావ ప్రపూర్ణ హృదయంతో వీడ్కోలు చెప్పారు. వారు తమకు సాష్టాంగ ప్రణామం చేసినప్పుడు బాబా ఆశీర్వదిస్తూ — “భగవంతునియందు భక్తి కలిగించుకోండి! హృదయంలో పవిత్ర భావాలేర్పరచుకొందుకు గాత!” అన్నారు. లుక్కా, అతని సహచరులు “తాము దేశమహానాయకుడైన పండిట్ నెహ్రూను కూడ ఏదో ఒక రోజున కలిసి ఆయనకి నమస్కరించాలని కోరుకొంటున్నామని తమ కోరిక వెల్లడించారు.

వినోబా మేజర్ జనరల్ యదునాథ్‌సింహ్‌తో వీరికోరిక నెహ్రూజీకి తెలియ జేయమని చెప్పారు. తర్వాత దొంగల్ని వ్యానులో ఎక్కించి “భిండ్” జిల్లా జైలుకి చేర్చారు.

మర్నాడు భావే జైలులోకి వెళ్ళారు. సాయం ప్రార్థన అక్కడే జరిగింది. 200 మంది ఖైదీలు హాజరయ్యారు. వారి నుద్దేశించి బాబా—“నేను వేలువేలు జైళ్ళలో అన్నిటిలోను కలిపి దాదాపు అయిదు సం॥ గడిపాను. నా ఖైదీ సోదరుల మధ్య నా గీతా ప్రవచనాలు జరిగేవి. జైల్లో మనకప్పజెప్పిన పనిని నేను నా హృదయ పూర్వకంగా (దానిమీద మనసుంచి) చేస్తూ ఉండేవాణ్ణి. ఎందుచేతనంటే పరిశ్రమ లేకండా లభించిన తిండి తినటం మంచిదికాదు. మనం సమాజానికి భారమై ఉండ

కూడదు. జైలును ఆశ్రమమనుకోవాలి. దాన్ని పరిశుభ్రంగా ఉంచుకోవాలి. సభ్యులు, ఆదరణీయులు అయిన వ్యక్తులతో సమానంగా ఉండాలి".

ప్రేమ కరుణల ద్వారా ఈ దొంగల హృదయాలు మార్చే ప్రయోగం చూచి పోలీసు అధికారులు కూడ బాగా ప్రభావితులయ్యారు. వారు కూడ వినోబాను మార్గదర్శనం చేయమని కోరారు. వినోబా ప్రారంభించిన సహకారానికి వారికి ధన్యవాదం చెప్పారు. "ఇక్కడ జరిగిన పనియొక్క శ్రేయస్సు (కీర్తి) ఏ ఒక్కరికీ చెందదు. పలుపులిది. నిజానికి సర్వశ్రేయము భగవంతుడికే. మనమందరమూ ఆయన చేతుల్లో ఉన్న ఉపకరణాలము మాత్రమే. దొంగలు ఏ షరతులు లేకుండ ఆత్మార్పణ చేసికోవటానికి (లొంగిపోవటానికి) తమ జీవితాలు మార్చుకోవటానికి స్వయంగానే నిర్ణయించారు. మంచి పనే జరిగింది. నేను వారితో "దేశపు న్యాయచట్టాన్ననుసరించి మీకు శిక్ష పడుతుం"దని స్పష్టంగా చెప్పాను. ఈ జన్మలో శిక్ష అనుభవించటానికిష్టపడకపోతే వచ్చే జన్మలో అనుభవించవలసి ఉంటుంది. "నేనింతమట్టుకు చెప్పాను". వారు కనక నా దగ్గరకు వచ్చి ఆత్మ సమర్పణచేస్తే వారిమీద అత్యాచారం జరగదు. వారిని బాధించరు" అని. వీరి దగ్గరకు ప్రేమ సందేశం తీసికొని వెళ్ళిన మిత్రులను ప్రశంసించాలి. పోలీసుల, ఇతర అధికారుల పనికూడ ప్రశంసనీయమే అయింది. పోలీసుల ఇతరాధికారుల ప్రవర్తన కూడ ఈ పనికనుకూలంగా ఉంటే ఈ సమస్య చాల తేలికగా పరిష్కారమవుతుంది". ఒకచోట పోలీ

సులను ఉద్దేశించి ప్రసంగిస్తూ— "పోలీసు జవానులు తమ కర్తవ్యాన్ని నిష్ఠతో పాలించాలి. తమ ప్రతి పనితోను సంయమం పాటించాలి. ఆహార విహారాల్లో పనిలో ప్రతిచోట సంయమ దృష్టి ఉండాలి. సోమరితనాన్ని దరిచేరనీయకూడదు. ప్రతివ్యక్తి ఆత్మ ఉత్తమంగా ఉంటుంది. అప్పుడప్పుడు దాని మీద తెరపడుతుంటుంది. కాని అది ఎప్పుడూ అణగిపోదు. తెర తొలగగానే అది ప్రకాశిస్తుంది. ఇది గమనించి ప్రతివ్యక్తితోను మీరు సానుభూతితో మెలగాలి.

మధ్యప్రదేశ్ ఇన్‌స్పెక్టర్ జనరల్ కె.ఎఫ్. రుస్తుంజీ ఒక ప్రకటనచేస్తూ దురదృష్టకరమైన వివాదం లేవదీశారు. దానిలో ఆయన "వినోబా యాత్ర పోలీసుల నైతిక బలానికి ఆఘాతం కలిగించింది. ఎందుకంటే దొంగలతో పోరాటానికి సిద్ధపడి నిలబడినవారి సాహసాన్ని నిష్ఠని ఆయన అవమానపరచారు" అన్నారు. ఆయనింకాను— "దొంగలతో సంభాషించేటప్పుడు వారి వ్యవహారాలు ప్రభుత్వం దయాదృష్టితో ఆలోచిస్తుందని వారికీ ఓదార్పు లభించింది". ఈ ప్రకటన విషయం బాబా దృష్టికి తెచ్చినప్పుడు బాబా— ప్రతి వ్యక్తి భగవంతుణ్ణి తనతన తెలివికి తగినట్టుగా చూడగలుగుతాడు. నా దగ్గర ఆత్మ సమర్పణం చేసిన దొంగలకి ఏదో విధమైన ఆశ్వాసన మివ్వబడిందనటం పొరపాటు. నా యాత్రలో అంతటా నేను "వారికి శిక్షవిధించటమా, విడిచిపెట్టటమా, అనేది ఆలోచించే పని న్యాయాలయాలది." అని బహిరంగంగా చెపుతూ వచ్చాను : అన్నారు. ఇటువంటి వ్యవహారాలతో మానవతా

దృష్టితో వ్యవహరించుట మనేమాటమీద వినోబా అన్నదేమి టంటే—"మృత్యుదండనను రద్దుచేసే అధికారం రాష్ట్రపతి కుంది. భారతరాజ్యాంగంలో దయకు కరుణకు గౌరవముందనే సంగతినిదే రుజువుపరుస్తోంది." అని.

తర్వాత ఒక బహిరంగ సభలో ప్రసంగిస్తూ — తమ యెడల కరుణా దృష్టి ఉంటుందని దొంగలకి (ధైర్యం) మాట లభించిందనీ అందుకే వాళ్ళు ఆత్మార్పణ చేశారనీ కొందరి కల్పన. మరికొందరు పోలీసుల చాకచక్యంవల్లనే దొంగల ధైర్యం సడలి పోయిందనీ అందువల్లనే గతిలేక వారు ఆయుధాలుదించేశారనీ భావిస్తున్నారు. అసలు సంగతేమిటంటే— మన మీ ప్రపంచంలో ఏ మంచి పనీ ముందుకు సాగటం చూడలేం. మనకితరులయెడ నమ్మకముంచటం ఇష్టముండదు. నేను మాత్రం ఈ ఆత్మార్పణ చేసికొన్నవాళ్ళ హృదయాలు నిజంగా మారాయని నమ్ముతున్నాను". ఆకాశవాణి నుంచి మాటలాడుతూ వినోబా—

"ఆధ్యాత్మిక ప్రపంచంలో అహింస ఒక సమర్థమైన శక్తి". మహాత్మాగాంధీ రాజకీయ క్షేత్రంలో దీన్ని ప్రయోగించారు. గత తొమ్మిది సంవత్సరాలలోను సామాజికార్థిక రంగాల్లో ఈ సిద్ధాంతాన్ని పరీక్షించే ప్రయత్నం జరిగింది. ఈసారి ఈ దొంగల క్షేత్రంలో ఈ అహింసాతత్త్వం యొక్క విలక్షణమైన అనుభవం నాకు కలిగింది. హృదయాలు కరిగి పోయాయి. వాతావరణమంతా భగవత్సాక్షాత్కారంతో నిండి పోయింది. చౌర్యాన్ని జీవిక (జీవన సాధనం)గా చేసుకొన్న

వారికి పశ్చాత్తాపం కలిగింది. భగవంతుడు వారి హృదయాల్లో
చమత్కారం చేశాడనిపిస్తోంది. నేను మాత్రం భగవంతుని చర
ణాల మీద నా కృతజ్ఞతను ప్రకటించ గలుగుతున్నాను.
ఆయన మీదే విశ్వాసముంచి, నేను, సత్య, ప్రేమ, కరుణా
మార్గంలో నడవటానికి నమ్రతా పూర్వకంగా ప్రయాస పడు
తున్నాను."

ఆత్మార్పణ చేస్తున్న (లొంగిపోతున్న) దొంగల్ని
జైలుకు పంపటం కొందరు సర్వోదయ కార్యకర్తలకు బాగా
లేదు (నచ్చలేదు) వారికి తెలియజేస్తూ వినోబా అన్నారు —
లొంగిపోయిన దొంగల్ని నేను జైలుకి పంపానని ఇది మంచి
పని కాదని ఎవరో అంటున్నారు. నేను స్పష్టంగా చెప్పదలచు
కొన్నదేమిటంటే— ఇంతకంటె చేయగలిగిందేమీ లేదు" అని.
నేను చట్టానికి విరుద్ధంగా ఏమీ చెయ్యదలచుకోను. చట్టానికి
స్పష్టంగానే కొన్ని హద్దులున్నాయి. లొంగిన దొంగలకు
సాధ్యమైనంత వరకు న్యాయం జరిగేటట్టు నేను ప్రయత్ని
స్తాను. ఇంత మాత్రం చేయగలను. వారికి చట్టపరమైన సలహా
లభించాలి. సంభవమైతే వారి కుటుంబం మంచి జీవనం గడప
గలగాలి. ఈ ఏర్పాటు జరగాలి. లొంగిన దొంగలు క్షమాభిక్ష
కోరుకోకూడదు. ఎందుచేతనంటే— కర్మ యొక్క న్యాయం
అచంచలమైనది. దానినుంచి మానవుడు తప్పించుకోలేడు.
ఇంత వరకు లొంగని వాళ్ళకు కూడ నేనిదే చెప్తాను. నిజ
మైన పశ్చాత్తాపంతోపాటు పాతదారి విడిచి పెట్టటమే వారికి
హితమని.

తర్వాత లొంగిపోయిన దొంగల మీద ఆయుధచట్టాన్ని ఉల్లంఘించిన నేరం ఆరోపించబడింది. భిండ్ జిల్లా మేజిస్ట్రేట్ ముందు అందరూ ఈ అపరాధాన్ని అంగీకరించారు. వాళ్ళు ఎల్లప్పుడూ నిజం చెపుతామని బాబాజీకి మాట ఇచ్చారు. ఈ విధంగా నిమిషాల్లో వ్యవహారం సెటిలయింది. ఈ విషయం విని వినోబా చరిత్రలో ఇది ఒక క్రొత్త విషయమన్నారు. "నేనీ సోదరసోదరులతో చెప్పాను– చెడ్డపని చేసినవాళ్ళు ఒప్పుకోవాలి ఆరోపణ అబద్ధమైతే తిరస్కరించాలి. ఉరి శిక్ష పడినా సంతోషంగా అనుభవించాలి" అని.

వినోబా ఈ తన శాంతియాత్ర గ్వాలియర్‌లో జూన్ 7వ తేదీని సమాప్తిచేశారు. ఈ విధంగా ఒక నెల, రోజుకు పదు నుంచి పది మైళ్ళు నడిచారు. దుష్కీర్తి పొందిన దొంగలకు చెందిన 28 గ్రామాల్లో పర్యటించారు. మానసింహ్–రూపా–దళానికి చెందిన 20 మంది దొంగలు ఆయన ముందు లొంగిపోయారు. వారి మీద 20,000 రూపాయల బహుమతులు తగిలాయి. ఈ విషయానికి చెందిన లిఖిత ప్రమాణాలు– పోలీసు లెంతమందినీ ప్రాణాలతో పట్టుకొన్నారో– చంపారో– వారిలో ఒకొక్కరి మీద ప్రభుత్వపు మొత్తం ఖర్చు పది లక్షల రూపాయలయింది.

ఇలాకాలో మారిన వాతావరణాన్నుపయోగించుకొని ప్రజలకు నిర్మాణాత్మక కార్యక్రమం యొక్క ప్రయోజనం అందించటానికి సర్వ సేవా సంఘం వినోబా మార్గదర్శకత్వంలో ఒక "చంబల్–ఘాటీ–శాంతి సమితి"ని స్థాపించింది.

మధ్యప్రదేశ్, రాజస్థాన్, ఉత్తరప్రదేశ్ ల భిన్న భిన్న న్యాయ స్థానాలలో దొంగల మీద కేసులు నడుస్తున్నాయి. వాటిని తొందరగా తెమల్చటంలో ఈ సమితి దొంగలకి సహాయం కూడ చేస్తోంది. లొంగిపోయిన దొంగల కుటుంబాల సహాయానికి గాను అడవుల్లోని కొంత బంజరు భూమి కొనటానికీ, వారికి కుటీర పరిశ్రమలూ, గ్రామ పరిశ్రమలూ నెలకొల్పటానికి ఈ సమితి కొంత చందా కూడ ప్రోగుచేసింది. ఇక్కడ అంబరు చరఖా కేంద్రాలు తెరిచారు. దీనివల్ల వారికి చిన్న చిన్న కసుతాలవల్ల వచ్చే పరిమితమైన ఆదాయానికి కొంత తోడు) సాయం లభించింది. అప్పటి నుంచీ వినోబా చంబల్–ఘాటీ–శాంతి సమితికి మార్గదర్శకత్వం వహిస్తూనే ఉన్నారు. రాష్ట్ర ప్రభుత్వాలు ఈ విద్రోహులన్ని అకారణంగా బాధించరాదనీ, రాష్ట్రంలో వారి వ్యవహారాలు నిర్ణయించాలనీ ఆ తర్వాత మరో రాష్ట్రంలో వారికి విరుదంగా అదే విధంగా వ్యవహారాలు నడపరాదనీ వారు కాంక్షించారు. తదనుసారంగా శ్రీమన్నారాయణ్ జీ కూడ వాటితో సంబంధమున్న రాష్ట్రాల ముఖ్య మంత్రులకు వ్రాస్తూ వచ్చారు. తనకు తెలిసినంత వరకు బావేజీ ముందు ఆత్మార్పణ చేసికొన్న దొంగలు శిక్ష అనుభవించి విడుదల పొందారని శ్రీమన్నారాయణ్ జీ అన్నారు. ఎవరికీ ఉరిశిక్ష పడలేదు. ఇప్పుడు వాళ్ళంతా తమ పిల్లలతో బాటుగా ఉంటున్నారు. మామూలుగా స్వాభిమాన పూర్వక జీవనం గడుపుతున్నారు. పిల్లల్లో ఒకడు తన గ్రామ పంచాయితీకి సర్పంచిగా కూడ ఎన్నుకోబడ్డాడు. వినోబా కోరికను మన్నించి రాష్ట్రపతి డా॥ రాజేంద్రప్రసాద్, తహసీల్దార్

సింహ్ యొక్క ఉరిశిక్షను అజన్మ కారాగార వాసంగా మార్చారు. పైగా మంచి ప్రవర్తన కారణంగా అతడు త్వరలో శీఘ్రంగానే విడుదల పొందగలడని శ్రీమన్నారాయణ్ జీ ఆశించారు.

1960 ఆగస్టు ప్రారంభంలో మేజర్ జనరల్ యదునాథ్ సింహ్ మరణించటంవల్ల దొంగల పునరావాసం, విశ్రాంతి కార్యక్రమాలకు పెద్ద ఆటంకం వచ్చిపడింది. వారికి హృదయ వ్యాకులత కలిగింది. వినోబాకు శోకం కలిగింది. "సాధారణంగా నేనిటువంటివార్త(ల)వల్ల చలించను. కాని యదునాథ్ సింహ్ మృత్యువువల్ల నాకు నిజంగా ఆఘాతం తగిలింది. చంబల్ ఘాటీ పని అంతా ఆయన చేశారు. ఆయన చాల ధైర్యసాహసాలతో ఈపని సఫలం చేయటానికి చాలకృషిచేశారు. దేహం ఉండగా ఆయనెంతపనిచేశారో అంతకంటె ఎక్కువగా ఆయన ఆత్మ చేస్తుందని నాకు విశ్వాసముంది" అన్నారు.

ఈవిషయంలో శ్రీమన్నారాయణ్ జీ ఇల్లా అన్నారు— "చంబల్ ఘాటీలో వినోబాజీ శాంతియాత్రవల్ల కలిగిన లాభం నిలబెట్టటానికీ ఇంకా పటిష్ఠం చేయటానికీ రాష్ట్రప్రభుత్వాలు, భారత ప్రభుత్వమూ, తగిన స్టెప్ తీసుకున్నారో లేదో సరిగా తెలియదు. బాబా చేసినపనంతా వ్యర్థమయితేమాత్రం అది చాల శోచనీయమవుతుంది. కనీసం అధికారులు, అనధికార కార్యకర్తలు ఒక గోష్ఠి జరపాలి. అందులో వినోబా— కార్య క్రమం ఏవిధంగా ముందుకు నడపాలో దొంగల సమస్య పరిష్కరించటానికి ఏదైనా క్రొత్త అధిక కార్యక్రమం మాన

వత్తా దృష్టితో వెదకాలి. ప్రపంచబ్యాంకు చంబల్ అడవుల్ని 'అధిక' సారవంతంచేసే ప్రణాళికకు ఆర్థికసహాయం చేయటాని కంగీకరించింది. దీనివల్ల అక్కడి ప్రజలకు భూదానంచేసి దానికి సాయపడవచ్చు. ఈప్రణాళికవల్ల దొంగలసమస్యకు శాశ్వత పరిష్కారంచేయటానికి తగినంత సహాయం లభిస్తుంది.

సారాంశమేమిటంటే దొంగలసమస్య పోలీసుపద్ధతి కంటె నిర్మాణాత్మకపద్ధతితోనే శాశ్వత పరిష్కారం పొందుతుంది. ఇది అవసరం. ఈదృష్టితో వినోబా శాంతియాత్ర అధికారుల కెక్కువ మార్గదర్శకం కాగలుగుతుంది.”

ఇంతచేసినతర్వాతకూడ ఈసమస్య పరిష్కారమైందని నిశ్చయించలేమనటానికి మరోమారు చరిత్ర సాక్ష్యమిచ్చింది. ఒక్కొక్కజాతిలో పాతుకొనిపోయిఉన్నకుసంస్కారం, కుసంప్రదాయం అనేవి తమ సహజత్వానికి సమకాలీన సమాజపరిస్థితుల్ని తోడుచేసుకొని కురుపును అణచివేస్తే వేలవేసినట్లు మళ్లీపొడచూపుతూఉంటాయి. ఈవిషయాన్ని రుజువుపరచేసంఘటనలు పరిశీలించి మొత్తంమీద భావేజీ చూపించినదే పరిష్కారమార్గమన్నది మళ్లీ ధ్రువపడినట్లు గమనిస్తాం.

**బందిపోటు రాణి పూలన్‌దేవి :-**

12-2-83 నాడు బింద్‌లో మధ్యప్రదేశ్ ముఖ్యమంత్రి ముందు ప్రభుత్వానికి లొంగిపోయిన పూలన్‌దేవి దేశంలో

చాల అలజడి కలిగించింది. ఘన్‌శ్యామ్ అనే దొంగల నాయకుడు 24 మంది అనుచరులతో ఆయుధాలతోసహా ఆరోజునే ప్రభుత్వానికి లొంగిపోయినవార్తకూడ దేశమంతటా ప్రముఖంగా వినిపించింది.

ఇంతకీ ఎంతో భయోత్పాతం కలిగించి నిర్భయంగా యథేచ్ఛగా హత్యలు దోపిడీలు కొనసాగించి తిరుగులేని దురాగతంతో వీరవిహారంచేసిన వాళ్లుకూడ స్వయంగా వచ్చి లొంగిపోయేపరిస్థితి వచ్చిందంటే ఇంతకంటె మంచిమార్గం లేదనీ తప్పించుకు తిరగలేమనీకూడ వాళ్లు గ్రహించి ఉంటారనటంలో తప్పులేదు. అదే వినోబా చూపించిన శాశ్వత పరిష్కారమార్గం—సత్యాహింసల సాధుమార్గం. కాని ఈ బందిపోటులు తమ జీవితాన్ని మొదట ఈమార్గంలోకి మళ్లించుకోవటానికి హేతువులేమయి యుంటాయనేది గమనించటం కూడ అప్రస్తుతంకాదు. ఎందుచేతనంటే ఈవృత్తి ఏవిధంగా చూచినా వాంఛనీయంకాదు. పైగా ఎప్పటికప్పుడు ప్రమాద పరిస్థితిలో ప్రాణాపాయాన్ని తొలగించుకొంటూ ప్రాణాలు తీసే వృత్తికదా! ప్రభుత్వానికి ప్రజలకు తెలియకుండా క్రూరకృత్యాలతో అజ్ఞాతంగా జీవనం నరకప్రాయంగా గడపవలసిన వృత్తి. కాబట్టి కావాలని ఎవరూ దీనిని కోరుకొని స్వీకరించరు, పరిస్థితులీ వృత్తిలోకి త్రోసి మానవుల్ని పతితుల్ని చేస్తాయి. తరువాత కామక్రోధాదులు రాజ్యంచేస్తాయి. ఇంక ఇందులోంచి విముక్తిపొందటమనేది చాలకష్టం - ఈసత్యాన్నే వీరందరి కథలు మనకి వెల్లడిచేస్తున్నాయి.

1 ఉత్తరప్రదేశ్ లోని "గోర్హాపుర్వా" అనే గ్రామంలో ఫూలన్ దేవి 1956లో జన్మించింది. తాళ్లు పేనుకొని జీవనోపాధి కోసం శ్రమించే ఆమె తండ్రికి ఆరుగురాడపిల్లలు. 2 వారిలో రెండవదైన ఫూలన్ దేవి చిన్నప్పటినుంచి ఆకతాయితనంగా అల్లరిపిల్లలతో కలిసితిరిగేది. తండ్రికి సాయపడకపోగా చెప్పిన మాట వినకుండా, ఊరివెంట తిరగటం మానేదికాదు. పెళ్లిచేస్తే కుదుటపడుతుందనుకొని వయస్సులో ఆమెకంటె బాగా పెద్దవాడైన వరుడికిచ్చి పెళ్లిచేశాడు తండ్రి. కాని అత్తవారి ఊళ్లో కూడ తనకు సమవయస్కులైన వారిని పోగుచేసి వారితో కలిసి తిరుగుతూ ఉండేది. ఈతిరుగుబోతుతనం భర్తకు నచ్చకపోవటంతోపాటు ఆయన మంచివాడుకాడనీ ఆమెను కష్టపెడుతున్నాడనీ చెప్పుకొనేవారు.

కొద్దిరోజులకే కాపరంమాని పుట్టింటికి చేరింది ఫూలన్ దేవి. పుట్టింటివారి మాట వినలేదు. భర్త దగ్గరకు వెళ్ళలేదు. విధిలేక ఊరుకొన్న తల్లిదండ్రులు ఆమెను మేనమామ అయిన "గురుదయాళ్" ఇంటికి పంపారు. అక్కడేమన్నా బాగుపడుతుందేమో అన్న ఆశతో. అక్కడ పనిపిల్లని చూచినట్టు చూడటమే కాక ఆమె బావ "మయాదిన్" ఒక రోజున ఆమెను బలవంతం చెయ్యబోతే ఆమె తిరస్కరించింది. ఏదో వంకపెట్టి

---

1. 3-4-83 ఈనాడు దినపత్రిక

2 ఆంధ్రపత్రిక వివరం ప్రకారం ఆమెకు ఒక సోదరుడు [illegible] సోదరీమణులు ఉన్నారు.

వాళ్ళు ఆమెను వెళ్ళగొట్టారు. భర్త దగ్గరకు వెళ్ళినా బాధలే కదా అనుకొని ఆమె పుట్టింటికే చేరింది. ఊళ్ళోవాళ్ళు ఆమెను హీనంగా చూడటం మొదలుపెట్టారు. ఇటువంటి పరిస్థితులలో అది అసహజమేం కాదుగదా! అల్లరి కుర్రాళ్ళు ఆమెశీలం నాశనం చెయ్యాలని ప్రయత్నించారు. ఆ ఊరి సర్పంచ్ కొడుకు ఆమెను వశపరచుకోవాలని విఫలప్రయత్నం చేశాడు. అప్పుడే ఆ ఊరి పెద్దరైతు కూతురు ఫూలన్‌ను అసభ్యంగా అవమానించింది. ఫూలన్ ఆమె మీద చేయిచేసుకొంది. ఊరి పెద్దలకు కూడ (మేనమామతోబాటు) ఫూలన్ మీద క్రోధం పెరిగింది. ఆమె మీద వారంతా కత్తి కట్టారు. అప్పటికే జరిగిన ఒక బందిపోటు దొంగతనంలో ఫూలన్‌కు సంబంధం ఉందని ఆరోపించి పోలీసు రిపోర్టిచ్చారు. ఫలితంగా 1979 జనవరి 6వ తేదీన ఆమెను పోలీసులు అరెస్టు చేశారు. తానారోజున ఊరిలో నేలేనని ఆమె వాదించినా ఊరి పెద్దలు మేనమామ కలిసి అందుకు వ్యతిరేకంగా సాక్ష్యమివ్వటంతో ఆమెకు మూడువారాల జైలుశిక్ష పడింది. జైలులో ఉన్నప్పుడు పోలీసులు తనని నిర్దాక్షిణ్యంగా అనుభవించారనీ ఆ మూడువారాలే తన జీవితం పతనమవటానికి కారణమనీ తన మొరాలకించిన వాడులేడనీ ఆమె ఇప్పటికి చెపుతూ ఉంటుంది. కాన్పూరుకు చెందిన కైలాస్ అనే వ్యక్తితో రెండవపెళ్ళి జరిగిందని కూడ ఆమె వెల్లడించింది.

జైలు నుంచి విడుదలయినప్పటికీ బందిపోటు దొంగ అనే పేరు స్థిరపడింది. ఇది తెలుసుకొన్న "విక్రమ్‌మల్లాహ" బాబుగుజార్ అనే ఇద్దరు బందిపోటు దొంగలు ఆమెనొకరోజు

బలవంతంగా ఎత్తుకొనిపోయి తమ ముఠాలో చేరమని బలవంతం చేశారు. ఆస్థావరంలో చేరాక వారికి ఎదురుచెప్పలేకపోయింది. బాబుగుజార్ కు శ్రీమతి అవటం—ఫూలన్—ఫూలన్ దేవిగా తన పేరు మార్చుకోవటం జరిగిపోయాయి. బాబుగుజార్ ఆమెపట్ల క్రూరంగా ప్రవర్తించటమేకాక మిగిలిన బందిపోట్లముందు నగ్నంగా నిలబడమనే వాడట. ఇది సహించలేక ఆమె విక్రమ్ సహాయాన్ని కోరింది. విక్రమ్ బాబుగుజార్ ను అతని అనుచరుల్ని కుట్రపన్ని చంపాడు. ఫూలన్ కు అభిమాన పాత్రుడయ్యాడు. మనఃస్ఫూర్తిగా ఫూలన్ విక్రమ్ భార్యగా మారింది. ఆమెనెంతో ఆదరించి బందిపోటు దొంగతనాలు చేయటంలో మెళుకువలు కూడ ఆమెకు నేర్పాడు విక్రమ్. కొద్ది కాలానికే ఆ ముఠాలో విక్రమ్ తర్వాత (రెండవ) స్థానం ఆమె పొందగలిగింది. కొందరీవిషయం సహించలేక పోయారు. ఆ ముఠాలోవాడే శ్రీరామ్‌సింగ్ అనే అతడు పోలీసులతో ఒప్పందం కుదుర్చుకొని విక్రమ్‌ను చంపేశాడు. అంతటితో విక్రమ్ ముఠా చెల్లాచెదరైంది. కొన్నాళ్ళకి ఫూలన్ దేవి విక్రమ్ గ్రూపులోవాడే అయిన మానసింగ్ యాదవ్ తో కలిసిపోయి ఒక ముఠా తయారుచేసి దానికి నాయకురాలై బందిపోటు రాణిగా తన జీవయాత్రలో జైత్రయాత్ర కుపక్రమించింది.

* తన ప్రియుడైన విక్రమ్‌ను చంపిన శ్రీరామ్‌సింగ్ ను చంపాలన్నది ఆమె మొదటి కోరిక. అతడు బెహ్మాయి అనే

---

* ఆంధ్రపత్రిక. 13—2—83

గ్రామంలో ఉన్నాడని తెలుసుకొంది. లాల్ రామ్‌సింగ్, శ్రీరామ్‌సింగ్ అనే కవలలు ఠాకూరు కులానికి చెందినవారని ఆమె అనుమానం. వారు అగ్రకులంవారు. అగ్రవర్ణాలంటే ద్వేషం ఉన్న ముస్తాకీం నాయకత్వంలోని బందిపోటు ముఠా సహాయం కోరింది. 1981 ఫిబ్రవరి 14వ తేదీని బెహ్మాయీ గ్రామాన్ని ముట్టడించి ఆ గ్రామస్థులు ఆ కవల సోదరుల ఆచోకీ తెలియదన్నందుకు శ్రీరామ్‌సింగ్ తాలూకు ఠాకూర్ కులానికి చెందిన ఇరవై మూడ్గర్ని కాల్చి చంపివేసింది. ఈ కాల్పులకు కొందరు చిన్నపిల్లలు కూడ గురిఅయ్యారు. ఈ దారుణ మారణకాండతో ఫూలన్ దేవి జాతీయ స్థాయిలో ప్రముఖురాలై బందిపోటురాణి అని పేరుపొందింది.

ఈ సంఘటనలో ఫూలన్ దేవికి సహకరించిన ముస్తాకీం, బల్వాన్ గడరియా, రామ్‌అవ్తార్ అనేవారు పోలీసు సంఘర్షణల్లో మరణించారు. ఈ వృత్తాంతం తర్వాత రెండు నెలలకు ఫూలన్ దేవి పోలీసు వలలో దాదాపు పడిపోయింది. కాని ఎలాగో తప్పించుకొంది. ఆమె ఎట్టావాలో ఉన్నట్లు వార్తలు వచ్చాయి. పోలీసులు ఆమెను పట్టుకొనేందుకు విఫలప్రయత్నం చేశారు.

బెల్ బాటం ప్యాంటు ధరించి తిరిగే ఫూలన్ దేవి అంటే యు.పి., యం.పి., బీహార్ రాష్ట్ర ప్రదేశాల్లో హడల్. ఆమె ఎక్కువగా ఎటావా, కాన్పూరు, జలౌన్ జిల్లాల నుండి తన కార్యకలాపాలు నడిపేదట.

ఆమెను పట్టుకొనే లోపున ఆమె ముఠాను అంతమొందించటానికి పోలీసులు వ్యూహం పన్నారు. అప్పటికామె పరోక్ష పెద్దముఠాతో చేతులు కలిపింది. పోలీసుల వత్తిడి పెరిగింది. ఈ స్థితిగతుల మధ్య ఆమెకు తన వారివద్ద కూడ పమాత్రం ఆశ్రయం లభించలేదు. మైర్‌లెస్ దళాలు సెర్చ్‌లైట్ నావలు-రాత్రింబవళ్ళు యమునానదిలోను, చంబల్, జిలీ నదులతోను పోలీసులు విస్తరించారు. ఈ సమయంలో ఫూలన్‌దేవి చిల్లర మల్లర నేరాలు చేసింది. మాన్‌సింగ్‌కు భార్యవలె ఉంది. ఫూలన్‌దేవి ముఠా నిర్మూలనకు పోలీసు వ్యూహం తీవ్రతరమైంది. ఆమెను పట్టియిస్తే రు. 10వేలు బహుమానం ఇస్తామని ఉత్తరప్రదేశ్ ప్రభుత్వం ప్రకటించింది. ఫూలన్‌దేవి మాత్రమే కాక మరికొందరు యువతులు కూడ బందిపోటులుగా మారి వారి జీవితాలు భ్రష్టం చేసికొన్న వారున్నారు. ఈ యుగపు తొలి బందిపోటు యువతిగా పుత్లీబాయిని చెప్తారు. ఆమెతోనే బందిపోట్ల ముఠాల్లో స్త్రీలు చేరటం ప్రారంభమైందట. ఆమె తర్వాత హసీనా. వీరిద్దరు పోలీసు కాల్పుల్లోనే మరణించారు. ఆ తరువాత ప్రముఖస్థానం వహించింది ఫూలన్‌దేవి. ఫూలన్‌దేవికి శత్రువైన ఠాకూర్ కులానికి చెందిన స్త్రీ కుసుమ్‌నైన్, ఫూలన్‌దేవికంటె చిన్నది. ఆమె లాల్‌రామ్, శ్రీరామ్‌లతో ఉంటూ విక్రమ్‌ను చంపటంతోను ఫూలన్‌ను మానభంగం చెయ్యటంతోను వాళ్ళకి బాగా తోడ్పడిందంటారు.

19 ఏళ్ళ పంజాబీ యువతి రోజి 22 ఏళ్ళ గీతాఠాకూర్ మొదలైన యువతులా ప్రాంతాల్లో బందిపోటులతో చేరి

సాహసకృత్యాలుచేసి చెడిపోయినవారున్నారు. ఇటువంటివాళ్ళు పోలీసులకు పట్టుబడి జైళ్లలో ఉన్నవారు కొందరైతే పోలీసుల కాల్పుల్లో మరణించినవారు కొందరు. మర్యాదస్థుల కుటుంబాలకు చెందినవాళ్లూ ఉన్నారు. వివాహితలూ అవివాహితలు విద్యావతులూ విద్యావిహీనలూకూడ ఉన్నారు. అందం, అమాయకత్వం, భర్తలు అత్తమామలుపెట్టే బాధలు కారణంగా కొందరు, మరికొందరు సమాజం చేసిన మోసాలకు గురైయె కసితీర్చుకొందామనీ బందిపోటులలో చేరినట్లుగా తేలుతోంది. కొందరు ఈఊబిలోనుంచి బైటపడి ప్రశాంతంగా జీవనం గడపటమూ కనిపిస్తోంది_ ఆవిధంగా బయటపడి మర్యాదగా బతుకుతున్నవాళ్లు_ వీనోబాకు లొంగిపోయి శిక్ష అనుభవించి బయటకు వచ్చినవాళ్లలో ఉన్నట్లు మనం గమనించాం.

* మధ్యభారతంలో పరమదారుణమైన నేరాలతో నిండిన అధ్యాయానికి ముగింపు ఘట్టమైన ఫూలన్ దేవి_ఘనశ్యామ్ (24 మందితోసహా) లొంగుబాటును (బింద్) చంబల్ లోయ ప్రాంతానికి చెందిన అనేకమంది ప్రజలు వందలాదిమంది పత్రికా ప్రతినిధులు తిలకించారు. ఐ. పి. ఎస్. అధికారిమాదిరిగా ఖాకీయూనిఫారం ధరించి తలచుట్టూ ఎఱ్ఱని రిబ్బన్ కట్టుకొన్న బందిపోటు రాణిఫూలన్ దేవిస్థానిక శివాజీరావు సింధియా కళాశాల మైదానంలో ఇందుకోసం ప్రత్యేకంగా నిర్మించిన వేదికపైకిఎక్కి తనవద్దఉన్న రైఫిల్ క్రింద ఉంచి

---

* 13_2_83 ఆంధ్రజ్యోతి దినపత్రిక

మధ్యప్రదేశ్ ముఖ్యమంత్రి అర్జునసింగ్‌కు పాదాభివందనం చేసిన వెంటనే ఆదృశ్యాన్ని తిలకించిన వందలాదిమంది చేసిన హర్షధ్వానాలతో ఆ ప్రాంతమంతా మారుమ్రోగిపోయింది.

ఆతరువాత ఆమెకు ప్రియతముడైన మానసింగ్‌తో సహా ఆమెముఠాలోని ఏడుగురు ఆయుధాలను విసర్జించి లొంగిపోయారు. గత కొద్దిఏళ్లుగా తన హింసాకాండ దోపిడీలతో ఉత్తరప్రదేశ్‌లో భయోత్పాతం సృష్టించిన పూలన్‌దేవి చట్టానికి లొంగిపోయి తన జీవితంలో నూతనాధ్యాయం ప్రారంభించింది.

ఆధునికంగా ప్రవర్తిల్లిన ఈ చరిత్ర పరిశీలించటంవల్ల కూడ మనకు ఎటువంటి పరిస్థితులలో ఎటువంటి పరిణామాలు పొంది కష్టనష్టా లనుభవించి చివరికి శాశ్వతమైన వినోబా చూపించిన మార్గాన్నే ఈ చోర సోదర సోదరీమణులు అనుసరించారో అర్థమవుతోంది.

మెహార్‌సింగు, మధోసింగులతోపాటు నాథూసింగ్ అనే ఇంకో బందిపోటు దొంగకూడ కలిసి 1972లో జయప్రకాశ్ నారాయణ సమక్షంలో లొంగిపోయి ప్రశాంత జీవితం గడుపుతున్నారు.

చట్టానికి లొంగిపోయిన మొదటి బందిపోటు రాణి ఫూలన్ దేవియే అవటంవల్ల ఆమె వృత్తాన్తం ప్రధానంగా ప్రస్తావించటం జరిగింది.

*నమ్మకాలు :—బందిపోటులకు కొన్ని మూఢ విశ్వాసాలుండటం గమనింపబడింది. దేవుడంటే భయం. 1950–60 సంవత్సరాలమధ్య ప్రజల్ని హడలెత్తించిన లఖన్‌సింగ్ దేవుడి పేరు చెపితే హడలిపోయేవాడట. వీలయినప్పుడు తన గ్రామానికి వచ్చి రహస్యంగా అక్కడి గుడిలో పూజలుచేస్తూ ఉండేవాడు. పుత్లీబాయి తన సంచిలో ఎప్పుడూ ఖురాన్ గ్రంథాన్ని ఉంచుకొనేదట. బందిపోటు దొంగలకు దుర్గ, బజరంగీ ఇష్ట దేవతలు. దారి దోపిడిలుచేసేవారు మాత్రం కాళీమాతను ఎక్కువగా పూజిస్తారు. కాళీమాత మారణకాండకు దేవత అని వారి ఉద్దేశం. మానసింగ్ నిరంతరం దేవాలయాల అభివృద్ధికి విరాళాలిస్తూ ఉండేవాడు. మల్కాన్‌సింగ్ బందిపోటులుండే జిల్లాలలో పదిదేవాలయాల నిర్మాణాలకు తోడ్పడ్డాడు.

ఈ విధంగా వీరిలో ఆస్తిక భావం ఉండటం అది మూఢమైన నమ్మకం రూపంలో నైనాగాని గమనార్హం. రావణాది రాక్షసులుకూడ భక్తులే తపశ్శాలురే అని మనకు పురాణాలు తెలియజేస్తున్నాయికదా ? ఇంతకీ ఇటువంటి వ్యక్తుల

* ఈనాడు — 3–4–83

మన స్తత్వాలలో ఒకవిధమైన మొండితనం, పట్టుదల, కసితీర్చు
కొనే లక్షణం, పగబూనటం అనే దుర్లక్షణాలు విశేషంగా
ఉన్నాయి. వాటిని మళ్లించి శాంతి, సహనం, ఆలోచన (బహు
విధాల) సత్యం, అహింస, మానవత్వం అనే విషయాలు వాళ్ల
హృదయాల్లో చోటుచేసుకొనేలాగచేస్తే సంపూర్ణ మానవత్వం
వాళ్లలో వికసిస్తుందనటం నిర్వివాదమే. పరిస్థితులావిధంగా
కల్పించటంవల్లనే ఈపరిణామం సాధించవచ్చుననటానికి చంబల్
చరిత్ర నిదర్శనం.

## ఇంక దారికి రండి

మానవుడు తననుతాను మరచి పోయినప్పుడు జంతువు కంటె
కూడ అధోగతికిపోయి చెడ్డపనులు చేయగలుగుతాడు. పైకి ఎక్కా
డంటే దేవత కూడ ఎక్కలేనంత ఉన్నత స్థితికి ఎక్కగలడు.

దేహంతో మనుష్యుడు పరమేశ్వరుణ్ణి పొందగలడు. ఐనప్పుడీ
మన విద్రోహులు సాధువులెందుకు కారు?

పొరపడిన సోదరులారా! మురికిగా ఉన్నారు. స్నానం
చెయ్యండి. ఇంక మంచిదారికి రండి.

— వినోబా

# ఆలయాలు - అనుభవాలు

"మీరు హిందువులు కాగోరుతున్నట్లయితే, మీకు భగవంతుని పూజ ఇష్టమయితే మీరు దేవాలయ ద్వారాల్ని అంటరానివారినిమిత్తం తెరచివేయండి. దేవునిదర్బారులో అతనిభక్తుల మధ్య ఏవిధమైన భేదమూ పాటింపబడదు. అతడు ఈ అంటరానివాళ్ళ, (నామమాత్రపు అస్పృశ్యుల) పూజల్ని తదితరుల పూజల్ని అన్నింటినీ ఒకేవిధంగా స్వీకరిస్తాడు. అయితే అతనివద్ద ఒకే షరతు ఉంది అదేమిటంటే నిజమైన హృదయంతో ప్రార్థన జరగాలి." గాంధీజీ 22-12-1927 న చెప్పిన మాటలివి. ఇదేవిధమైన ఆలోచన, ఆచరణ కల వినోబా తన పాదయాత్రా సందర్భాలలో కొన్ని కొన్ని ముఖ్య దేవాలయాలలో దేవదర్శనం చేయటం కొన్ని అనుకూల ప్రతికూల సంఘటనల అనుభవాలు పొందటం జరిగింది. భారతీ యాధ్యాత్మిక జగత్తులో ఆచార్య వినోబా అభిప్రాయాలు, ఆచరణ, అవగాహన చేసికోవటానికీ సన్నివేశాల పరిశీలన మన కుపకరిస్తుంది.

వినోబా ఇలా అంటున్నారు—

"ఏతద్దేశ ప్రసూతస్య సకాశా దగ్రజన్మనః
స్వంస్వం చరిత్రం శిక్షేరన్ పృధివ్యాం సర్వమానవాః"

అన్న మనువు ఆశించినట్లు ప్రపంచంలో ఉన్న మానవు లందరు ఈదేశప్రజలనుండి శీలశిక్షణ పొందాలంటే మనదగ్గరకు రాగోరినవారినికూడ దగ్గరకు రానియ్యకపోవటంద్వారానే శిక్షణపొందుతారా? "పృథివ్యాం సర్వమానవాః" అనటంలో మనువు తన హృదయవైశాల్యాన్ని ప్రదర్శించాడు. మనువు చెప్పిన ధర్మం మానవధర్మం. అది సమస్తమానవులకు వర్తించే ధర్మం. మనం మనవిషయాల్ని ఇతరులమీద రుద్దరాదనేమాట మంచిదే. కాని ఇతరులు మనదగ్గరకు రావాలనుకొన్నప్పుడు కూడ వారిని రానివ్వకపోవటం ఏమిటి? మనవారు ఈవిష యాన్ని చక్కగా దృష్టిలో పెట్టుకొని మన భాగవత ధర్మా నికి ఎందులో గౌరవముందో ఆలోచించుకోవాలని కోరుతున్నాను.

వైదికకాలంలో పశుహింసా యజ్ఞాలు జరిగేవి కాని భాగవతధర్మం దాన్నినిషేధించింది. బుద్ధభగవానుడు తిన్నగా యజ్ఞసంస్థమీదనే దెబ్బకొట్టాడు. ఆనాటి కది కటువుగా తోచినా తరువాత హిందువులుకూడ దానినామోదించారు. ముఖ్యంగా భాగవత ధర్మం దానినంగీకరించింది. పాతఅభిప్రాయాలను సంస్కరించుకొంటూ వచ్చిన ఈనాటి హిందూమతం, భాగవత ధర్మం, ప్రాచీన వైదికధర్మంలో ఉన్న దోషాన్ని సవరించు కోవటంవల్లనే రూపొందాయి. వేదాలలో పశుహింసకు సంబం ధించిన ఊహకు నాకేమీ ఆధారం లభించటంలేదు. అయినప్ప టికీ ఆకాలంలో పశుహింసజరిగేది. యజ్ఞాలలో పశువులను బలియిస్తూఉండేవారు. ఈయజ్ఞవ్యవస్థమీద బుద్ధభగవానుడొక

విధంగా ప్రచారంచేశాడు. కాని భగవద్గీతలో శ్రీకృష్ణభగవానుడు దానిస్వరూపాన్నే మార్చివేశాడు. దానికి ఆధ్యాత్మిక రూపమిచ్చాడు. ఈనాడు జప యజ్ఞం ధ్యాన యజ్ఞం మొదలైనవి రూఢమైపోయాయి. కాబట్టి ప్రాచీన సంకుచిత భావాల్ని మతం పేరుతో పట్టుకొని కూర్చోటం ధర్మలక్షణం కాదు. ఇంత వికాససామర్థ్యంకల మతం మరొకటి లేదనవచ్చు. పరస్పర విరుద్ధసిద్ధాంతాలుగల షడ్దర్శనాల్ని సంగ్రహించుకొని ద్వైతాద్వైత సిద్ధాంతాల్ని పొట్టలో ఇముడ్చుకొని అనేక దేవతల పూజలకు స్థానమిచ్చి వివిధమైన ఆధారాన్ని గురించి పట్టుదలచూపించనటువంటి ఉదారమతం ప్రపంచంలో మరేది ఉంటుంది? హిందూమతంలో ఎన్నోజాతు లెన్నెన్నో ఆచారవ్యవహారాలతో ఇమిడిఉన్నాయి. మొండిపట్టుదలలేని సర్వసమావేశకమైన ఇంత వ్యాపకమతం మనకు లభించినప్పటికి దాన్ని మనం సంకుచితపరచుకొంటున్నామంటే మన దేశానికి మనం తీరనిహాని చేస్తున్నామన్నమాట" అంటూ ఈమాదిరి భావాలతో బాబా తనయాత్రలో దేవాలయాలకు వెళ్ళటం జరిగింది. వినోబా చెప్పినదానినిబట్టి ఆలయ ప్రవేశ విషయంలో ఆయన ఎదుర్కొన్న అనుకూల ప్రతికూల పరిస్థితులు గమనిద్దాం—

పూరీజగన్నాథంలో దేవదర్శనార్థం వినోబా తన సహచరులతోపాటు, ఎంతోభక్తిభావంతో దేవాలయానికి వెళ్లారు. వారితో ఒక ఫ్రెంచి సోదరిఉంది. ఆమెను లోపలికి రావటానికి వీలులేదని అడ్డగించారు. అయితే మేము కూడ రామని

వినోబా చెప్పి తిరిగి వచ్చేశారు. "ఈ ఫ్రెంచి సోదరితోబాటుగా మేము దేవాలయంలోనికివెళ్ళి దర్శనంచేసికొనిరావచ్చునా ?" అని బాబా అడిగితే "వీలులే"దని అధికారులు జవాబుచెప్పారు. భగవంతునికి చేసినట్టేవారికికూడ భక్తితో నమస్కారంచేసి బాబా సపరివారంగా వెనక్కితిరిగి వచ్చేశారు. "ఆ ఫ్రెంచి సోదరిని బయట ఉంచి మేము దేవాలయంలోపలికివెళ్ళి దర్శనంచేసికొని రావటమనేది ఎంతో అధర్మంచేసినట్లవుతుందని నాకు తోచిందంటూ వినోబా— నేను చిన్నప్పటినుంచీ ఇప్పటివరకు హిందూమతాన్ని అధ్యయనంచేస్తూనే ఉన్నాను. ఋగ్వేదం మొదలుకొని రామకృష్ణపరమహంస, మహాత్మాగాంధీల వరకు ఇక్కడసాగిన ధర్మతత్త్వపరంపరనంతటినీ భక్తిభావపూర్వకంగా అధ్యయనంచేశాను. హిందూమతాన్ని నేనేవిధంగా అర్థంచేసుకొన్నానో ఆ ప్రకారం ఆచరించటానికి నేను నిరంతరం విశ్రమ ప్రయత్నం చేస్తూవస్తున్నానని నమ్రతాపూర్వకంగా చాటి చెప్తున్నాను. నాలుగు-నాలుగున్నరవందల సంవత్సరాల క్రిందట గురునానక్ కికూడ ఇక్కడ ఈదేవాలయంలో ప్రవేశించటానికవకాశం లభించలేదు. ఆయన బయటినుంచే తిరిగి వెళ్ళిపోవలసి వచ్చింది. ఇప్పుడది పాతచరిత్ర - ఇప్పుడది పునరావృత్తమైంది. ఇంకముందు కాకూడదని ఆశిస్తున్నా"నన్నారు ఈ సందర్భంలోనే "ఒరిస్సాభాషలో సర్వోత్తమగ్రంథం జగన్నాథదాసు రచించిన భాగవతం - భాగవతధర్మం ఒరిస్సా ప్రాంతమంతా వ్యాపించింది. దానికితోడు జగన్నాథపురిలోని దేవాలయంలో ఉదారమైన వైష్ణవధర్మం సాగుతుందనే ప్రఖ్యాతి దేశమంతటా వ్యాపించిఉంది. మన్నిమనం నాల్గుగోడలమధ్య బంధించుకొని

కూర్చుంటే హిందూమతంలో ఉన్న ఔదార్యం నశించి పోతుం"దన్నారు. పండరిపురాన్ని వినోబా ఒక ఆధ్యాత్మిక తీర్థక్షేత్రమని నమ్మారు. ఆధ్యాత్మవిద్య పొందే అధికారం హిందువులకున్నట్లే మహమ్మదీయులకు క్రైస్తవులకూకూడ ఉందన్నారాయన. తన 63.వ యేట వినోబా పండరిపురానికి వెళ్లారు. అయినా తనకు కొంచెం జ్ఞానం తెలిసినప్పటినుంచి ఇప్పటివరకు తాను పండరిపురంలోనే ఉన్నానని చాటిచెప్పు తున్నానన్నారు. కాని చిన్న చిన్న గ్రామాలలో నివసించే ప్రజల దర్శనం విఠోబా దర్శనంగానే భావించి యాత్ర సాగిస్తున్నానని తమ తీర్థక్షేత్రం పండరీపురము, రామేశ్వరము కాక మక్కా జరూసలములే కాక ప్రతిగ్రామము, ప్రతి ఇల్లు కూడ నని సర్వసమభావన తన్మయత్వంలో వెల్లడించారు.

వినోబా పరివారం పండరిపురం చేసుకొంటూ ఉండగానే కొంతమంది "ఈ మనిషి (వినోబా) ధర్మభ్రష్టులైన వ్యక్తుల్ని వెంటపెట్టుకొని పండరిపురానికి వస్తున్నాడు. ఆయన వాళ్ళతో దేవాలయంలో ప్రవేశించబోతున్నాడు" అంటూ పుకార్లు వ్యాపింప జేద్దామని ప్రయత్నించారు. పాపం వినోబా భక్తి ఎటువంటిదో వారికేం తెలుసు ?

వినోబా అన్న మాటలివి : అక్కడికి వెళ్ళవద్దని ఎవరైనా నన్ను నిషేధిస్తే నేనెందుకు వెడతాను? అక్కడే భగవంతుడు కైదిగా పడివున్నాడా? అలాఅని నేననుకోవటంలేదు. అయితే విగ్రహంలోను దేవాలయంలోనూ కూడ దేవుడున్నాడని నేనంగీకరిస్తాను.... అసంఖ్యాకులైన సత్పురుషులు సందర్శించిన ఆ

ప్రదేశంపట్ల నాకు శ్రద్ధతక్కువగా ఏమీలేదు. ఆ విగ్రహమంటే నాకు శ్రద్ధ ఎందుకంటే ఎందరో మహానుభావులు దాని దర్శనార్థం వస్తున్నారు. తమ పుణ్యాన్ని ఆ స్థలంలో సంచితం చేశారు. కనుక దానిపట్ల నాకు శ్రద్ధా భక్తులున్నాయి. కాని ఎక్కడికి వెళ్ళరాదని నిషేధముంటే అక్కడికి వెళ్ళకుండ ఉండటమే నా సత్యాగ్రహం" అంటూ ఉపన్యసిస్తూ ఉండగా పాండురంగ విఠల్ దేవాలయంనుంచి "మీరు మా దేవాలయంలోకి రండి" అని చీటీ వచ్చింది. వినోబా సంతోషం వెల్లడించారు.

బాబావెంట ఒక ముస్లిం సోదరి, ఒక క్రైస్తవ సోదరి ఉన్నారు. వారిని విడిచి తానొక్కడే దేవాలయంలోనికి వెళ్ళటం బాబాకు గౌరవంగా తోచలేదు. విగ్రహంపట్ల శ్రద్ధా భావం లేనివాళ్ళు అక్కడికి రాకూడదు. కాని భక్తిభావంతో అక్కడికి రావాలనుకొన్నవాళ్ళకి కూడ ప్రవేశానికి ప్రతిబంధం ఎందుకుండాలనేది వినోబా భావం. ఆ విషయం ఆయన దేవాలయాధికారులకు తెలియపరిస్తే "మీ సహచరులందరితోను మీరు మా దేవాలయానికి రావచ్చును" అని చెప్పారు. వినోబా వ్రాత పూర్వకమైన ఆహ్వానం ఇవ్వమని కోరారు. వారు ఉత్తరం వ్రాసియిచ్చి అమితప్రేమతో ఆయన్ని దేవాలయానికి తీసికొని వెళ్ళారు. "వారు నాకు చేసినంత ఉపకారం ఇంత వరకు మరెవ్వరు చెయ్యలేదు" అన్నారు వినోబా.

అక్కడ వినోబా పొందిన అనుభవం ఆయన మాటల్లో : "అక్కడ నాకు గంటసేపటి దాకా కళ్ళ నుండి అశ్రుధారలు ప్రవహించాయి. ఎందుకంటే నాకక్కడ రాతి విగ్రహాలు కన బడలేదు. నేను దేవాలయంలోకి వెళ్ళబోయేటప్పుడు ఎవరి వెంట వెళుతున్నాను? అయ్యో! రామానుజాచార్యుడు, నమ్మాళ్వారు, జ్ఞానదేవుడు, చైతన్యుడు (ఈ మాటలంటూ ఉండగా వినోబాజీ కళ్ళ వెంట నుండి అశ్రుధారలు కారుతున్నాయి. కంఠం గద్గదమైంది. ఆయన కొంతసేపు ఆగవలసి వచ్చింది) కబీరు, తులసీదాసు- ఈ భక్త మండలి ఎంత ధన్యమైంది ! బాల్యం మొదలుకొని నేటివరకు నేనెవరి సాంగత్యంలో ఉన్నానో, ఎవరి సాంగత్యంలో పెరిగానో అటువంటివారందరు నాకు జ్ఞాపకం వచ్చారు. దర్శనంచేసి ఆ పాండురంగని దివ్య మూర్తిముందు నా శిరస్సు వంచేసరికి అక్కడ నేను మా అమ్మగారిని చూశాను, మా తండ్రిగారిని చూశాను. నా గురువును చూశాను. అక్కడ నేను చూడనిదెవరిని? ఎంతమంది నాకు పూజ్యులు ప్రియులు ఉన్నారో అందరూ అక్కడ నాకు కన బడ్డారు".

వినోబావెంట ఒక క్రైస్తవ సోదరి, ఒక ముస్లిం సోదరి ఉన్నారు. పూజారులు వాళ్ళిద్దరితో "మీరు భగవంతునిమూర్తి నిస్పృశించండి" అన్నారు. అక్కడ దేవతా విగ్రహాల్ని ఆలింగ నం చేసుకొనే ఆచారం ఉంది. ఆ సోదరీమణులిద్దరు ఆ దేవతా మూర్తిని స్పృశించారు. "వారిద్దరి స్పర్శవల్ల భగవంతుని శరీ రం పులకించి ఉంటుందని నా అభిప్రాయం" అన్నారు వినో

బాజీ. ఆ ముస్లిం సోదరి ఒక శైవ యువకుణ్ణి పెళ్ళిచేసుకొంది. ఆ పెళ్ళి వినోబా చేతులతోనే జరిగింది. రెండవ సోదరి జర్మనీ దేశస్థురాలు. "ఆమె తన దేశాన్ని తన తల్లిదండ్రుల్నీ, అన్న దమ్ముల్నీ, అక్కచెల్లెళ్ళనీ విడిచిపెట్టి గాంధీగారి భావాలు చదవటంవల్ల ప్రభావితురాలై భారత దేశానికి సేవ చేయటం కోసం వచ్చింది. ఇక్కడ జరుగుతున్న కార్యక్రమాల్ని చూడ టానికని వచ్చింది. ఏసుక్రీస్తు ప్రేమ మాత్రం ఆమె వదలలేదు. వదలవలసిన అవసరం కూడ లేదు. ఆమెకు అక్కడ ప్రవేశం లభించటంవల్ల నా హృదయానికపరిమిత శాంతి కలిగింది. ఈనాడు విశ్వంలో శాంతి ప్రేమల శక్తి పెంపొందాలి. దేవా లయంలో ఇటువంటి ప్రవేశం జరగటం చాల గొప్ప విషయం ఇది విశ్వశాంతినీ, ప్రేమనీ పెంపొందింప జేసింది. కాలపురు షుడు తనపని చేస్తున్నాడనే దర్శనం నాకిక్కడ లభించింది" అన్నారు వినోబా.

వినోబాకు దేవతావిగ్రహంపట్ల ఉన్న శ్రద్ధను కొందరు మిత్రులు అమాయకత్వంగా పరిగణించి మాటలాడుతూఉంటే వారికి జవాబుగా వినోబా—"నాఅమాయకత్వం పోవటంలేదు. ఈ అమాయకత్వం నాకు మంచితనంగానే తోస్తుంది. దేవతా మూర్తిని దర్శించినప్పుడు నాకంటినుండి ఆనందబాష్పాలు పొంగి పొరలుతాయి. భక్తనామదేవునితో దేవతామూర్తి మాటలాడినట్లే నాతోనూ మాటలాడుతుంది. ఇటువంటి అనుభవం నాకున్నది" అంటూ ఉంటారు.

అరణ్యవాసం పూర్తిచేసుకొని తిరిగి వచ్చిన రాముణ్ణి భరతుడు కలిసినప్పుడా అన్నదమ్ములిద్దఱు కౌగిలించుకొన్నారనీ ఆదృశ్యం చూచిన జనులు ఇందులో 14 సం॥ అరణ్యవాసం చేసివచ్చిన వ్యక్తి ఎవరు? ఇక్కడ రాజ్యపాలన సాగించిన వ్యక్తి ఎవరు? అనేది గుర్తించలేనిస్థితిలో పడ్డారనీ ఈ వృత్తాన్తం 1932 లో ధూలియా జైలులో భగవద్గీత 12వ అధ్యాయాన్ని వినోబా ప్రవచించే సందర్భంలో వివరించారు. అప్పుడు ఆ దృశ్యాన్నే శిల్పినా విగ్రహంగాచెక్కితే (ఉంటే) బాగుంటుందన్నారు. తరువాత 38 సంవత్సరం శ్రీ పవనార్ లో ఆశ్రమం కోసం భూమిని త్రవ్వేటప్పుడు వాకాటక రాజవంశం నాటి అత్యంత సుందర శిల్పం ఒకటి (14 వందల సం॥ పూర్వంనాటిది) బయటపడింది. ఒకరాయి బాబా చేతికి తగిలితే దాన్ని జాగ్రత్తగా త్రవ్వి బయటికి తీయటం జరిగింది. దానిమీద భరత రాముల కలయిక దృశ్యం చెక్కబడి ఉంది. ఆ రేళ్ల క్రిందట గీతాప్రవచనంచేస్తూ ఉండగా తాను భావించిన రూపం శిల్పరూపంలో తన ఆశ్రమంలోనే ప్రత్యక్షమవటం వినోబా కానందం కలిగించి "ఇటువంటి సుందరమూర్తి నావద్దకు వచ్చినప్పుడు ఇది కేవలం రాయి అని తలచి దాని నొక ప్రక్క పడవేసేటంత రాయిని (జడుణ్ణి) కాదు నేను." అన్నారు. ఆ శిల్పంలో రామచంద్రుడు భరతుణ్ణి కౌగిలించు కొంటున్నాడు. లక్ష్మణు డొకప్రక్క నిలబడి ఉన్నాడు సీతామాత మరొకప్రక్కనుంది. హనుమంతు డొకమూల నొదిగి నుంచున్నాడు. ఆవిగ్రహాన్ని బాబా ఆశ్రమ ప్రాంగణంలో ప్రతిష్ఠించారు. పవనారులో ఉన్నప్పుడు ప్రతిదినం కొంతసేపు

ఆ విగ్రహం ఎదుట కూర్చొని ఏకనాథుడు, తుకారాం, మొదలైన మహాభక్తులు వ్రాసిన భజనలు ప్రేమతో పాడుతూ ఉండేవారు. అది అయాచితంగా లభించిన విగ్రహం; పైగా తన మనోభావం రూపొందిన శిల్పం: "దాన్ని కేవలం రాయిగా భావించి దూరంగా పడవేసేటంతటి సద్బుద్ధిగాని దుర్బుద్ధిగాని నాలో లేదన్నా"రు వినోబా. బీహార్ యాత్రా సందర్భంలో వినోబా సపరివారంగా వైద్యనాథ ధామానికి వెళ్లారు. అక్కడి మిత్రులు కొందరు "హరిజనులనుకూడ వెంటబెట్టు కొని వెళ్లండి. అస్పృశ్యులకుకూడ దేవాలయ ప్రవేశమిమ్మని ప్రభుత్వం చట్టం చేసిందికదా" అంటే వినోబా— అయినప్పటికీ దేవాలయ యజమానులు చెప్తేనే వెడతాను. లేకపోతే వెళ్లనన్నారు. నేను దేవాలయంలో ఉండే దేవుడికి భక్తుణ్ణే అయినా సర్వత్ర పరమేశ్వర దర్శనంచేసే అభ్యాసం నాకుంది కనుక వారి అనుమతిలేనిదే నేను దేవాలయానికి వెళ్లటం అసంభవం. అన్న బాబాతో మీరు రావచ్చు- అన్నారధికారులు: వారు చట్టానికి భయపడి అన్నారేమో బాబాకు తెలియదు. రావచ్చునన్నారుకదా అని తన సహచరులను వెంటబెట్టుకొని దేవతాదర్శనానికి వెళ్లారు. ఆయనవెంట కొందరు హరిజనులు మరికొందరితరులూ ఉన్నారు. దేవాలయం దగ్గరకు చేరగానే వాళ్లంతా మీదపడికొట్టడం ప్రారంభించారు. అయిదారు నిమిషాలవరకు బాబాను సహచరుల్ని కొడుతూనే ఉన్నారు కేవలం బాబా నొక్కడినే కొట్టాలని వారు ప్రయత్నించారు కాని బాబా సహచరులు మిత్రులు చేతులడ్డంపెట్టి బాబా బదులు తాము దెబ్బలుతిని బాబాను రక్షించాలని ప్రయత్నిం

చారు. ఎవరూ ఏమీ మాట్లాడలేదు. వినోబా వెంటనున్న వారిలోకూడ మంచి బలిష్ఠులున్నారు. దేవాలయం వారికి తగిన ప్రతిక్రియ చేయగల సమర్థులే. వారిసంఖ్యకూడ పెద్దదే. అయినా శాంతంగా దెబ్బలుతిన్నారు. బాబా మీద చేతులుపెట్టి ఆయనమీద పడబోయే దెబ్బల్ని వారు భరించారు. భగవంతుడు తలోకాస్త ప్రసాదం ఇవ్వకుండా ఉంటాడా ? ఒకవ్యక్తి కొట్టిన దెబ్బ వినోబా చెవికి తగిలింది. దానిని తప్పించటానికికూడ మరొక మిత్రుడు తనచెయ్యి అడ్డంపెట్టాడు. అందువల్ల అంత పెద్దగా దెబ్బతగల్లేదు. ఆ తగిలిన దెబ్బకే వినోబా చెవి శాశ్వతంగా చెవిటిదయిపోయింది. అంత పెద్దదెబ్బ తగిలిఉంటే ఏమిజరిగి ఉండేదో.

అంతకుముందే ఆ చెవి తక్కువగా వినబడేది. అంత క్రితమే బలహీనంగా ఉండటంవల్ల వైద్యనాథ ధామంలో లభించిన దేవతాకృపా ప్రసాదంవల్ల (ఆదెబ్బతగలటంతోనే) ఆ చెవిలో ప్రారంభమైనహోరు, ముక్కులోను చెవిలోనుకూడ నాలుగైదురోజులవరకు బాధిస్తూనేఉంది. అందుకు వినోబా మందు మాకు ఏమీ వేసుకోలేదు. ఇది పరమేశ్వర ప్రసాదంగా లభించినదెబ్బ కనుక ఔషధం సేవించరాదని ఆయన నిశ్చయించుకొన్నారు. "బసకు చేరేసరికి అపారమైన ఆనందానుభూతిలో నిమగ్నమైపోయా"నంటూ బాబా ఈశ్వరదర్శనానికి వెడితే ఈశ్వరస్పర్శనంకూడ లభించిందన్నారక్కడివాళ్లతో. అందుకు వినోబాకు మనస్సులోకూడ కోపంరాలేదట. వారితో ఉన్న కుసుమదేశపాండేకు ఛాతీమీద గట్టిదెబ్బ తగలటం ఆమె పదిహేనురోజులపాటు ఆస్పత్రిలో ఉండటం జరిగింది. ఒక స్త్రీ

మీద ఈవిధంగా చెయ్యిచేసికోవటం మంచిదికాదనే విషయం కూడ ఆదెబ్బలుకొట్టిన వారికి తోచలేదు.

తర్వాత వినోబా "ఈ కొట్టినవారికి శిక్షలు వేయబడాలని నాకుమాత్రం ఇష్టంలేదు. నేను నామట్టుకు అందర్నీ క్షమిస్తు న్నాను" అంటూ ఒకప్రకటనచేసి అక్కడనుండి వెళ్లిపోయారు. బావేజీ భూదానయాత్ర సాగుతూనే ఉంది. తరువాత కొంత కాలానికి బీహారు ముఖ్యమంత్రి శ్రీబాబు అక్కడికివెళ్లి ఆదేవాలయంలో హరిజన ప్రవేశం చేయించారు.

పై సంఘటన జరిగి వినోబా మకాం చేరినతరువాత తెలిసింది—మహాత్మాగాంధీ ఇక్కడికి వచ్చినప్పుడుకూడ ఆయన బృందాన్నికూడ ఇట్లాగే కొట్టి అడ్డగించారనీ, వారుకూడ ఈ దేవాలయంలో ప్రవేశించలేకపోయారనీని. శ్రేష్ఠపురుషుల శ్రేణిలో చేరిన వాడనయ్యానుకదా అని నాలో నేనే సంతో షించానన్నారు వినోబా. మహాత్ముని భంగపాటుకి ముప్పది సంవత్సరాలకు పూర్వమే స్వామీ దయానందుడుకూడ ఇక్కడ ఇల్లాగే దెబ్బలు తిన్నాడట. గోకర్ణ మహాబలేశ్వర క్షేత్రంలో కర్ణాటక భూదాన యాత్రా సందర్భంగా అధికారుల పూజారుల అనుమతితోనే వినోబా సలీం అనే ముస్లిం మిత్రు నితో కలిసి దేవాలయప్రవేశం చేశారు. పండరిపురంలాగే— గోకర్ణమహాబలేశ్వరంకూడ అఖిలభారతక్షేత్రమే అయినప్పటికీ ఆదేవుడు భ్రష్టుడు కాలేదన్నారు వినోబా. దేవాలయంలో ప్రవేశించాలనే పట్టుదల ఎందుకు? అనేవిషయంలో బాబా

అభిప్రాయం ఆయన మాటలలోనే గమనించి ఈ ప్రస్తావన ముగిద్దాం.

"నేను దేవాలయంలో ప్రవేశించాలనే పట్టుదలకలిగి ఉండకపోతే ప్రపంచంలో హిందూమతం అంటే ప్రతిష్ఠలేకుండా పోతుంది. మహమ్మదీయులు తమమసీదుల్లోకి క్రైస్తవులు తమ చర్చిలలోకి శిక్కులు తమ గురుద్వారాలలోకి నన్ను అనేకచోట్ల నన్ను అత్యంతప్రేమతో ఆహ్వానించారు. అజ్మీరు లోని "దర్గా షా" భారతదేశంలో మక్కామంటిదని ప్రసిద్ధిపొందింది. అక్కడ పదివేలమంది ముసల్మానుల సమావేశంలో పాల్గొనటానికి 1947 సం॥లో వారు నన్ను పిలిచారు. ఆ "దర్గా షా"లో కూర్చుని నేను "స్థితప్రజ్ఞస్యకాభాషా" అని సితప్రజ్ఞ లక్షణాల పఠనతోకూడిన ప్రార్థనచేశాను. వారి సమాజులో పాల్గొన్నాను. అటుతరువాత అక్కడి ఆచారాన్ననుసరించి అక్కడ సమావేశమైన ముసల్మానులందరు వచ్చి నాచెయ్యి ముద్దుపెట్టుకొని వెళ్లారు. అక్కడ చేరిన పదివేలనుంది ఒక్కొక్కరేవచ్చి నాచెయ్యి ముద్దుపెట్టుకొని వెళ్లటానికి గంట-గంటంపావు సమయం పట్టింది. అంత ప్రేమ నాకు వారినుండి లభించింది. ఇట్లా ఒకరినొకరు ప్రేమించటానికి కారణం ఏమిటి ? ఎవరిహృదయంలో ప్రేమభావమే నిండి ఉంటుందో అతన్నెవరు ప్రేమించకండా ఉంటారు ? క్రైస్తవుల బృందం నుంచి బౌద్ధుల సముదాయం నుంచి కూడ ఇటువంటి ప్రేమే నాకు లభించింది.

జపాను మిత్రులు కొందరు నావెంట ఉన్నారు. వారు బౌద్ధులు. బౌద్ధుల ప్రేమవల్లనే నేను బుద్ధగయలో సమన్వయ ఆశ్రమాన్ని నెలకొల్పి ఇక్కడ మనం వేదాంతానికి, బౌద్ధ మతానికి సమన్వయం సాధించాలని ప్రకటించాను. బౌద్ధులు కూడ ఎంతో ప్రేమతో "బుద్ధభగవాను డే ధర్మ ప్రవర్తన కార్యం చేశాడో బాబా (వినోబా) పదయాత్ర కూడ అదే కార్యక్రమాన్ని పురోగమింపజేస్తోంది" అన్నారు. ఈ విధంగా నాకు బౌద్ధుల ఆశీర్వాదం మహ్మదీయుల ఆశీర్వాదం లభించింది. హిందువుల ఆశీర్వాదం ఉండనే ఉన్నది కదా! నేను కేరళ ప్రాంతానికి వెళ్ళినప్పుడు అక్కడున్న నాలుగు విధాల క్రైస్తవులలో నాలుగు సంప్రదాయాలుండటం చూచాను. ఈ నాలుగు సంప్రదాయాల ప్రముఖ వ్యక్తులు కలిసి చేసిన ఒక సంయుక్త ప్రకటనలో "వినోబా చేస్తున్నపని ఏసుక్రీస్తు ప్రభువు చేసిన పనే. ఇందువల్ల అన్ని చర్చిలు వారికి సహకరించాలి" అని విజ్ఞప్తి చేశారు. ఈ విధంగా అన్ని మతాలవారు మీ మతానికి చెందిన ఒక వ్యక్తికి స్వాగతం పలికి సర్వమతాలకు చెందిన వ్యక్తిగా గౌరవిస్తూ ఉంటే "నేను ఒంటరిగా ఈ దేవాలయంలోకి వెడతాను. ఓ ముస్లిములారా! క్రైస్తవులారా! మీకు ఇష్టం ఉన్నప్పటికీ మీరునాతో ఈ దేవాలయంలోకి రావటానికి వీలులేదు" అని నేనే ముఖం పెట్టుకొని వారితో చెప్పగలను? ఇష్టం లేనివాళ్ళు అసలు దేవాలయం దగ్గరకెందుకు వస్తారు? విగ్రహంపట్ల శ్రద్ధాభావం లేని వాళ్ళు అక్కడికి రాకూ

డదు కాని భక్తిభావంతో అక్కడికి రావాలను కొన్నవాళ్ళకి ప్రతి బంధం ఎందుకుండాలి?".

ఈ విధమైన భావాలు వ్యక్తంచేస్తూ భూదానయాత్ర చేసిన వినోబా దానికొక ఆధ్యాత్మిక రూపమిచ్చి హిందూధర్మ వైశాల్యాన్ని మాటల్లో వెల్లడించటంతోపాటు చేతలలో కూడ చూపించి ధన్యుడయ్యాడు.

---

## సా క్షా త్కా ర ం

ఈశ్వర సాక్షాత్కారం త్రివిధం. ఒకటి మహాజనసమూహ స్వరూపంలో, రెండవది విశాల ప్రకృతి రూపంలో, మూడవది అంతర్యామి రూపంలో ఉంటాయి. మూడూ కలిపితేనే పరిపూర్ణ పరమాత్మ సాక్షాత్కారమవుతుంది.

— వినోబా

---

# పవనార్
# పరంధామాశ్రమం

* ధామ్‌నదీ పవిత్రతీరాన సుమారు 1500 సం॥ పూర్వం ప్రవణపూర్ అనే నగరం ఉండేది. దానిని పాలించిన ప్రవర సేనుడు ఆయనతల్లి, కళామతల్లిని ఆరాధించినట్లు నిదర్శనంగా ఆనదికి ఉభయతీరాలపైన 5 కిలోమీటర్ల వైశాల్యంలో సుందర శిల్పాలు బయలు పడ్డాయి. అవి క్రీ. శ. 450 నాటి వాకాటి రాజ వంశానికిచెందిన శిల్పానికికూడ సంబంధించినవై ఉన్నాయి. వేదాంత, బౌద్ధ, జైనసిద్ధాంతాలకు చెందిన శిల్పానికి తరువాతి శిల్పానికికూడ సంబంధించినవై ఉన్నాయి. వేదాంత, (వైదిక) బౌద్ధ, జైన సిద్ధాంతాలకు చెందిన రూపాలిక్కడ సమంగానే చోటుచేసుకొన్నాయి.

వినోబాజీ ఇక్కడికి రాకపూర్వం ఇక్కడ వార్ధానివాసి శ్రీజమనాలాల్ జీబజాజ్ యొక్క భవనం (outhouse)ఒక్కటి ఉండేది. ఇది వార్ధాకి ఆరుమైళ్ళదూరంలోఉన్న ప్రదేశం. 1938 లో వినోబా మొట్టమొదటిసారిగా ఇక్కడకు వచ్చి నప్పుడు చిన్నకొండమీదఉన్న ఈ భవనంతప్ప నదికి ఉత్తర తీరమంతా పులులు నక్కలు పాములతో నిండిన అరణ్య ప్రాంతంగా ఉంది. వినోబాజీకి సర్వమత సమభావం ఉండటం

---

* ప్రవీణదేశాయ్ వ్యాసం ఆధారంగా

చేత 1500 సం॥లకు పూర్వం పాలించిన రాజు ఈ శిల్పాల ద్వారా భిన్నసిద్ధాంతాలసమీకరణ సమన్వయమూసాధించాడనే సంగతి గమనించి పరమానందపడ్డారు. ఆశ్రమం ఏర్పరచుకొని ఆశ్రమ వ్యవసాయం నిమిత్తం ఆభూమి దున్నబోయేసరికి ఈ విగ్రహాలు బయటపడ్డాయి. చిన్న దేవాలయం — దానిలో వనవాసంనుంచి తిరిగివచ్చిన రామచంద్రుడు తన సోదరుడైన భరతునితో కలిసిన ఘట్టాన్ని తెలియజేస్తూ ఉన్న ప్రధాన విగ్రహం దర్శనమిచ్చాయి. ఈ సన్నివేశంలో హనుమంతుడు, సీత, లక్ష్మణుడుకూడ ఉన్నారు. మిగిలిన విగ్రహాలలో బుద్ధ, మహావీర, శివ-పార్వతి, విష్ణు, కృష్ణ, గంగానదుల విగ్రహాలు కూడ ఉన్నాయి. ఈ ప్రాచీన విగ్రహాలకి తోడుగా ఇప్పుడు క్రీస్తువిగ్రహం, కొరాన్‌సూక్తికల రాయికూడ నెలకొల్పబడ్డాయి. ఆవిధంగా ఈ చారిత్రక ప్రదేశం ఇప్పుడు "ఒకే ప్రపంచం — ఒకేమానవుడు" అనే ధ్యేయానికి లక్ష్యంగా సమన్వితమైన ఆశ్రమం కావాలని భగవత్సంకల్పం కలిగిందా? అన్నట్లు రూపుదిద్దుకొంది. భిన్నత్వంలో ఏకత్వం, సంపూర్ణ స్వాతంత్ర్యంలో క్రమశిక్షణ, స్వయంసమృద్ధిసాధన, ఊహ, మాట, చేత అనే వానిలో ప్రపంచ పరివ్యాప్త సంబంధమూ, సాధించాలనే లక్ష్యంతో గాంధీజీ వినోబాజీ ఆశించి దర్శించిన వేదాంత వైజ్ఞానిక భావక్రియా సమన్వయ స్వరూపమే ఈ ఆశ్రమం.

బ్రహ్మవిద్యామందిరం—

ఆచార్య వినోబాభావే తన పాదయాత్రలో స్థాపించిన ఆరు ఆధ్యాత్మిక కేంద్రాలలోను వార్ధాలో నెలకొల్పబడినది

ప్రధానంగా పనిచేస్తూ మిగిలినవాటికి దారిచూపింది. వినోబా ఇక్కడినుంచి వచ్చేసి భారతదేశమంతా పాదయాత్ర చేశాక (పదేళ్లతర్వాత) ఈ పవనార్ ఆశ్రమంకూడ వందలవేల సర్వోదయ కార్యకర్తలకు శక్తినిచ్చే కేంద్రంగా తయారయింది (ధామ్‌నది ఉత్తరతీరాన వార్ధా- నాగపూర్ జాతీయ రహదారిమీద వార్ధాకి 9 కి. మీటర్ల దూరంలో ఉన్న) ఈ ఆశ్రమం ప్రశాంత వాతావరణంతో ఉత్తేజం కల్గిస్తూ చిన్న కొండమీద సుందరంగా కనిపిస్తుంది-

ఆశ్రమ ప్రధాన విభాగం బ్రహ్మవిద్యా మందిరం. మహిళలు అధ్యాత్మవిద్యాభ్యాసంచేసే మందిరం. భారతదేశపు వివిధ ప్రాంతాలనుంచి ఇతరదేశాలనుంచికూడ వచ్చిన ముప్ఫై మంది వనితలిందులో (సోదరీమణులు) ఆధ్యాత్మికంగా జీవిస్తున్నారు. తన ప్రత్యేక సిద్ధాంతాల కనుపుగా ఉన్న ఈ ఆధ్యాత్మిక మహిళామందిరం తనదైన పద్ధతిలో నడిచే ఒక ప్రత్యేక ప్రయోగశాల. దీని ఆరంభదశలో (25-3-59) ఏడు రాష్ట్రాలనుంచి ఏడుగురు బాలికలు మొదటి బ్యాచిగా ఇక్కడికి పంపబడ్డారు. వారు తమ తమ రాష్ట్రాలలో సమర్థతగలిగిన సమాజ సేవికలుగా సుశిక్షితులైనవారు.

ఆశ్రమ నియమాలు - ఆశయాలు :-

1. ఈ నూతన మందిరానికి తాము పరస్పర ప్రేమభావము, సేవ, కలిసి నేర్చుకోవటం, కలిసి ప్రార్థనచేయటం అనేవి సాధించటానికి వచ్చామనే భావంలో ఉండాలి. ముఖ్యా

ముఖ్యంగా ఉన్న చిన్న కమ్యూనిటీగా (సంఘం) ఏర్పడిన
వీరు ఒకరి నొకరు (సన్నిహితంగాఉండి) అర్థం చేసికొని
పరస్పర సహాయంతో ఉన్నతస్థాయి కెదుగుతారు.

2. ఇక్కడ ఒక అధికారిగాని మేనేజరుగాని ఉండడు. మహిళా
సభ్యులందరి సాప్తాహిక సమావేశాలలో నిర్ణయాలు
ఏకగ్రీవంగాగాని అందరిభావాల సేకరణద్వారాగాని
జరుగుతాయి. ప్రెస్సు, వ్యవసాయం, వంట మొదలైన
వివిధశాఖల ప్రణాళికాబద్ధ కార్యక్రమంలో బాధ్యత
ఒకరితరువాత మరొకరిదిగా వేరువేరు సోదరీమణులదై
యుంటుంది.

3. విరాళాలమీద ఆధారపడటం ఉండదు. ప్రతి సభ్యురాలు
6 గం॥ల శరీరశ్రమ చెయ్యాలి. ఇందులో నాల్గుగంటలు
సంపాదననిచ్చే ఉత్పత్తి కార్యకలాపముంటుంది. మిగిలినవి
శుభ్రత, వంటపనులు వగైరాలకు. అందరి ఆదాయ
వ్యయాలు కలిసిపోతాయి. వారు అందరికి కలిసి ఉన్న
వంటశాలలో భోజనం చేస్తారు. గోశాల, ప్రింటింగ్ ప్రెస్సు
వంటిచోట కొంతమంది సహాయకారులున్నా పనిమను
షులుగాని ఇతర కూలి మనుషులుగాని ఆశ్రమంలో లేరు.
ఏ పనికీ చిన్న పెద్ద అనే తేడా లేదు. అన్నిటికి సమానమైన
విలువలే. మీటింగులకు పిలవటం నడపటం దగ్గర నుంచి
అన్ని పనులూ అందరూ వంతుల ప్రకారం చేస్తారు. సీని
యర్ అని జూనియర్ అనీ భేదం లేదు. చిన్న మొత్తంలో
ఉన్న ఆశ్రమ ధనం ఆస్తి అనేవి 7గురు సోదరీమణులతో

ఏర్పడిన చిన్న ట్రస్టు చూచుకోంటుంది. (13 ఎకరాల భూమి, ఉండటానికి నాలుగు చిన్న ఇళ్లు, ఒక హాలు. ఒక అతిథి గృహం, ఒక చిన్నమొత్తం (ఖర్చులకోసం) సొమ్ము.

4. ఆశ్రమంలో వనితలంతా అవివాహితలు. 20—25 సంవత్సరాల మధ్య వయస్సు కలవారు. ఆశ్రమ ప్రవేశానికి ఆధునిక విద్యకు చెందిన డిగ్రీలుగాని, ధనవంతులై యుండటం గాని అవసరంలేదు, జీవిత సభ్యురాలుగా (life member) చేరటానికెవరికైనా **love of chastity poverty,** శారీరిక శ్రమ, పరిమితవ్యయము సాంఘిక బాధ్యత గుర్తించి ఉండటం అనేవి ముఖ్యం.

5. ఈ ఆశ్రమం ప్రధానంగా ఆధ్యాత్మిక కేంద్రమవటంవల్ల పవిత్ర గ్రంథాధ్యయనం (కీర్తన) స్తుతి ప్రార్థనలు ధ్యానం మహాత్ముల జీవితాల నుండి రచనల నుండి విశేషాలు చదివి అవగాహాన చేసుకోవటం అనేవి ఆశ్రమ జీవితంలో భాగాలయి ఉంటాయి. మామూలు పనులయిపోయిన తరువాత మిగిలిన సమయమంతా ఉన్నతోన్నతాధ్యాత్మ విద్యాజిజ్ఞాసలోనే గడుస్తుంది. కాని యిందులోకూడ ఏ విధమైన ప్రత్యేక నిర్దేశమూలేదు. ఆ ప్రాంతంలో లభించిన అన్ని రకాల విగ్రహాలుచుట్టూ కళాత్మకంగా అమర్చబడ్డాయి. నిత్య ప్రార్థనలలో అన్ని విశ్వాసాలకు చెందిన పవిత్రవాక్యాలు వస్తాయి. కాని దేవాలయానికి వెళ్ళటం గాని, ధ్యాన ప్రార్థనా సమయాలుగాని, నిర్బంధ విషయాలు కావు.

ఏ విషయం మీద సాధారణమైన తరగతులుండవు. ప్రతి సభ్యురాలు తనకిష్టమైన పుస్తకాన్ని ఇష్టమైన ఉపాధ్యాయుణ్ణి (సభ్యులలోనుంచే) ఇష్టమైన అధ్యయన సమయాన్ని భాషా మధ్యమాన్ని ఎన్నుకొని అనుసరించవచ్చు.

ఈ వ్యవస్థలో ఐదేళ్ళలో ప్రతి వ్యక్తి (member) తేలికగా అయిదారు భాషలు నేర్చుకుంటాడు. ప్రధాన పవిత్ర గ్రంథాలు చదువుతాడు. వందల కొలసె ప్రార్థన గీతాలు చక్కగా కంఠస్థం చేస్తాడు.

ఆశ్రమ వాసులంతా ఇతర సిద్ధాంతాలు ప్రయోగాలు నూతన సమస్యా పరిష్కారాలు అధ్యయనం చేయవచ్చు. ఆధునిక విజ్ఞాన పురోగతిని గమనిస్తూ మెలగవచ్చు. విద్యుత్తు మొదలైన శ్రమ తగ్గించే సాధనాలు వాడటానికభ్యంతరంలేదు. మానవత్వంలోనుంచి యాంత్రిక జీవనంలోకి దిగజారకుండ నైతిక పతనం లెకుండా ఉండటం ముఖ్యం.

'ఆశ్రమంలో రెండవ విభాగం పురుషుల విభాగం. ఇది మహిళా విభాగంకంటె ముందేర్పడింది. వినోబా 1921లో వార్ధావచ్చారు. 13 సం॥ సంఘసేవ తర్వాత 20, 22 మంది మిత్రులతో ఆయన ఒక "గ్రామసేవా మండల్" అనే సంస్థను 1934లో వార్ధాచుట్టుపట్టుల ఉన్న గ్రామాల సేవకంకితమయ్యేటట్టుగా ఏర్పరచారు. ఈ సంస్థ ఖాదీ, కుటీర పరిశ్రమల నిమిత్తం కర్ర సామానుల (ఉత్పత్తి) తయారీ, మగ్గాలు, తోలుతో చేసే పనులు, నూనె గానుగలు, గోశాలలు, కుష్ఠరోగుల సేవ,

సాహిత్య ప్రచురణలు కార్యకర్తలకు శిక్షణ మొదలైన అనేక విభాగాలతో విస్తరించింది.

ప్రపంచ నాటకరంగం మీద నుంచి గాంధీజీ తప్పుకొన్న తర్వాత, సుమారు 2000 సంస్థలు, లక్షపైగా కార్యకర్తలు గాంధేయ నిర్మాణ కార్యక్రమంలో నిమగ్నమయి సమన్విత శక్తిగా పనిచేయవలసిన అవసరం కలిగింది. వినోబా సర్వ సేవా సంఘాన్ని స్థాపించి ఈ సంస్థలన్నీ దానికనుబంధం చేశారు. ఒక సాంవత్సరిక సర్వోదయసభ ద్వారా సభ్యులంతా ఒకచోట సమావేశం కావలసిన పద్ధతి యేర్పడింది. సాంఘిక సంస్థల జాతీయ సమాఖ్య ద్వారా భారతదేశమంతటా మార్గదర్శక సూచన లివ్వటానికని సహజంగానే పరంధామాశ్రమ సభ్యులు తమ కార్యకలాపాల వ్యాపకపరిధి పెంచుకోవలసి వచ్చింది. వీరు, భూదానోద్యమ సమయంలో చేరిన కార్యకర్తలు కలిసి ఒక మహాకుటుంబమై పరస్పరావగాహనతో సర్వోదయ కుటుంబమైంది. ద్వితీయ సంస్థగా వినోబాజీ స్వహస్తాలతో స్థాపించిన సర్వసేవా సంఘం ఇప్పటికే అనేక సాంఘిక సమస్యల పరిష్కారానికి పనిచేస్తూనే ఉంది.

1938 లో వినోబాజీ పవనార్‌కి 10, 15 గురు కార్యకర్తలతో వచ్చారు. నిర్వికారాశ్రమ జీవనం, ప్రార్థనలు, అధ్యాత్మవిద్యాధ్యయనం అనే ఆశయాలతో ఆ ఆశ్రమంలో ఉన్న పురుషవిభాగం నడుస్తోంది. ప్రధాన కార్యక్రమాలు :- ముద్రణ, ప్రచురణ, గ్రామాభ్యుదయ కార్యక్రమ నిర్వహణ.

ఆ విధంగా పౌనార్ ఆశ్రమం "బ్రహ్మవిద్యామందిర్"–"పరంధామ్ ఆశ్రమ్" అనే శాఖలతో గాంధీ వినోబాల మౌలిక భావనాబలంతో కార్యక్రమం కొనసాగించే జాతీయ కేంద్ర మయింది.

పంచశక్తులు:—

సమాజవ్యవస్థా సత్పరిణామం నిమిత్తం, అహింసాత్మకమైన అమూల్యపద్ధతిని ప్రతిష్ఠించే నిమిత్తం వినోబా పంచశక్తి సంయోగం ఒక సాధనగా సూచించారు—

1 జనశక్తి—ప్రజాభిప్రాయ, సామాన్యమానవ సముదాయ శక్తి.

2 విద్వజ్జనశక్తి—విద్యావంతులు మేధావులు ఐన వారి అభిప్రాయబలం.

3 మహాజనశక్తి—పారిశ్రామిక వాణిజ్య బుద్ధిబలం

4 సజ్జనశక్తి—సమాజంతో సద్భావం సంపాదించి సమాజ శ్రేయోదృష్టి కలిగిన సత్పురుషులశక్తి.

5 శాసనశక్తి—ప్రభుత్వప్రభావం

ఈశక్తులన్నీ కలిసి ఒక నూతన సామాజిక వ్యవస్థను సృష్టించాలి. మనం ప్రజల ధోరణులలోను పరిస్థితులలోను తేదలచు కొన్న మార్పులను వ్యతిరేకించకుండా ఈ శక్తులు తోడ్పడాలి. వీటినుపయోగించుకొంటూ సమాజనిర్మాణం జరపాలి.

గీతాయీ మిషన్ :—

వినోబాజీ ఏర్పరచిన "గీతాయీ మిషన్" అనే సంస్థ వినోబాయొక్క ఆధ్యాత్మిక వాఙ్మయాన్ని ముఖ్యంగా గీతా సందేశాన్ని ఆయన వినిపించిన అత్యాధునిక సమంజస ప్రవచనాన్ని ప్రచారంచేసే కార్యక్రమం నిర్వహిస్తోంది. భారతీయ సాంస్కృతిక నైతికాధ్యాత్మిక సంప్రదాయాన్ని అవగాహన చేసికొని దాని కంకితమైపోయిన కార్యకర్తల సమూహం. వివిధమతాల భావాలమధ్య సదవగాహన పెంపొందించటానికి అందర్నీ సమావేశపరచే సమైక్య వేదికలద్వారా కృషిచేయటం మొదలైన కార్యక్రమాలలో నిమగ్నమైఉంది. పాదయాత్రలు సాగించటం వినోబా దర్శించి ప్రవచించిన అధ్యాత్మవిద్యను వివరించే కేంద్రాలు క్యాంపులు, సెమినార్లు, పండగలలో సర్వధర్మపరిషత్తులు ప్రచురణలు, విక్రయం, (అధ్యాత్మ వాఙ్మయం) మొదలైన పద్ధతుల నీసంస్థ కొనసాగిస్తుంది. కార్యక్రమంలో భాగంగా గీతాకార్యక్రమానికి నిర్మాణ కార్యక్రమ రూపంలో గోసంరక్షణ జోడింపబడింది. ఈపనంతా మౌనంగా సమగ్రంగా జరుగుతోంది.

పుస్తకాల ప్రచారంకంటె జీవితం మారిన ధోరణులు ప్రచారం చెయ్యాలి. అందుకు ముందు ప్రచారకులు ముందు తాము తమను పవిత్రం చేసుకోవాలి. సాదా జీవనం అలవరచుకోవాలి, తమ భావాలు జీవితపద్ధతులు అభివృద్ధిపరచుకోవాలి. అని వినోబా అన్నారు, వినోబా ఆశ్రమాలు, సంఖ్యలో కాక సామర్థ్యంలో ఆధ్యాత్మికమైన ఆచరణలో, ఆత్మజ్ఞానంలో

విశిష్టమైన వ్యక్తులతోకూడి ఉన్నట్లే, గీతాయీ మిషన్‌కూడ కేవలం పుస్తక విక్రయానికేకాక సామాన్యమై పవిత్రమైన జీవనవిధానాన్ని ప్రేమస్నేహాలతో ఒకవ్యక్తినుంచి మరొక వ్యక్తిలోకి ప్రాకేలాగచేసి ఆచరణద్వారా వ్యాప్తికలిగించే రూపంలోనే పురోగమిస్తోంది. ఈ గీతాయీ మిషన్ కార్య క్రమంలో ప్రస్తుతం భారతదేశపు పలుప్రాంతాలలో 40 మంది కార్యకర్తలు పనిచేస్తున్నారు. ఒక ఆరుబయలు గీతాయీ మందిరం ఆశ్రమానికి ఆరుమైళ్ళలోఉన్న "గోపురి"లో నిర్మింప బడింది. మూడువందల గీతాశిక్షణ శిబిరాలు నిర్వహింప బడ్డాయి. సమాజసేవతో కలిసిఉన్న అధ్యాత్మజీవనాన్ని ఆచ రించి జీవించే తలంపుతో పల్లెలనుంచి పట్టణాలనుంచి చాల మంది ముందుకువస్తున్నారు. స్థానిక సభ్యులు పదిహేనురోజుల కొకసారి సమావేశమై సమన్వితమైన అధ్యాయనము సమాజ కార్యక్రమము నిర్వహించడానికి కావలసిన ప్రణాళికలు వేసుకొనేటట్టు గీతాయీ మండలులేర్పడుతున్నాయి.

వినోబా చేసిన మరాఠీ అనువాదం "గీతాయీ" ప్రతులు గీతాప్రవచనాలు లక్షలకొలది ముద్రింపబడి అమ్ముడయ్యాయి. పవనార్ ఆశ్రమానికి వెళ్లాలంటే వార్ధా రైల్వేస్టేషన్‌లో (జంక్షన్ లేదా వార్ధాఈస్ట్) దిగాలి. ప్రయాణసాధనాలు స్టేట్ ట్రాన్స్‌పోర్టు బస్సులుఉంటాయి. అక్కడికి ఆశ్రమం 9 కిలో మీటర్లుంటుంది వార్ధా-నాగపూరురోడ్డుమీద. అప్పుడప్పుడే

ఆశ్రమంలో శిక్షణ శిబిరాలు నిర్వహింపబడతాయి. ఇవి వారం పదిరోజులు ఉంటాయి. శ్రమతో కూడి ఉన్న అధ్యయనం (Labour-cum study) ఇందులో ఉంటుంది. బోధన భాష హిందీ, గాని యింగ్లీషుగాని మరే ప్రాంతీయ భాష గాని ఉంటాయి.

## * బాబా — బాపూ

ప్రభాకర్ జీ డా॥ జ్ఞానవతి దర్బార్ తో అన్న మాటలు:-

— బాపూజీ — బాబాజీ (వినోబా)లకున్న తేడా —

బాపూది తీక్ష్ణ స్వభావం. ఆయనది పైత్య ప్రకృతి; అందుకే ఆయన నవ్వుతూ అంటూ ఉంటారు. "అట్టే మాటలాడకండి. నాకు పైత్యం పెరుగుతోంది" అని.

వినోబాది సౌమ్య స్వభావం. బాపూ హృదయాన్ని పట్టుకుంటారు. హృదయంలో ఉన్నదాన్ని వెంటనే తెలుసుకొంటారు. వినోబా ఎక్కువ "మాథమెటికల్"గా "లాజికల్"గా ఉంటారు. నిజమైన అర్థంలో బాపూ తండ్రి. బాపూ పరిహాస ప్రియుడు. ఎప్పుడూ ఎవరినో ఒకర్ని రెచ్చగొడుతూనే ఉండేవారు. వినోబా కూడ పరిహాసం బాగాచేస్తూ ఉంటారు గాని ఆయన పరిహాసపు తీరువేఱు. అంటే— అది భారతరామాయణాలతోను దర్శనా (శాస్త్రా)ల భావాలతోను ఓతప్రోతంగా

* "వినోబాకి జ్ఞానగంగా"— డా॥ జ్ఞానవతీదర్బార్

ఉంటుంది. నిజానికి వినోబా భావాలు గంభీరంగా ఉంటాయి. ఆయన అధ్యయనమూ, ఆలోచన చాల లోతైనవి. ఆయన పండితుడు. అందుచేత ఆయన వినోదం సదా అధికసౌమ్యంగా ఉంటూ గంభీరమూ, విద్యాప్రదమూ అయి ఉ ం టు ం ది. నవ్వుతూ నవ్వుతూ వినోదంలో కూడ ఏదో శాస్త్రసంబంధమైన కథ చెప్తారు. రామాయణ ప్రసంగమేదో చేస్తారు. చారిత్రక ఘట్టమేదో ఉల్లేఖిస్తారు. లేదా తమ అనుభవంలోది ఒకటి అరావినిపిస్తారు. ఆయన శిక్షకుడు— ఉత్తమ శిక్షకుడు. బాబాతో కూడ ఉంటూంటే బాపూ యొక్క అడుగడుగూ గుర్తుకు వస్తుంది. బాబా బాపూ లోటుని ప్రతి విషయంలోను భర్తీ చేస్తున్నారు.

---

## నా వాంఛ

ప్రప్రథమంగా కార్యకర్తలు ఏక హృదయులు కావాలి. వారి స్ఫూర్తివల్ల సమస్త భారతదేశమూ ఏక హృదయం కావాలి. ఆ భారతీయమైన ఏక హృదయత విశ్వహృదయంతో ఏక రూపం కావాలి.

1—6—1963 ఇదే నేను కోరేది — వినోబా

కొండలాగ ఎత్తు ఎదగటం నాకిష్టంలేదు. నా మట్టి చుట్టుప్రక్కల భూమి మీద వ్యాపించాలి. ఇందులోనే నాకు ఆనందముంది.

"విచార్ పోథీ" — వినోబా

---

# ఆచార్య కులం

కుల శబ్దం కుటుంబ వాచకం. ఆచార్యుల 'అధ్యాపకుల' కుటుంబమనే అర్థంలో ఆచార్య కులమనే పేరిట వినోబా ఒక సంస్థ స్థాపించారు. అరబీ భాషలో కుల్ అనే శబ్దానికి "మొత్తం" అనే అర్థముంది. ఆ విధంగా చూస్తే మొత్తం ఆచార్యులందరు చిన్న-పెద్ద, ఎక్కువ-తక్కువ అనే భేదంతో నిమిత్తం లేకుండ ఒకే కుటుంబం. అందురు ఆదరణీయులు అనే భావం వ్యక్తమవుతుంది.

జ్ఞానోపాసన, చిత్తశుద్ధి సాధన, విద్యార్థుల వికాసం నిమిత్తం. వారియెడల వాత్సల్యం, తటస్థంగానే ఉంటూ సమాజాన్ని వేధించే సమస్యలు గుర్తించి చర్చించి సర్వసమ్మతమైన నిర్ణయాలు సమాజం ముందుంచటం ద్వారా, సమాజానికి మార్గదర్శకత్వం వహించటంవంటి పనుల ద్వారా, ఈ సంస్థ ఏక కుటుంబాన్ని స్థాపించగలదనే ఉద్దేశ్యంతో వినోబా దీనికి ఆచార్యకుల్ అని పేరు పెట్టానని చెప్పారు. అందరి ఉమ్మడి ప్రయత్నంవల్లనే ఈ పని జరుగుతుందనీ భారత దేశంలో ఉన్న అనేక సమస్యల నుండి, కష్టాలనుండి వేరై మనం ఏ పనీ చేయలేమనీ వినోబా బోధించారు.

ఈ ఆచార్య కులం ఉపాధ్యాయులు తమ అధికారం, హక్కులు పరిరక్షించుకోవటానికేర్పడినది కాదు, అధికారాలు

సంపాదించుకోవటాని కితరసుస్థలున్నాయి. అంటూ బాబా "ఈనాడు ఉపాధ్యాయులు తాము పోగొట్టుకొన్న వాస్తవిక యోగ్యతను హోదాను దీనివల్ల మళ్లీ పొందగలరన్నారు.

"ధర్మరాజు అశ్వత్థామాహతః అని కుంజరః అని నెమ్మదిగా అనటంవల్ల ఆయననోట వెలువడినమాటలలో అశ్వత్థామ మృత్యువునుగూర్చిన సందేహము కల్గింది. అదికాక ఇముగ ఎల్లప్పుడు భూమికి నాలుగంగుళములయెత్తునపోయే ధర్మరాజురథం భూమిమీదకు దిగిపోయిందట" అని భాగవతకథ నుదహరిస్తూ వినోబా "అదేవిధంగా భూమిపైగా ఉండవలసిన ఉపాధ్యాయుల ధర్మరథం ఈనాడు క్రిందికి దిగిపోయింది. ఉపాధ్యాయులు సామాన్యులైన ఉద్యోగుల స్థాయికి వచ్చేశారు. ఈసంగతి వారు గుర్తిస్తే వెంటనే ఈదుస్థితినుంచి విముక్తి పొందగలరు. తనను తాను గుర్తించటమే ముక్తికి సరియైన తేలికయైన ఉపాయంకదా! దృఢనిశ్చయంతో మహత్తర ప్రయత్నం చెయ్యాలి. అప్పుడే అనేక సందేహాలకి పరిష్కారం గోచరిస్తుంది". అని చెప్పారు.

## పెద్దబుద్ధి - చిన్నహృదయము

హృదయము విశాలం చేసుకోవాలని వినోబా చెప్పిన మాటలు గమనించదగినవిగా ఉన్నాయి— వాటి సారాంశం ఇది. ప్రపంచం ఏకం కాబోతోంది. మానవుడికి మానవుడు దగ్గరౌతున్నాడు. ఆకాశావకాశం తక్కువై పోతోంది. ఈ

సంగతి మీకు తెలియనిదికాదుకదా! విజ్ఞానం పెరిగిపోయి బుద్ధి అంతపెద్దదైనప్పుడు హృదయం ఇంతచిన్నదిగాఉంటే (సంకుచితమైఉంటే) మానవజీవితంలో విపరీతపరిస్థితి ఏర్పడుతుంది. ఇప్పుడున్న ఈ విపరీతపరిస్థితివల్లనే ప్రపంచమంతటా ఇన్ని 'ఎన్నో' సమస్యలు తలెత్తుతున్నాయి—(1) కూలీలకు యజమానులకు తగాదా (2) హిందూ ముస్లింల కొట్లాటలు (3) భారత పాకిస్తానీయుద్ధం (4) వియత్నాం యుద్ధం – ఇటువంటి వెన్నో! బుద్ధివైశాల్యం పెరిగి హృదయవైశాల్యం తరిగిపోవటమే దీనికంతకీ కారణం – హృదయం చిన్నదైనప్పుడు బుద్ధికూడ చిన్నదైతే ఇంత ప్రమాదముండదు. నేడు పెరిగిన మానవబుద్ధిముందు న్యూటన్‌వంటి మహాముని వ్యాసునివంటి భగవానుడుకూడ చిన్నవారైపోయారు. వారి జ్ఞానంకంటె ఎన్నోరెట్లు అధికమైన జ్ఞానం మనకు లభించింది.

న్యూటన్ గణితజ్ఞానంకంటె నేటి కాలేజీ విద్యార్థి గణితజ్ఞానమెక్కువ. "డిఫ్రెన్సియల్ కేలక్యులస్" విషయమే న్యూటన్‌కి తెలియదు. ఆనాడతడు గణితజ్ఞుడైన మహాజ్ఞాని, అయినా అతనిజ్ఞానం నేటి జ్ఞానంముందు చిన్నదైపోయింది. ఇల్లాగే మన బుద్ధి యింకా పెద్దదైపోయి హృదయం చిన్నదిగానే ఉండిపోతే కులం మతం, ముఠా, పార్టీ అంటూ మన హృదయాన్నింకా సంకుచితపరచుకోవటం జరిగి ముందుకు సాగేకాలంతోబాటు నడవలేక ఈ కాలానికి తగనివాళ్లమనిపించుకోవలసివస్తుంది. అని జాతి, మత, సంప్రదాయ

భాషా, ప్రాంతాది భేదాల అంతమే సర్వోదయమనే భావంతో నేనొక కవితకూడా వ్రాశానని వినోబా ఉద్బోధించారు. నేటి విజ్ఞాన పురోగమన క్రమంలోనుంచి తప్పించుకొని బుద్ధిని చిన్నది చేసుకోవటమనేది మనకీనాడసాధ్యం. అందుచేత (మనస్సు) హృదయాన్ని పెద్దదిగాచేసికోక తప్పదు. విశ్వమానవులం అనే భావం పెంపొందించుకోవటం అత్యంతావశ్యకం. ఋగ్వేదంలో "విశ్వమానుషః" అనే మాట ప్రయోగింపబడింది. సమస్త విశ్వమూ మనదే. "జయ్‌జగత్" అనే నినాదమే ఈనాడు మనకు తగింది. ఇటువంటి విశాలభావం అధ్యాపకులకే లేకపోతే సామాన్య ప్రజానీకానికింత హృదయ వైశాల్యముంటుందా? అందుచేత ఆచార్యకులస్థాపనచేసికొని అధ్యాపకు లీ మహోన్నతాశయసాధనకు కృషిచెయ్యాలని వినోబా హెచ్చరించారు.

ఉపాధ్యాయుల నుద్బోధించిన తీరుకూడ గమనించదగినది కొంతఉంది. తనని తాను ఉపాధ్యాయునిగా తలంచుకొని వినోబా ప్రకటించిన భావాలిల్లా ఉన్నాయి.

నేను అధ్యయనాధ్యాపనాలు జరుపుకొంటూ కూర్చుంటే లభించే సంతోషంకంటె ఎక్కువ సంతోషం నాకు మరెక్కడా లభింపదు- అల్లాగేచేస్తే నేను నూరు సం॥ వరకు జీవించగలననే నమ్మకంకూడ నాకుంది. ఎందుచేతనంటే ఆ జీవితం శాంతి సమత్వాలని కాపాడగలిగిందై ఉంటుంది. కాని నేడు భారత దేశం ప్రమాదస్థితిలో ఉన్నదని గ్రహించి నేను బయటికి బయలుదేరాను.

## ఉపాధ్యాయుల కర్తవ్యం—

ఒక గ్రామాన్నెన్నుకొని దానికి చెందిన విషయ పరిజ్ఞానమంతా కలిగేలాగ సర్వేచేసి తరువాత దానిని సంస్కరించటానికేమి చేయగలమో ఆలోచించాలి. ఒక ప్రణాళిక తయారు చేసుకోవాలి. పట్టణాలు సర్వేచేసి కొట్లాటలు, అశాంతి లేకుండా చూడాలి. ఉంటే అదుపులో పెట్టే బాధ్యత ఉపాధ్యాయులే వహించాలి. ఇది ఎలాసాధ్యపడుతుందంటే— గ్రామశక్తిని నిలబెట్టడంద్వారా సాధించవచ్చు— రాజకీయవేత్తలకు దేశాన్ని ముక్కలుచేయటమే తెలుసు. వారిశక్తిని విఫలం చెయ్యాలంటే మనం గ్రామశక్తిని నిలబెట్టాలి. గ్రామంలో ఒకప్రక్క రైతులశక్తిని మరొకప్రక్క విద్యావంతుల శక్తిని ఉపాధ్యాయులశక్తిని నిలబెట్టాలి. ఒకటి "అన్నం బ్రహ్మేతివ్యజానాత్, అన్నం బహుకుర్వీత "అన్నం బ్రహ్మస్వరూపమని గ్రహించి అధికంగ ఉత్పత్తి చెయ్యటం. ఇది రైతులపని రెండవశక్తి ఉపాధ్యాయులపని. ఇది జ్ఞానశక్తి-చైతన్యవంతమైన వస్తువుకి ఆకారమిచ్చేపని. ఇది ఉపాధ్యాయులకు ఒప్పగింపబడింది. ఉపాధ్యాయులీ మహత్తర స్థాయినుండి ఒక సామాన్య స్థాయికి దిగజారిపోయారు. ఉపాధ్యాయులలో విభాగాలేర్పడ్డాయి. విద్యార్థులలో విభాగాలు— ఉపాధ్యాయులకు వ్యతిరేకంగా విద్యార్థుల విభాగాలుకూడ తయారైనాయి. వీరిద్దరు కలిసినప్పుడే విద్యాశక్తి నిర్మాణం జరుగుతుంది. నిజానికి తమ స్వార్థమంతా ఒకటిగా ఉండవలసిన వ్యక్తులే వేరువేరు సంఘాలు నిర్మించుకొని వేరుపడిపోతే ఇక శక్తి ఎలా

నిర్మాణమవుతుంది ? ఈ సమస్యలన్నిటికీ సమాధానం చెప్పాలంటే ఉపాధ్యాయులే చెప్పగలరు. ఎప్పుడు ? వారు రాజనీతి నుంచి విడివడి లోకనీతిలో జతపడినప్పుడు. రాజనీతినుంచి వేరు కాకుండ దానిని ప్రభావితంచేయటం సాధ్యపడదు. కనక అధ్యాపకులు రాజనీతినుంచి ముక్తిపొంది లోకనీతి యుక్తులవాలి. ఉపాధ్యాయులు బడిలో చదువు చెప్పినంత మాత్రాన తమ కర్తవ్యం పూర్తయినట్లు కాదు. ప్రజలతో సంబంధం పెంచుకోవాలి. అప్పుడు గాని రాజనీతిమీద వారి ప్రభావం పడదు.

ఉపాధ్యాయ శిబిరాలేర్పరచుకొంటూ వాటిలో జరిగిన చర్చల ఫలితంగ కొన్ని అభిప్రాయా లేర్పరచుకొని వాటిని ప్రకటించటంద్వారా ప్రజలకు మార్గదర్శకులు కావాలి. "ఉపాధ్యాయులు తటస్థంగా సానుభూతితో సమస్యలు అవగాహనచేసుకొని పరిష్కారమార్గాలు ప్రకటిస్తారు" అనే విశ్వాసం ఉపాధ్యాయులమీద ప్రజలకు కలగాలి. ఈ విధంగా ప్రభుత్వానికీ తోడ్పడినట్లౌతుంది. దాంతో ప్రభుత్వంమీదకూడ కొంత అదుపువస్తుంది. రాజకీయాల్లోపడిఉంటే మాత్రం తమ శక్తిని తాము నిర్మాణం చేసుకోవటం ఎన్నటికీ సాధ్యపడదు. పైగా ప్రభుత్వం చేతులలోనే ఉపాధ్యాయుల పిలకజుట్టుండిపోతుంది. కాబట్టి ఉపాధ్యాయులు రాజకీయాల కతీతంగా కొన్ని కార్య ప్రణాళికలు చేపట్టి సమయంవచ్చినప్పుడు వీరివల్ల మనకు మార్గదర్శకత్వం లభిస్తుందనే విశ్వాసం ప్రజలకు కలిగించాలి.

ప్రతిజ్ఞ—ఉపాధ్యాయులీ క్రిందివిధంగా ప్రతిజ్ఞచేయాలని బాబా బీహారులో ఉద్బోధించారు.

"మనుష్యులను మేము భారతశాంతి సైనికులుగా భావించుచున్నాము. శాంతిస్థాపన చేయుటకు మావద్దనున్న సర్వశ్రేష్ఠశస్త్రము శిక్షణే—జ్ఞాన బోధనే. శాంతిస్థాపనకు ఇంతకంటె మించిన శస్త్రము మరేది యుండగలదు? అది మాచేతులలో ఉండనేయున్నది. కనుక విద్యార్థులపట్ల మా కర్తవ్యమును నెఱవేర్చెదము. అంతేకాకుండ సమస్త దేశములోను శాంతిస్థాపనకై మేము కృషిచేసెదము. రాజకీయముల నుండి దూరముగ నుందుము". అని ఉపాధ్యాయులు ప్రతిజ్ఞచేసికొంటే వారిస్థాయి ఒక్కసారిగా ఉన్నతమై పోతుంది. ప్రజలు వారినింకా విశిష్టదృష్టితో చూస్తారు.

విద్య :—

ఈనాటి మన విద్యావిధానంలో అధ్యాత్మ విద్యకు తావులేకపోవటం శోచనీయ మన్నారు వినోబా. పూర్వంనుంచి యిప్పటివఱకు ఇప్పుడుకూడ భారతదేశం ఏ ఆధారంమీద నిలబడి ఉందో అటువంటి పునాది అధ్యాత్మవిద్య. అదే మన విద్యావిధానంలో లేకుండా పోయింది. నేటి విద్యావిధానంలో ఉత్పాదన క్రియ లేనేలేదు. ఈవిద్యావిధానంద్వారా మనం జ్ఞానాన్ని కర్మనీ వేరువేరుచేసేశాం. కాలేజీలలో విశ్వవిద్యాలయాలలో చదువుకొని బయటకువచ్చిన వారికి ఉద్యోగాలు లేవు. పరిస్థితి ఎల్లాఉందంటే ప్రజలకు విద్య నేర్పితే నిరుద్యోగం పెరుగుతుంది. విద్య నేర్పకపోతే అజ్ఞానం పెరుగుతుంది. ఇవి రెండూ ప్రమాదకరమైనవే. దీనికి వ్యతిరేకంగా భగవద్గీత—

కర్మణైవ హి సంసిద్ధి మాసితా జనకాదయః.
లోకసంగ్రహమేవాపి సంపశ్యన్ కర్తుమర్హసి॥ అని చెప్పింది. కనక కర్మను విడిచిపెట్టకూడదు. జ్ఞాని మహా జ్ఞాని కూడ కర్మచేయవలసిందే. తల్లి తనబిడ్డకోసం ఆటఆడినట్లే జ్ఞానికూడ లోకసంగ్రహంకోసం కర్మచెయ్యాలి. అది తెలిసికొని ఉండికూడ మనం కర్మను గురించిన ఆలోచనే పోగొట్టుకొన్నాం. మనకు జ్ఞానం పెరగలేదు సరికదా కర్మనుకూడ కోల్పోయాం. అంటూ విద్యావిధానం పని, చదువు, అధ్యాత్మ జ్ఞానం, సమన్వయపరచేదిగా ఉండాలని బోధించారు.

---

## నిర్ గ్రంథ - బాబా

ఆవు తాను గడ్డితిని దూడకు పాలిస్తుంది, మన బాబా వేదాలు, ఉపనిషత్తులు మొదలైన అరణ్యాలలో విహరించి మనకు సారంతెచ్చి యిచ్చారు.

ఋగ్వేదసార్ అష్టాదశి....క్రిస్తధర్మసార్, కురాన్‌సార్, భాగవతధర్మసార్ జపుజీ, ధమ్మపద్ మొదలైన గ్రంథాలు సాక్షాత్తు బాబా కరుణ. ఈమధ్యబాబా 'నిర్‌గ్రంథ' అయిపోయారు. 'రామహరి'లో తన్మయులైపోయారు.

శ్రుతివచనం....గ్రంథమభ్యస్యమేధావీ జ్ఞాన విజ్ఞానతత్పరః
పలాలమివధాన్యార్థీ త్యజేత్ గ్రంథమశేషతః

ధాన్యంకావాలనుకొనేవాడు పొట్టుతొలగించి ధాన్యమే గ్రహించినట్లు జ్ఞాని గ్రంథమభ్యసించి సారం గ్రహించి గ్రంథం విడిచిపెడతాడు.

—శ్యామ

---

మౌనాత్ సత్యం విశిష్యతే

# గోసేవ

వినోబాజీ ఆశ్రమంలో కూడ సేవాశ్రమంలోలాగానే గోసేవా విభాగముంది. గోపాలన, రక్షణ కార్యక్రమంతో పాటు గోహత్యానిషేధం నిమిత్తం కూడ బాబా పడ్డశ్రమ, చేసిన ఉపవాసాలు, ఆమరణ నిరశన దీక్షాప్రయత్నం, దేవనార్‌లో ఈ విషయంలో బాబా ఆదేశదర్శకత్వాలలో పెద్ద ఎత్తున జరిపిన (గోహత్యానిషేధం కోరుతూ) సత్యాగ్రహం, ఇవన్నీ ఆయన జీవితంలో ప్రత్యేకించి చరమ దశతో ఓతప్రోతంగా ఉన్న సంగతి సుప్రసిద్ధమే కదా!

ముందు "సానే గురూజీ" చెప్పిన వాక్యాలు గమనించి, ఈ విషయంలో వినోబా 1946లోనే గోసేవా సంఘ సమ్మేళనంలో వెల్లడించిన భావవిస్తార విమర్శ పరామర్శిద్దాం :—

"ఏ రోజునుంచి భారతీయులు గోమాతను దూరంచేశారో, దానిను పేక్షింప నారంభించారో ఆనాటి నుంచే దుఃఖం, రోగాలు, దారిద్ర్యం, దీనత్వం, క్షామపరిమాణం, అధికాధికంగా పెరగ నారంభించాయి.

చరఖా, గోవు ఈ రెండే భారతీయ భాగ్యానికాధారాలు, ఆరాధ్యాలూను. కనుకనే మళ్ళీ వీటి సేవ ప్రారంభం కానంత వరకు మన ఉద్ధరణకు రెండో మార్గం తెరవబడదు".

— "సానేగురూజీ"

**బాబా కథనం :-**

మేం చాలకాలం జైలులో ఉండివచ్చిన సంగతి మీకు తెలుసు. మాకు అధ్యయనాదులు చేసికోవటానికి తగినంత సమయం లభించిందని దీని అర్థం. అక్కడ అనేక విషయాల మీద అధ్యయనం సాగుతూ ఉండేది. వీటిలో భారతీయ-అర్థశాస్త్రాధ్యయనం కూడ జరిగింది. భారత సమస్యలను గురించి అనేక కోణాల నుంచి ఆలోచన జరిగేది, దానిలో గోసేవా విషయక పఠనపాఠనాలు, విచార వినిమయం కూడ స్వాభావికంగా జరిగాయి. ఈ క్రమంలో ఒకచోట ఒక విషయం చదవటం సంభవించింది. అది యేమిటంటే— భారతదేశంలో మనిషి ఒక్కంటికి ఏడు ఔన్సుల పాలు ఖర్చవుతాయని. కాని నాల్గేళ్ళ క్రిందటి యుద్ధం తర్వాత అది తగ్గి అయిదు ఔన్సుల దగ్గర ఉండిపోయింది. యుద్ధపురోజుల్లో స్వయంగా ఇంగ్లండులో కూడ ఖాద్యపదార్థాలలోటు కనిపిస్తూనే వచ్చింది. అక్కడి ఆహారశాఖామంత్రి మార్గాంతరంలేక "ఇప్పటివరకు మేం మూడు పౌండ్లు అంటే ఒకటిన్నర శేర్లు మనిషి ఒక్కంటికి ఇస్తూ వచ్చాం. కాని యిప్పుడు రెండున్నర పౌండ్లతోనే పరిపెట్టుకోవాలి" అని ప్రజలకు విజ్ఞప్తి చేశారు, యుద్ధపురోజుల్లో ఇంగ్లండులో రెండున్నర పౌండ్ల పాలతోనే సరిపెట్టుకోవలసి వచ్చేది. భారతదేశంలో మాత్రం ఎప్పుడూ అయిదు ఔన్సుల తోనే పొట్టనిండి పోతోంది. ప్రజలు గోవుని "మాత" అని పిలిచే దేశపుపరిస్థితియిది.

## పాల సమస్య ఖాదీకంటె గొప్పది :-

గోసేవా మహాత్వమెంత ఎక్కువైనదో దీనితో మన కర్థమవుతుంది. నావంటి ఖాదీనిష్ఠకలవాళ్ళు కూడ విశేషపరిస్థితిలో రైతులందర్నీ ఇతర పనుల్లో పాల్గొనేలాగ చేసి మిల్లులు జాతీయంచేసి దేశంలో ఉన్న బట్ట-కొరతని తీర్చాలనే భావంతో సమాజ నిర్మాణ కల్పన చేస్తారు. కాని పాలులేనిదే మనం పని గడుపుకోగలమనేది మన మూహించనైనాలేం. అందుచేత పాల సమస్య ఖాదీకంటె గొప్పది. పాలసమస్య ఎంత గొప్పదో తెలుసుకొన్నాక "గోసేవా దృష్టి"ని దృష్టిలో పెట్టుకోవాలి.

## రెండు దృక్పథాలు :-

గోసేవ రెండు దృక్పథాలలో చేయవచ్చు. ఒకటి హిందువుల మనస్సు మస్తిష్కము, రక్తంలో ఉంది. అంటే- ఆవంటే పూజ్యబుద్ధి. కాని యీ పూజ్యభావం దేశాన్నెంతదాకా తీసుకుపోయిందో మనం చూచాం. మన దేశంలో ఆవును పేక్షించినంతగా మరే దేశంలోనూ, ఉపేక్షించటంగాని దానివల్ల కలిగిన గోవు యొక్క కరుణా జనకమైన దురవస్థగాని కనిపించదు. కారణం- ఆ పూజ్యబుద్ధి శాస్త్రీయంగా లేకపోవటమే. శాస్త్ర రహితబుద్ధితోనే పనంతా జరిగిపోతోంది. కేవలం శ్రద్ధ ఉండటం గొప్ప విషయం కాదని "గీత" మనకు చెప్పింది. శ్రద్ధ ప్రతి వ్యక్తిలోను ఏదో విధంగా ఉంటూనే ఉంటుంది. కాని తాత్త్విక శాస్త్రీయ శ్రద్ధ మాత్రమే తరింపజేసే దవుతుంది.

జ్ఞానరహితమైన, అంటే— అశాస్త్రీయమైన శ్రద్ధ ప్రగతి మార్గాన తీసికొని వెళ్ళదు.

ఆవులో అందరు దేవతలూ నెలకొని ఉన్నారనీ ఇతర ప్రాణుల్లో దేవుళ్ళు లేరనీ చెప్పే విషయం ఈ రోజుల్లో ఒప్పుకో దగిందికాదు. ఇది పూజ్యభావపు ఆధిక్యం, మూఢత్వమూను.

రెండవది— వైజ్ఞానిక పద్ధతిలో పనిచేయటం. మనసేవ యొక్క పరీక్ష ఆర్థిక * నికషోపలం మీద జరగాలి. ఈ రాతి మీద రుజువుగాని (ఈ పరీక్షలో నెగ్గని) ఏ విషయమూ కూడ ఈ లోకంలో నిలబడలేదు. అందుచేత మన గోసేవ ఆర్థిక దృష్టి పరీక్షలో నెగ్గలేకపోతే దాన్నంటిపెట్టుకొని కూర్చోవటం మంచిదికాదు. దాన్ని వదలిపెట్టివేయాలి. వైజ్ఞానిక దృష్టి ఆవు మనుష్య సమాజానికుపయోగకరమనీ ఆర్థిక దృష్టితో లాభ దాయకం కూడాననీ చెప్పినప్పుడు గోసేవ నిలబడుతుంది.

## దేనిదారి దానిదే :-

ఈ రెండింటికీ ఎప్పుడూ పడదు. తగువుకి కారణమేమి టంటే— ఒకవైపు మూఢత. రెండవవైపు కేవల ఆర్థిక దృష్టి. కేవలమూ ఆర్థిక దృష్టిపెట్టుకొంటే ఏమవుతుందంటే ఆవు పాలిచ్చినంతవరకు దాన్ని పాలించాలి. వట్టిపోయాక మనిషి దాన్ని కోసుకొని తినాలి. అనేభావం కలుగుతుంది. ఇందులో ఆర్థిక దృష్టితో లాభముంది. చర్మపు దృష్టితో చూచినప్పటికీ

* బంగారం మంచి చెడ్డలు తెలిపే ఒరిపిడి రాయి.

చంపబడిన ఆవు చర్మం ఎక్కువ ఉపయోగకరమనే తేల్తుంది. ఆవు ఉపయోగం సమాప్తం కాగానే దాని జీవనం కూడ సమాప్తం కావాలనేది కేవలార్థిక దృష్టియొక్క పరిణామం. దానంతట అది సమాప్తం కాకపోతే దాన్ని మనం సమాప్తం చెయ్యాలి.

## భారతీయ సమాజవాద విశేషదృష్టి :-

అయితే మనమిప్పుడేం చెయ్యాలి? మన దగ్గర వైజ్ఞానిక దృష్టే కాక మరొక దృష్టి ఉంది. దాన్ని సరిగ్గా అర్థంచేసుకోవాలి. అది మన భారతీయ సమాజవాద దృష్టి. ఆవుకి మనం మన పరివారంలో స్థానమిచ్చాం. కాని దానికిస్థాన మిచ్చేముందు దాని ఉపయోగాన్ని గురించి కూడ ఆలోచించుకొన్నాం. సమాజ వాదం సమస్త మనుష్య సమాజాన్ని దృష్టిలో ఉంచుకొంటుంది. "ప్రతిమనిషికీ అతనికి తగిన పనివ్వండి. అతనిచేత పూర్తి పని చేయించుకోండి. అతనికి పూర్తిరక్షణ యివ్వండి" అని సమాజవాదం చెపుతుంది. భారతీయ సమాజవాదం (Socialism) మనుష్య సమాజంతోపాటు ఆవుకు కూడ తమ కుటుంబంలో స్థానమివ్వండి. దానిని పూర్తిగ ఉపయోగించుకోండి. దానికి పూర్తి రక్షణ కల్పించండి. అని చెపుతుంది. మనం పూర్తిగ ఉపయోగించుకొని పూర్తిగ రక్షించ గలిగిన ఒకే జంతువు భారతదేశంలో ఆవు మాత్రమే. ఇందువల్ల సమాజవాదం మనిషితోపాటు ఆవునుకూడ సమాజంలో అంగంగా పరిగణించింది (మన్నించింది) కాని యిలాచేసి ఒక పెద్ద బాధ్యత

కూడ తన తలమీద పెట్టుకొంది. ఆ బాధ్యతేమిటో కూడ మన మాలోచించాలి.

భారతీయ సమాజవాదదృష్టితో గోసేవాభావాన్ని గురించి ఆలోచించాలి. సమాజవాదం ఆవుకి మనకుటుంబంలో స్థానమిచ్చి పాపంచేసిందని మీరనుకొంటే ఎడ్లనువిడిచిపెట్టె య్యండి. ట్రాక్టర్లుతెండి. ఆవుపాలివ్వటం మానేసేటట్టు వెంటనే దాన్ని తినేసెయ్యండి. గోవంశవృద్ధికోసం ఎన్ని ఆబోతు లవసరమో అన్నిటిని విడిచిపెట్టి మిగిలిన అన్నిదూడల్నికూడ చంపి తినేసెయ్యాలి. ఆచారం కారణంగా ఎవరైనా ఆవుని తినకపోతే అది భ్రమ అనుకోవాలి. అనాది కాలం నుంచివచ్చే ఈ ఆచారం కారణంగా హిందువులు ఆవునితినటానికి ఒప్పు కోకపోతే అది యితరుల కిచ్చేసెయ్యాలి. వారు తింటారు. పాపమూ పుణ్యమూ, హిందువులదగ్గరే ఉండిపోతుందని వారి కనిపిస్తూ ఉంటుంది. ఈనాడదేజరుగుతోంది. మనం స్వయంగా మన ఆవుల్ని కసాయివాళ్లకు అమ్ముతున్నాం. వాళ్లు ఆవుల్ని నరుకుతోంటే ఆ పాపస్పర్శ మనకి తగలదని మన హిందూబుద్ధి చెపుతోంది. "నీవు ఆవుని కసాయివానికమ్మి పాపం చెయ్యలేదా?" అని నేనొకణ్ణడిగాను. "ఇందులో పాపమేముం"దన్నాడు. "నీ ఆవుని అతడు హత్యచేస్తాడు. ఆ పాపం నీకు తగలదా?" అంటే— "నేను ఆవుని ఉచితంగా ఇవ్వలేదు. ఉచితంగాఇస్తే పాపం తప్పక కల్గుతుంది. నేను దానిని అమ్మాను. అమ్మినవస్తువుకి ఏమవుతుందో చూచే బాధ్యత అమ్మేవాడికుండదు." ఈవాదం వింటే మనకేమీ బాధకూడ కలగదు.

## విలక్షణమైన సమాజ నిర్మాణం :-

ఈ భారతీయ సమాజాన్ని నూతనకోణాన్నుంచి పరిశీలించవలసిఉంటే అల్లాచెయ్యండి. లేకపోతే అన్ని జంతువులు సమానమే అని భావించి ఆవునుకూడ తినటానికి సిద్ధపడాలి. సమాజ వాదాన్నంగీకరించేటట్లయితే ఆవుకూడ మన కుటుంబంలో ఒక అంగమని అంగీకరించాలి. ఒక విలక్షణమైన సమాజ నిర్మాణం చేయవలసిన బాధ్యత మన భుజాలమీద పెట్టుకొన్నామనే సంగతికూడ అర్థంచేసుకోవాలి. ఎడ్లని తినటానికి నిశ్చయించుకొంటారా? పశ్చిమదేశాలతో సమానమైన సమాజ నిర్మాణం మీరూ చేసుకోగలరు. ఎడ్లనుతినటం లేకపోతే ఎడ్లతో వ్యవసాయం చేయవలసి ఉంటుంది. దానిమీదే ఆధారపడి సమస్తమైన సమాజనిర్మాణమూ చేయవలసి వస్తుంది. అందుచేత మన సమాజనిర్మాణ మెల్లాఉండాలి? అనేది బాగా ఆలోచించుకోండి. ఈవిషయం తేలికైనది కాదని నేనొప్పుకొంటున్నాను. నేను కేవలం యింతమాత్రమే, అంటే— మనమేదృష్టితో ఆలోచించాలి? అనేదే మీముందుంచుతున్నాను. ఇది కేవలం మామూలు దయాసంబంధమైన ప్రశ్న కాదు. గొప్పవ్యాపకమైన సమస్య.

## గోపాలనం, చాలగొప్పబాధ్యత :-

పాలు ఇవ్వటం మానేశాకకూడ ముసలితనంలో ఆవుని మేపే బాధ్యత వహించేవాళ్లు ఒక గొప్ప బాధ్యతని తమ మీద పెట్టుకొంటున్నారన్నమాట. ఇది ఒక విశాలమైన ఆదర్శనాదం. ఈదారిని నడవాలంటే ఇప్పుడున్నట్లుగా అల

సత్యం పనిచెయ్యదు. మనం కేవలం ఆవుపాలే త్రాగాలని నిశ్చయించుకోవాలి. ఖాదీవిడిచిపెట్టి మిల్లుబట్టకట్టటమనేది ఆవుపాల నుపేక్షచేసినంత చెడ్డదికాదంటాను. "మేము ఏ పశువు పాలూ తాగము" అనటం వేరేసంగతి. కాని అది చాల ముందు కాలపుమాట. దానికిది తగినసమయంకాదు. ఈనాడు మాత్రం మనకి పాలు చాల అవసరం పాలుత్రాగటం తప్పనిసరి అయి నప్పుడు దేనిని బాగా ఉపయోగించుకొంటూ రక్షించగలుగు తామో ఆ ప్రాణిపాలే తాగాలి.

## భారతదేశంలో పరివర్తన రావాలి :-

కాని శరీరపరిశ్రమాత్మకమైన ఈపనిచేయండని నేను మీకు చెపుతున్నాను. దీనిలో నాకు మరొక ఆశఉంది. అది— భారతదేశంలో పరివర్తన రావాలి అనేది. దేశంలో చదువుకొన్న వాళ్లు గ్రామీణులతో కలిసిమెలిసి మనగలిగినప్పుడే 'దేశంలో' పరివర్తన కలుగుతుంది. జర్మనీ సేనాపతి రోమేల్‌తో కలవ టానికొక పాత్రికేయుడు వెళ్లాడట. ఎంతవెదకినా అతడు దొరకలేదు. చివరికి ఒక ట్యాంకు మరమ్మతుచేస్తూ కనిపించాడు. భారతదేశంలోకూడ విప్లవమనేది భారతనాయకులు ఆవుల్ని పితుకుతూనో, పొలం దున్నుతూనో, వడ్రంగంచేస్తూనో కనిపించినప్పుడే వస్తుంది. ఈనాడు 5 వేల సంవత్సరాల తర్వాత కూడ ప్రజలు శ్రీకృష్ణస్తుతి గానంచేస్తున్నారు. దాని విశేష మేమిటంటే— పూర్ణజ్ఞానిఅయినప్పటికీ ఆయన (శ్రీకృష్ణుడు) గోపాలురతోబాటు గోపాలుడై పనిచేస్తూ ఉండటమే.

మన విద్యావంతులు అవిద్యావంతులతో కలవక విడిగా (సంబంధం లేకుండా) ఉన్నంతకాలం మనదేశంలో పరివర్తన కలుగుతుందని ఆశించలేం.

## * ప్రపంచం ఋణపడి ఉంది :—

వినోబా భావాలకీ, ఆయన అనుసంధానించి అందుకు నిలబడి, క్రియాత్మక (కార్యక్రమ) ప్రణాళికలతో రూపొందించిన నవీన పద్ధతులకీ, గాను, భారతదేశమూ, కొన్ని విషయాలలో సమస్త మానవత్వమూ కూడ వినోబాకి ఋణపడి ఉన్నాయి.

1. ఆయన ఆదిశంకరుల సిద్ధాంతాన్ని సంస్కరించి ప్రపంచం (మిథ్యగాని మాయగానికాదు) సత్యబ్రహ్మనీ జీవిత గతినీ చూపించేది, అంటూ అది అవిరతంగా సత్యాన్వేషణ సాగిస్తూ ఉంటుందన్నారు.
2. సర్వమతప్రార్థన నొకదానిని 'ఓం తత్ సత్ శ్రీనారాయణతూ...) మనకిచ్చారు.
3. వినోబా ప్రకారం సామ్యయోగం గీతాసారం. తిలక్ కర్మయోగంగాని గాంధీ అనాసక్తియోగంగానికాదు.
4. సర్వోదయభావసమగ్రతత్త్వాన్ని మనకిస్తూ "జయజగత్" అనే నినాదంద్వారా దానికొక విశ్వవ్యాప్తమైన

* From the Editional of "Gandhi Marg." Dec. 82
R. R. Diwaka

ఆలోచన కలిగించారు. తత్ఫలితంగా "లోకసేవక్"లు "సర్వోదయ మండలులు" ఏర్పడి ప్రాముఖ్యం వహించాయి.

5. సత్యాగ్రహమనేది పురోగమించే సామాన్య భావమనీ, దానికి వ్యక్తిగత, సామాజిక, అంతర్జాతీయ ప్రయోగాలింకా అవసరమనీ వక్కాణించారు.

6. యునైటెడ్ నేషన్సు (భద్రతాసమితి) ఆధ్వర్యంలో దాని సహాయంతో శాంతిసేన కొక అంతర్జాతీయస్థాయి కల్పించాలని ఆయన యత్నించారు.

7. విజ్ఞాన—ఆధ్యాత్మికయుగం (ఒకదానిచేత మరొకటి ప్రభావితమై సంస్కరింపబడుతూ) ఇప్పటికే ఉదయించి మానవజీవితాన్ని నడిపించే మత రాజకీయ శక్తుల స్థానాన్నాక్రమిస్తోందని ఆయన ప్రకటించారు.

8. అధిక సంఖ్యాకుల అధికారానికీ, (పాలన) పార్టీ రాజకీయాలకీ, ముఖాముఖి రాజకీయాలకీ బదులుగా ఏకాభిప్రాయ రాజకీయం ఉండాలని ఆయన వాదించారు.

9. దానమంటే సహాయం కాదు. పంచటం (Sharing) అంటే- భూమి 'అంతా' యావత్తూ భగవంతుడిది. సమానంగా కాకపోతే న్యాయంగానైనా మనం దాన్ని పంచుకోవాలి (దాని పాలు పొందాలి.)

10. స్త్రీ శక్తి సంఘటన విషయంలో ఆయనకు మౌలికాభిప్రాయాలున్నాయి. స్త్రీత్వాన్నుద్ధరించటానికి "స్త్రీశంకరాచార్యు"డవతరించాలనే భావం తరచు ఆయన వ్యక్తం చేసేవారు.

11. భారతదేశీయ శాకాహార పద్ధతి-భావ విప్లవమూ, చైతన్యంగల జీవుల అభిరూచీ అనే వాని ఫలితమేకాని ఆహార సంస్కార ఫలితం కాదు.

12. భారతదేశంలో కృషీ-కర్షకులూ, బతికి బట్టకట్టాలంటే ఆవుకీ దాని సంతానానికీ తప్పనిసరిగా రక్షణ ఉండాలి. అనేది ఆయన దృఢ విశ్వాసం. అందుకోసం ఆయన ఉపవాసం (నిరాహార దీక్ష) చేశారు. ఇది ఆయన చివరి పోరాటం.

13. మానవ వ్యవహారాల్లో లోకశక్తి (ప్రజల సంఘటితశక్తి) అన్ని శక్తులకంటె శ్రేష్ఠమైనదనే భావం ఆయన పెంపొందించారు.

14. ఆచార్యకుల్ సంఘటన నిమిత్తం ఆయన నడుంకట్టారు. అది నిర్భయులు, పక్ష (పార్టీ) రహితులు, స్వార్థ రహి

తులు అయిన వారి సంస్థ. వారు మార్గదర్శకులై దేశాన్ని నడిపించాలని ఆయన ఆదేశించారు.

15. చెడుగునీ, అన్యాయాన్నీ, దోపిడీతనాన్నీ ఎదుర్కోవాలని ఆయన వాంఛించారు. కాని ఎలాగ? పవిత్ర పద్ధతులతో— సత్యమూ, ప్రేమా, కరుణా అనే వాటిద్వారా— అంతేకాని యీనాటి మూఢవిచక్షణారహిత, అసభ్య సత్యాగ్రహాల (ఘెరావో, ధర్నా, శిలేనిరాహారదీక్షలు మొ॥) ద్వారా కాదు.

16. అద్భుతవ్యక్తిగా ఆయన్ని గుర్తింపజేసేవి అనేక లక్షణాలున్నాయి. వాటివల్ల భావితరాలవారు ప్రభావితులౌతారు. భారతదేశంలోను, ఇతరత్ర జరిగే సన్నివేశాల క్రమాలమీదకూడ వాటిశక్తి 'ప్రభావం' పడుతుంది.



# ఏకశ్లోకీ

మాతృసేవనం మిత్రమండలం
గాంధిసేవనం వేదసూత్రణం ।
భూమి మోచనం బ్రహ్మమందిరం
శ్రీ వినాయకం ముక్తజీవనం

ఈ పైశ్లోకంలో వినోబా జీవితాన్ని సంగ్రహంగా ఆయన సోదరుడు శివాజీభావే చెప్పారు. "ఏకశ్లోకీ వినోబా" ఏడక్షరాలు. అంటే సప్తశతశ్లోకిగీతాయీ అన్నమాట" అంటూ ఈ క్రింది విధంగా వివరించారు.

1 మాతృసేవనం—వినోబా గాగోదా గ్రామంలో ఉండి చూపిన మాతృభక్తి.

2 మిత్రమండలం—బరోడాలో వినోబా—మైత్రీవికాసం.

3 గాంధిసేవనం—సాబర్మతీ ఆశ్రమవాసం—గాంధీజీవల్ల ఏకాదశ—వ్రత నిష్ఠాప్రాప్తి.

4 వేదసూత్రణం—వేదాది సద్గ్రంథాల సేకరణ—సూత్రోపాసనాది విధాయకకార్యాచరణ.

5 భూమి మోచనం—భూదానాదికార్యక్రమంతో భారతయాత్ర—సర్వత్ర ఈశ్వరదర్శనం.

6 బ్రహ్మమందిరం—బ్రహ్మవిద్యామందిరం. సామూహికోపాసన. బ్రహ్మచర్యపూర్వకం.

7 శ్రీవినాయకం—సామూహికముక్తి—వాణి, శ్రీ, కీర్తి, క్షమా, మేధా, ధృతి, స్మృతి, ఇవి దివ్య మాతృశక్తి.

వి నో బా

# ఆశయాలు - కార్యక్రమాలు

సంగ్రహ స్వరూపం :—

1. సర్వోదయ సమాజం :— సత్యాహింసలపై ఆధారపడిన శ్రమనిష్ఠా, స్నేహపూర్ణ సమాజం. సాధనశుద్ధి, సంయమం, శ్రమ, సేవాభావం, ముఖ్యం. విశ్వకళ్యాణం, బాహ్యాభ్యంతర జీవన సామరస్యం లక్ష్యాలు.

2. పార్టీలేని సేవక సమూహం :— రాజకీయ, ఆర్థిక, వర్గ భేదాలకు జాతిమత వర్ణలింగ భేదభావాలకు అతీతంగా నైతికమైన విలువల్ని పాటించే వినయపూర్వక నైతిక జీవనంగల సేవాపరాయణసేవక సమూహం ఏర్పడి సమాజ సముద్ధరణ కృషి చెయ్యాలి.

3. గణసేవకత్వం :— సామూహిక చింతన, సర్వసమ్మతి, ఆలోచనా శాసనం, నవీన సమాజ వ్యవస్థకాధార స్తంభాలు. మానవత్వ శ్రద్ధ, పరమత సమాదరం, భిన్నత్వంలో ఏకత్వం దర్శించటం, గణసేవకత్వానికి వాస్తవిక మార్గం.

4. సేవకుల మాతృస్థానం :— సేవకుల - విశ్రాంతి ఆశ్రమాలు. ఇవి అన్ని రాష్ట్రాలలోను ఉంటాయి. సేవకులు అధ్య

యనం, కర్మయోగం ద్వారా బ్రహ్మవిద్యాసాధన, చేసి తమ శక్తినిక్కడ పెంచుకొంటారు.

5. నిత్యస్వాధ్యాయం :— ఆత్మదర్శనార్థం చేసేపని స్వాధ్యాయం. సద్గ్రంథ పఠనం, మంత్రచింతనం, నామజపం, ఆత్మావలోకనం, గుణవికాసం మొ॥ సాధనాలు. సమాన ధర్మంగల సహచరులతో స్వాధ్యాయం సామూహికం కూడ కావచ్చు.

6. అనిందావ్రతం :— పరనిందచేయకుండ ఆత్మీయతతో దోష సంస్కరణ ప్రయత్నం. పరదోష చర్చ పరోక్షంలోకూడ పనికిరాదు. గుణగ్రహణశీలత, గుణగ్రహణ కళాభ్యాసం, సేవకుల కవసరం.

7. శుభ్రత :— వ్యక్తిగత-సార్వజనిక-నిత్యనైమిత్తిక శుభ్రతల శాస్త్రీయజ్ఞానం. సహజ స్వచ్ఛసుందర ప్రవృత్తి. జాతి వర్గ విచక్షణలేని శుభ్రతా నిర్వహణ.

8. నిరపవాద ఉత్పాదక శ్రమ :— శ్రమ ప్రతిష్ఠ పెంచాలి. బుద్ధిజీవియై శాసకవర్గానికి చెందిన వ్యక్తి కూడ ప్రయోజనకరమైన నియమ పూర్వక శ్రమచేసి ఉత్పాదనకు తోడ్పడాలి.

9. కాంచనముక్తి :— శ్రమజనిత వస్తువులు వినిమయసాధనమైనప్పుడు శ్రమ లేకుండా ధనికుడయ్యే అవకాశముండదు. ధనాన్ని విడిచి వస్తువుకు ప్రాధాన్యమిచ్చి ఆర్థిక సమత్వం సాధించవచ్చు.

10. వానప్రస్థాశ్రమం :— గృహస్థులైన స్త్రీ, పురుషులు ఒక నిశ్చితవయస్సు తర్వాత వాన ప్రస్థాశ్రమ స్వీకారం చేసి శాస్త్రీయంగా లోక శిక్షణ కార్యంలో లగ్నం కావాలి.

11. ఇంద్రియనిగ్రహంతోసంతాననిరోధం:— బ్రహ్మచర్యం ముఖ్యం-విషయలోలుపత్వంతో సంస్కారహీనమైన అమాన వీయత మాతృత్వానికవమానం. అది సమాజాన్ని పౌరుష హీనం చేస్తుంది. దుష్టసాహిత్య బహిష్కారం సత్సాహిత్య ప్రోత్సాహం అవసరం.

12. ధర్మసమన్వయం:— వేలువేలు మతాల బాహ్యరూ పాలు వేరయినా మూలతత్త్వం దాదాపు సమానమే. మతా లకు పరస్పరవిరోధం లేదు కనక అన్నికలిసి అధర్మాన్ని నిరో ధించాలి. సమన్వయదృష్టి కావాలి. అన్నిటిలోను కనిపించే పంచతత్త్వాలు :— 1 నైతికమైన విలువలయందు ఆస్థ 2 మర ణానంతరంకూడ జీవనంయొక్క అస్తిత్వంలో విశ్వాసం 3 ప్రాణి మాత్రం యొక్క ఏకత్వం-అఖండత్వం అంగీక రించటం 4 ఈ జీవనంలో పరిపూర్ణత సాధించవచ్చుననే నమ్మ కం 5 విశ్వనిర్మాణంవెనుక ఒక వ్యవస్థ, బుద్ధి ఉందని ఒప్పు కోవటం.

13. సామూహికసాధన :— నేను_నా, అనేవి తొలగి సమూ హంగా భౌతికాధ్యాత్మిక నైతికోన్నతి సాధించాలి. అదే సంపూర్ణ యథార్థ సేవ.

14. అధ్యాత్మవిజ్ఞాన సమన్వయం :— నేటి మానవుడు మనస్సుతో పైకిలేచి స్థితప్రజ్ఞత వైపు పెరగటానికి అధ్యాత్మ విజ్ఞానాల రెంటియొక్క ప్రేరణ అవసరం. విజ్ఞాన క్రియాశక్తి అధ్యాత్మమార్గదర్శనంలో లోకకళ్యాణకారి అవుతుంది. విశ్వాత్మైక్యదృష్టి అధ్యాత్మం. గుణధర్మాల తటస్థ దర్శనం విజ్ఞానం.

15. కూలిపని రంగంలో బ్రహ్మవిద్య :— 1. విరోధం లేని బ్రతుకుతెరువు, 2. స్పర్ధలేని పారిశ్రామిక వ్యవస్థ, 3. శ్రమ మీద ఆధారపడిన సమానత-స్నేహం. 4. త్యాగమూలక పరస్పరావలంబనం, 5. నిరాడంబరత 6 వివేకయుక్తమైన సంపద. 7. సమాజక్షేమం దృష్ట్యా వ్యక్తిగత నిశ్చింతభావం. అనేవి నెలకొల్పటానికి శ్రమక్షేత్రంలో బ్రహ్మవిద్యా ప్రవేశం అవసరం.

16. భూదానం :— భూమి గోపాలుడిది. భూమిహీనులను సోదరులుగా భావించి భూదానం చెయ్యాలి. దానం భిక్ష కాదు. దీక్ష.

17. గ్రామదానం :— ఈశ్వర ప్రతి రూపమైన గ్రామానికి తనకున్నది దానం చేసి గ్రామాన్ని తన కుటుంబంగా చేసుకోవటం. గ్రామనిధి ఏర్పరచి బాలవృద్ధులకు నిరుద్యోగులకు తోడ్పడి గ్రామ నిర్మాణ కార్యక్రమాలు నిర్వహించాలి.

18. సంపత్తిదానం :— అన్ని తరగతులవారు తమ ఆదాయంలో కొంతదానం చేసి సర్వోదయ సమాజస్థాపనకు తోడ్పడటం.

19. బుద్ధిదానం :— మేధావులు తమ సేవలు గ్రామానికి చెందేటట్లుచేస్తే వారి కుటుంబ పోషణ భారం గ్రామం వహిస్తుంది. వీరు గ్రామమార్గదర్శకులు. వీరికి వేతనం కాక గౌరవం నిశ్చింతత లభిస్తాయి.

20. కూపదానం :— ధనవంతులు వివాహాదులలో అధిక వ్యయం తగ్గించి ఒక్కొక్కనుయ్యి చొప్పున త్రవ్వించి దేశ పురోభివృద్ధి సాధించవచ్చు. ఇది చిన్ననీటి వనరుల ప్రణాళిక.

21. ఉపవాసదానం— ఆర్థికవ్యవస్థకిది పవిత్రమైన ఉపాయం. దాత నెలకొక రోజు ఉపవాసంచేసి దానివల్ల మిగిలిన సొమ్ము సంవత్సరానికొక మొత్తంగా ఇచ్చి తగిన సేవాకార్యక్రమాలు నడిపించవచ్చు.

22. సూత్రాంజలి :— బాపూజీ చరఖా - మంత్రద్రష్ట. ఆయన స్మృతిచిహ్నంగా ఫిబ్రవరి 12 వ తేదీని ప్రతివారు తమ చేతితో వడికిన నూలు చిలప (ఒక వెయ్యిమీటర్లు) సర్వోదయ కార్యాని కర్పించాలి.

23 సర్వోదయపాత్ర :— ప్రతి యింట ఒక్క పాత్ర పెట్టి ఆయింటి చిన్నబిడ్డచేత అన్నం తినేముందు అందులో గుప్పెడు వడ్లువేయించాలి. అది సర్వోదయ కార్యార్థం సమర్పితమవుతుంది. శిశువుకి దానంచేసి భోజనంచేసేసంస్కారం అబ్బటం - సేవకుడికి జీవిక.

24. గ్రామస్వావలంబనం :— పూర్వవృత్తుల పునరుద్ధరణ, క్రొత్తవృత్తులు నెలకొల్పటం, సరిపడ ఆహారధాన్యం గ్రామంలో ఉంచి మిగిలినదే ఎగుమతిచేయటం, ముడిసరుకు ఎగుమతి చేయకపోవటం.

25. వ్యసనముక్తి :— మద్యం, పొగాకు, కాఫీ టీలు, వంటి వాటివాడకం నుండి దేశానికి ముక్తి కలిగించటం. వీటి వ్యాపారం మానవత్వానికి ద్రోహం-వీటివల్ల వచ్చే ఆదాయం వాడటం అవినీతిమయం.

26. స్వాస్థ్యస్వావలంబనం :— పరిమితాహారం, ఉచితశ్రమ, విశ్రాంతి, ఆరోగ్యనియమపాలన, మనోనియంత్రణ, ఔషధ నిర్మాణశాల ప్రతి గ్రామంలో ఉండటం. రోగాలు రాకండా చూసే బాధ్యత వైద్యుడు వహించాలి.

27. కోర్టులు :— గ్రామధనం, గ్రామ సమైక్యం, గ్రామ గౌరవం, ఉత్కృష్ట గ్రామ సంస్కృతి, రక్షించటానికి గ్రామంలో తగువులు గ్రామంలోనే పరిష్కరించుకోవాలి.

28. అశ్లీలమైన పోష్టర్ల నిషేధం :— ఈ పనిని తెలిసిన పెద్ద వాళ్ళు సంఘటిత ప్రయత్నంతో జరపాలి. వీటివల్ల చిన్న పిల్లల మనస్సులు చెడతాయి. ఇవి కుసంస్కారానికి మూలం.

29. సర్వోదయమేళా :— ప్రతి సంవత్సరం సర్వోదయ కార్యకర్తలు గాంధీజీ అస్థినిమజ్జనం జరిగిన చోటల్లా ఫిబ్రవరి 12వ తేదీని జరిపే సమ్మేళనం. వ్యయభారం లేకుండా కార్యక్రమాలు చర్చించుకోవాలి.

30. లోకయాత్ర :— సమాజ గతదోషాలు తొలగించుకోవటం, శక్తి ప్రేమల అఖండధార పెంచుకోవటం, అనేవి మనిషి మనిషికీ కలిగించటానికి ప్రాచీన సాధువుల మార్గంలో నిరంతర పాదయాత్ర.

31. ఇంటింటా సర్వోదయ సాహిత్యం :— సర్వోదయ సాహిత్య గ్రంథాలయం కనీసం ప్రతి వంద గ్రామాలకు ఒక్కటైనా ఏర్పరచి అది ప్రతి గ్రామానికీ ఉపయోగపడేలా చూడాలి. అది గ్రామస్థులకు వినిపిస్తూ ఉండటం ప్రపంచ ప్రధాన విషయాలు పరిచయం చేసే పత్రిక నడిపి అది లక్ష కుటుంబాల కందజేయటం.

32. నిత్యనూతనవిద్య :— యోగం, ఉద్యోగం పరిశ్రమ సహయోగం అనే త్రిసూత్ర బద్ధంగా సమాజార్పణ బుద్ధిగల విద్యయే జ్ఞానకర్మ భక్తుల సమన్వయానికి సమాజసేవా సంస్కారానికి ఆధారం— నిత్యనూతన పరివర్తనశీలమైన జీవనం నిర్మించుకోవటానికి నిత్యనూతనవిద్య కావాలి.

33. లోకనీతి— సకల జనాభిప్రాయంతో సమాజసంచాలనం లోకనీతి. దేశసేనమీద కేంద్రప్రభుత్వపు టంకుశం-ప్రభుత్వాల

మీద ప్రజల అంకుశం - ప్రజలమీద సర్వకళ్యాణకరమైన ఆలోచన యొక్క అంకుశం ఉండాలి. "టాక్సు"కు బదులు దానం, దండనకు బదులు శిక్షణ, కాఠిన్యానికి బదులు ప్రేమ ఇవి శాసననీతికి అంగాలు కావాలి.

**34.** సత్యాగ్రహ సౌమ్యప్రక్రియ :— సమయానుకూలంగా సత్యాగ్రహంయొక్క ఆకారవికారాలు భిన్నభిన్నంగా ఉండవచ్చు. అది ఉత్తరోత్తరా సౌమ్యం, సౌమ్యతరం, సౌమ్యతమం అయినప్పుడే పనికివస్తుంది. శుద్ధసత్యోపాసన చేయగలవాడే సత్యాగ్రహి కాగలడు.

**35.** ట్రస్టీషిప్ :— యజమాని—పనివాళ్ల సంబంధం పితాపుత్ర సంబంధంలా ఉండాలి. తగినసమయంలో ఉత్తరాధికారం (వారసత్వం) అప్పగించటానికి సంసిద్ధత ఉండాలి. ప్రైవేటు—ప్రభుత్వరంగాలకు సమన్వయసాధన ఉండాలి. అదే వర్గభేదంతొలగిస్తుంది.

**36.** పంచశక్తి సహకారం :— 1 జనశక్తి 2 విద్వజ్జనశక్తి 3 మహాజనశక్తి 4 సజ్జనశక్తి 5 శాసనశక్తి ఈ పంచశక్తుల సహయోగం (కలయిక) శాంతి సౌహార్దమయ సమాజ స్థాపనకు ముఖ్యం.

**37.** ఆచార్యకుల్ :— పార్టీలకు, వర్గాలకు దూరంగా ఉండే నిర్భయులు నిర్వైరులు, నిష్పక్షపాతులు అయిన విద్వజ్జనుల మృదువైన సంస్థ ఒకటి ఏర్పాడాలి. అది సామయిక తీవ్ర

సమస్యల విచార విమర్శచేసి తగిన పరిష్కారం చేస్తూ తట స్థంగా ఉండాలి.

38. స్త్రీశక్తి-జాగరణం (మేలుకొలుపు) :— త్యాగ, సేవా సమాన, సౌహార్దాలు సహజ విశిష్ట గుణాలుగాగల స్త్రీసమాజం నేడు దాస్య, విలాస కామనా, లోభవృత్తులు కారణంగా నిర్బ లమైపోయింది. అది తొలగించి ఆధ్యాత్మిక మాతృశక్తి విక సింపజేస్తూ ఆమె సద్గుణలాభం సమాజంలో శాంతిరక్షణకోసం ఉపయోగపరచటం అవసరం. లోభం, కామం, హింస, పెరగ కుండ అరికట్టే ఉపాయమిదే.

39. ఖాదీమిషన్ :— ఖాదీ అహింసాత్మక విప్లవసాధన కావాలి. గ్రామస్థులు గ్రామస్వరాజ్యంకోసం ప్రయత్నశీలు రైనప్పుడే ఇది సాధ్యం. ఈ దృష్టితో గ్రామోద్యోగ కేంద్రా ల్ని శక్తికేంద్రాలుగా పరివర్తించి "మిషనరీ" వృత్తిగల ఖాదీ సేవకుల్ని తయారుచెయ్యాలి.

40. శాంతిసేన :— ఇది ఒక ఆధ్యాత్మిక సాధన. అశాంతి తరువాత చేసే సేవగాని అశాంతి శమనంగానికాదు. అశాంతి యొక్క మూలాన్ని నిర్మూలించటంలోనే శాంతిసేనయొక్క సార్థక్యముంది.

41. అంతర్రాష్ట్రీయశాంతిసేన :— యు. ఎన్. ఓ. బలం నైతికబలం. అందుచేత దానిదగ్గఱ సాయుధ సైన్యానికి బదులు శాంతిసేన ఉండాలి. అప్పుడు ఐక్యరాజ్యసమితి ఇంత

కంటె (చాలరెట్లు) అధికశక్తిమంతమవుతుంది. శాంతిసేనలో సంఖ్యామహత్త్వంకాక హృదయమహత్త్వముంది.

42. దేవనాగరిలిపి :— దేవనాగరి "కోనేటిక్"లిపి. అన్ని భాషలు తమ తమ లిపులకు సహలిపిరూపంలో దీన్ని స్వీకరించవచ్చు. నాగరిలిపిలో ఒక సర్వభాషాకోశం (Dictionary of all languages) తయారుకావాలి. దే వ నా గ రి సర్వనాగరి కావాలి.

43. ఎ. బి. సి. మహాసంఘం :—ఎ = అఫ్గానిస్థాన్, బి = బర్మా, సి = సిలోన్ (శ్రీలంక) లను బలిష్ఠం చెయ్యాలి. ఈ మూడు బిందువులమధ్య దేశాల మహాసంఘం ఏర్పడాలి.

44. జయజగత్ :— ప్రపంచం ఒక రాజ్యమవాలి. నేటి రాజ్యాలు ఆరాజ్యరాష్ట్రాలు కానాలి. నేటి రాష్ట్రాలు — జిల్లాలు, జిల్లాలు-గ్రామాలు, కుటుంబాలు—కావాలి. నేటి రాష్ట్రీయమానవుడు విశ్వమానవుడు కావాలి.

****
****

# వి ను స్మృ తిః

## వినోబా వ్రాసిన శ్లోకాలు :—

(ఆయనే చమత్కారంగా దీన్ని వినుస్మృతి అన్నారు)

1. యో వర్ణాశ్రమ నిష్ఠావాన్। గోభక్తః శ్రుతిమాతృకః।
మూర్తించ నావజానాతి సర్వధర్మ సమాదరః॥
ఉత్ప్రేక్షతే పునర్జన్మ తస్మాన్మోక్షణ మీహతే
భూతాను కూల్యం భజతే సవై హిందు రితిస్మృతః॥
హింసయాదూయతే చిత్తం తేన హిందురితీరితః॥

9_7_49

— వర్ణాశ్రమనిష్ఠతో గోభక్తుడై వేదాన్ని తల్లిగా భావించి మూర్తి నవమానించక సర్వధర్మ సమాదరం కలవాడై పునర్జన్మ ఉన్నదనుకొంటూ, దాని నుండి విముక్తిని కోరుతూ భూతదయ కలిగి ఉన్న వాడు హిందువనబడతాడు. హింసచూచి మనస్సులో వ్యాకుల పడేవాడు హిందువు.

2. వేదవేదాంత గీతానాం వినునా సార ఉద్ధృతః।
బ్రహ్మసత్యం జగత్ స్ఫూర్తిః జీవనం సత్యశోధనం॥

30_9_51

— వేదవేదాంత గీతలసారం ఉద్ధరించి వినోబా బ్రహ్మ సత్యమనీ, జగత్తు స్ఫురించేదనీ (ఆభాస) జీవనం సత్య శోధనమనీ చెప్పుతున్నారు.

3. ఓంతత్ సత్ శ్రీనారాయణతూ—ఇత్యాదినామమాలా
19—1—52

4. వేదాంతో విజ్ఞానం విశ్వాసశ్చేతిశక్తయస్త్రిసః।
యాసాంస్థైర్యే నిత్యాంశాన్తి సమృద్ధీ భవిష్యతో జగతి ॥
16—8—68

— వేదాన్తం, విజ్ఞానం, విశ్వాసం అని మూడు శక్తులు. వాటికి స్థైర్యం చేకూరితే జగత్తులో నిత్యం శాన్తి సమృద్ధులు కలుగుతాయి.

5. కాల జారణమ్—స్నేహసాధనమ్
కటుక వర్జనమ్—గుణనివేదనమ్ ॥
20—10—71

— కాలం గమనించటం—స్నేహం సాధించటం—కటుత్వం విడవటం—సుగుణ కథనం.

# జీవనం సత్యశోధనం

## వినోబా జీవితంలో ప్రముఖ ఘట్టాలు–కొన్ని–

| | |
|---|---|
| 11–9–1895 | గాగోదా (కులాబా, మహారాష్ట్ర) లో జననం. తొమ్మిదేళ్ళవఱకు నాయనమ్మ, తాతలచేతు లలో పెరగటం. |
| 1903 | ఎనిమిదేళ్లవయస్సులో జ్ఞానేశ్వరీ అధ్యయనం. |
| 1905 | బరోదా (గుజరాత్)లో పదేళ్లవయసులో బ్రహ్మచర్య నిశ్చయం. దేశసేవాసంకల్పం. |
| 1913 | మెట్రిక్ ఉత్తీర్ణత |
| 1914 | విద్యార్థిమండల్ స్థాపన |
| 25–3–1916 | బ్రహ్మజిజ్ఞాసతో గృహత్యాగం-కాశీనివాసం- అధ్యయనాధ్యాపనాలు - గాంధీజీతో ఉత్తర ప్రత్యుత్తరాలు మొ॥ |
| 7–6–1916 | గాంధీపిలుపుననుసరించి కొచరబ్ ఆశ్రమ ప్రవేశం-కొచరబ్ ఆశ్రమానికి సబర్మతీ స్థానాంతరం |
| 1916–17 | గాంధీనుండి ఒక సంవత్సరం సెలవు - దర్శన గ్రంథాధ్యయనం. గీతాప్రవచనాలు చేస్తూ మహారాష్ట్ర భ్రమణం |

| | |
|---|---|
| 6-3-1917 | లోకమాన్య తిలక్ ప్రథమ సందర్శనం |
| 24-10-1918 | మాతృ వియోగం (ఆమె వయస్సు 42 సం॥) వేదాధ్యయనారంభం, విద్యార్థిమండల్ మిత్రులతో సబర్మతీ ఆశ్రమంలో నిమగ్నత. |
| 8-4-1921 | సత్యాగ్రహాశ్రమ — వర్ధాశాఖ స్థాపన (మగన్‌వాడీ వద్ద) |
| జనవరి నుండి ఏప్రిల్ వరకు 1923 | "మహారాష్ట్ర ధర్మ" అనే మాసపత్రికలో ఉపనిషత్తుల మీద వ్యాస రచన. |
| 1924 | ఆశ్రమంలో నూలు తీయటం నేయటం అనే విషయాల మీద వైజ్ఞానిక ప్రయోగ - పరిశోధన కార్యక్రమం - జాతీయైక్యత కోసం గాంధీజీ చేసిన 21 రోజుల ఉపవాస సమయంలో ఢిల్లీలో గాంధీజీ యొద్ద. |
| 7-12-1928 నుండి 13-3-1931 | వార్ధా మహిళాశ్రమంలో అధ్యాపనాది కార్యక్రమం చూచుకొంటూ గీతకు మరాఠీ పద్యానువాదం ("గీతాయీ" రచన) |
| 21-2-1932 19-6-1932 | ధూలియా జైల్లో ప్రతి ఆదివారం గీతా ప్రవచనం. |

| | |
|---|---|
| 25-12-32 | వర్ధాకు రెండు మైళ్ళలో ఉన్న "నాల్ వాడీ" హరిజన బస్తీలో నివాసం ప్రారంభం. ఏకా. దశ వ్రతమాలా రచన. |
| 26-7-1933 | సాబర్మతీ ఆశ్రమం విసర్జింపబడింది. |
| 18-5-1936 | వర్ధాలో "మహారోగీ సేవామండల్"(దత్తపుర్) స్థాపనకు ప్రేరణ : కుష్ఠరోగి సేవాక్షేత్రంలో ప్రధమ భారతీయ సంస్థ ఆరంభం. |
| 7-3-1938 | "సన్యస్తం మయా" అని మూడుసార్లు ఉచ్ఛ రించి గాంధీజీ ఆదేశానుసారం ఆరోగ్యంకోసం పవనార్ రాక. |
| 17-10-40 నుండి 3-12-41 | వ్యక్తిసత్యాగ్రహానికి ప్రథమ సత్యాగ్రహిగా గాంధీజీ ప్రకటించటం. మూడుసార్లు శిక్ష - క్రమంగా 3 నెలలు 6నెలలు, ఒక సంవత్సరం. స్వరాజ్యశాస్త్రపుస్తకరచన |
| 9-8-1942 | క్విట్ఇండియా ఉద్యమంలో జైలు 9-7-45 వఱకు. దక్షిణాది భాషలు నాలుగు, లిపులతో సహా అధ్యయనం. నాగరిలిపి సంశోధనకోసం- పరిశోధన. ఈశావాస్యవృత్తి-స్థితప్రజ్ఞదర్శన్- రచన |

| | |
|---|---|
| 2-4-1946 | పవనార్‌కు మూడు మైళ్లలో ఉన్న "సురగాం"లో ప్రతిరోజు ఉదయం (వర్షం వస్తున్నా సరే) జరిపిన పాకీపని ప్రారంభం. |
| 15-8-1949 | సర్వోదయ మాసపత్రిక ప్రారంభం — సంపాదకత్వం. |
| 1-1-1950 | పవనార్ పరంధామాశ్రమంలో సహచరులతో బాటు కాంచనముక్తి ప్రయోగం. "ఋషి ఖేతీ" ప్రారంభం. |
| 7-3-1951 | సర్వోదయయాత్రా ప్రారంభం. |
| 7-14 ఏప్రిల్ 51 | శివరాంపల్లి (ఆంధ్ర)లో సర్వోదయ సమ్మేళనంనిమిత్తం నివాసం "అంతశ్శుద్ధిర్బహిశ్శుద్ధిః శ్రమః శాంతిస్సమర్పణం" అనే పంచవిధ కార్యక్రమ ప్రస్తావం. |
| 15-4-51 | శ్రీరామనవమినాడు అశాంతి నివారణార్థం తెలంగాణా పదయాత్ర ప్రారంభం. |
| 18-4-51 | పోచంపల్లి (తెలంగాణా)లో శ్రీరామచంద్ర రెడ్డిచేసిన ప్రథమ భూదానం. |
| 19-4-51 | భూదానయాత్ర - భూదానయజ్ఞప్రారంభం. (రెండునెలల ఒక వారం రోజులలో 12000 ఎకరాల భూమి లాభించింది) |

23-5-52 మంగరోఠ్ (ఉత్తరప్రదేశ్) యొక్క ప్రథమ గ్రామదాన ప్రకటన.

23-10-52 సంపత్తిదాన భావప్రకటన (గాంధీజీ చెప్పిన ట్రస్టీషిప్ సిద్ధాంతంయొక్క వ్యాపకరూపం.)

1-10-55 ఆంధ్రప్రవేశం - మౌనప్రార్థన - సామూహిక ధ్యానం - ప్రారంభం.

9-7-56 పాండిచేరీ - అరవిందాశ్రమం - మాతాజీ ఆశీర్వాదం. **you live for devine ; work for devine : Aspire for Devine.** (మీరు దివ్యతకోసం జీవిస్తున్నారు. పనిచేస్తున్నారు. దివ్యతకోసమే ఉత్కంఠితులై యున్నారు.)

15-3-57 కన్యాకుమారి - గ్రామస్వరాజ్య ప్రతిజ్ఞ, సంకల్పము.

8-13 మే 57 కాలడి (కేరళ) సర్వోదయ సమ్మేళనం - శంకరాచార్యుల ప్రకరణ గ్రంథసంకలన - ప్రచురణ.

13-8-57 మంజేశ్వరమ్ (కేరళ) శాంతిసేనాస్థాపన.

1-3-59 మరపురానిఘట్టం - అజమేర్ "దర్గాశరీఫ్" లోనికి మహిళలతోపాటు ప్రవేశం - సర్వధర్మప్రార్థన.

2-6 ఆగష్టు 59 శ్రీనగర్-రాజనీతి — విజ్ఞానం = సర్వనాశం
అధ్యాత్మం + విజ్ఞానం = సర్వోదయం

12-5-1960 పినహాట్ (భింద్ - మధ్యప్రదేశ్) చంబల్ ఘాటీ ప్రవేశం.

5-3-1962 లీలాబారీ (అస్సాం) మైత్రీ ఆశ్రమస్థాపన.

5-9-1962 తూర్పు పాకిస్తాన్ ప్రవేశం "ఇ ష్టి తా హ్" ద్వారం తెరవబడింది. మొదటిరోజునే భూదాన ప్రాప్తి. దాని వితరణ.

20-9-1962 పాకిస్తాన్ యాత్రా సమాప్తి (అంతిమ) దినం. "అల్లా" ఒక్కడు. మానవుడూ ఒక్కడే. జాతి, ధర్మ, సిద్ధాంత, దేశములనే వాటి అన్నిటి కంటె మానవత్వం శ్రేష్ఠమైనది.

10—20 ఏప్రిల్ 64 బ్రహ్మవిద్యామందిర్. పవనార్ '13 సం॥ 3నె॥ 3రో॥ తరువాత భరత్‌రామ్ దర్శనం-బ్రహ్మ విద్యామందిర స్థాపన తర్వాత మొదటిసారిగా రాక.'

9-6 నుండి 3-11-1964 విషమ జ్వరం కారణంగా పవనార్ బ్రహ్మ విద్యా మందిరంలోనే దీర్ఘ నివాసం.

14—11—64 నుండి బ్రహ్మ వి ద్యా మందిరనివాసం. అకర్మ యోగం, వేదాంతసుధ, మనుశాసనం, వి:

| | |
|---|---|
| 9-7-1965 | యాంజలి, గురుబోధసార గ్రంథాల సంకలనం |
| 12-17 ఫిబ్రవరి 65 | భాషావివాదాలు కారణంగా ఉపవాసం. త్రిభాషాసూత్రం అమలుజరపటానికి అందరు ముఖ్యమంత్రులు మాట యిచ్చిన (తరువాత) మీదట సమాప్తి. |
| 14-12-65 | జెంషెడ్‌పూర్ - లాల్ బహదూర్ శాస్త్రీజీతో (ఆయన తాష్కెంటు వెళ్లకపూర్వం) చివరి సమావేశం. రుగ్మతవల్ల సుమారు మూడునెలల నివాసం. భాగవతధర్మమీమాంసావివేచన. |
| 7-6-66 | రాణీపతరా (పూర్ణియా - బీహార్) 50 సం॥ సేవాకార్యం గాంధీజీకి సమర్పించి స్థూల ప్రవృత్తులనుండి విముక్తి - సూక్ష్మకర్మ - యోగారంభము. ఉత్తరప్రత్యుత్తరాలు బంద్. వ్యక్తినిర్ణయానికి బదులు సామూహిక నిర్ణయం పాటించుమని సహచరులకు ప్రేరణ. |
| 7-8 డిసెంబరు 67 | పూసారోడ్ (బీహార్) విద్వజ్జనపరిషత్తు - విశ్వవిద్యాలయ ప్రాచార్యులు - ఉపకులపతులు (Vice-chancellors) మంత్రులు విద్యావేత్తలు సమావేశమైన సభలు. |

ఒకటి అశాంతి దమనవిభాగం - మరొకటి అశాంతి శమనవిభాగం - మొదటిది పోలీసు

విభాగమంటాము. రెండవది శిక్షా విభాగం. "ఈవిద్యావిభాగం (శమనవిభాగం) సమర్థమై ఉంటే దమనవిభాగం అవసరమే లేదు" అన్నారు.

26-10-68 బోధగయ - ఋగ్వేదసార సంకలన సమాప్తి.

15-7-1969 రాంచీ - అష్టాదశీ (పద్దెనిమిది ఉపనిషత్తుల) సంకలన సమాప్తి.

23-9-70 బ్రహ్మవిద్యా మందిరంలో స్థిరనివాస నిర్ణయం

17-10-70 క్షేత్రసన్న్యాస సంకల్ప ప్రకటన.

11-7-74 జయప్రకాశ్ జీతో సమావేశం.

15-8-74 సంతకం చేయటానికి బదులు "రామహరి" అని వ్రాయటం మొదలైంది.

13-12-74 ఒక సంవత్సరంపాటు మౌన సంకల్పం.

25-12-74 గీతా ప్రతిష్ఠానం తరఫున ప్రథమ గీతా ప్రచార సమ్మేళనం. (గీతా జయంతి + ఈద్ — క్రీస్తు జయంతి) మౌన ప్రారంభం.

13-3-75 సర్వసేవా సంఘంతో అభిప్రాయ భేదాలు — సర్వసేవా సంఘ మౌన ప్రకటన — ప్రబంధ సమితికి త్యాగపత్రం.

14-3-75 మౌనభంగంచేసి జయప్రకాశ్ జీతో సంభాషణ.

6-9-75 న్యూమోనియావల్ల తీవ్రమైన అస్వస్థత.

7-9-75 సమాచారం తెలుసుకోవటానికి శ్రీమతి ఇందిరాజీ రాక.

25-12-75 ఖూరజన్ జయంతీ సమారోహ్ ఒక సంవత్సరం పాటించిన మౌనం సమాప్తి. అను శాసన శబ్ద స్పష్టీకరణం. నిర్భయమూ, నిర్వైరమూ, నిష్పక్షపాతమూ అయినది, ఆచార్యులుచేసేది అనుశాసనం. శాసనం ప్రభుత్వం చేసేది.

25-2-76 శ్రీమతి ఇందిరాజీతో సమావేశం-గోహత్యా నిషేధం నిమిత్తం నిర్వాణీశబ్దం.

29-5-76 జన్మదినమైన 11-9-76 నుంచి గోహత్యా నిషేధార్థం ఆమరణ నిరాహారదీక్షా సంకల్పం.

30-6-76 సర్వోదయ కార్యకర్తల సభలో సర్వసేవా సంఘాన్ని విడిచిపెట్టుమని సలహా.

22-4-79 గోహత్యా నిషేధం నిమిత్తం, ఉపవాస ప్రారంభం "ఆరబ్ధంజయజగత్"

26-4-79 గం: 3-00 ప్రధానమంత్రి మొరార్జీదేశాయి పార్లమెంటులో (రాజ్యాంగంలో మార్పు తేవటానికి సిద్ధమైనట్లు' మాటయిచ్చినమీదట గం. 4-50 ని. ఉపవాససమాప్తి.

7-10-80 గీతాయీ మందిర ప్రారంభం.

28-8-81 బాలకోబా మరణం.

11-1-82 "ఈ దేశంలో ఏ వయస్సులో ఉన్న ఆవులనైనా ఎద్దులనైనాగాని చంపరాదు" అని దేవనార్ (బొంబాయి)లో సత్యాగ్రహ ప్రారంభం.

4-11-82 జ్వరం వచ్చింది.

5-11-82 రాత్రి గం. 8-30 ని. లకు హార్ట్ ఎటాక్.

8-11-82 దాదాపు ఆరోగ్యం బాగా కుదుటపడింది.

8-11-82 రాత్రి గం. 10-30 ని. నుంచి ఆహార జలౌషధ పరిత్యాగం.

15-11-82 బ్రహ్మనిర్వాణం.

18-11-82 బాబాకుటీలో అస్థిస్థాపన.

వినోబా విరచిత—

## సర్వ ధర్మ ప్రార్థన

ఓం తత్ సత్ శ్రీ నారాయణతూ, పురుషోత్తమగురుతూ ।
సిద్ధబుద్ధతూ, స్కన్దవినాయక, సవితా, పావక తూ ॥
బ్రహ్మ, మజ్దతూ, యహ్వా, శక్తితూ, ఈశు—పితా ప్రభు తూ ।
రుద్ర, విష్ణుతూ, రామ, కృష్ణతూ, రహీమ్, తావోతూ,
వాసుదేవ, గో—విశ్వరూపతూ, చిదానన్ద, హరి తూ ।
అద్వితీయ తూ, అకాల, నిర్భయ, ఆత్మలింగ, శివ తూ ॥

ఏకాదశవ్రత—

అహింసా, సత్య, అస్తేయ, బ్రహ్మచర్య అసంగ్రహ ।
శరీరశ్రమ, అస్వాద, సర్వత్ర భయవర్జన ॥
సర్వధర్మసమానత్వ, స్వదేశీ, స్పర్శభావనా ।
వినమ్రవ్రతనిష్ఠాసే యే ఏకాదశసేవ్యహైఁ ॥



# ఉపయుక్త గ్రంథాలు - పత్రికలు

1. ఋషి వినోబా (హిందీ) శ్రీమన్నారాయణ్
2. వినోబా—వ్యక్తిత్వ ఔర్ విచార్ (హిందీ) సస్తాసాహిత్య మండల్; నయీఢిల్లీ.
3. వినోబాకీ జ్ఞానగంగా (హిందీ) డా॥ జ్ఞానవతీదర్బార్
4. తృతీయ శక్తి—ఆచార్య వినోబా
5. గీతాయోగం (సితప్రజ్ఞ దర్శనం) — ఆచార్య వినోబా
6. ఆంధ్ర మహాభారతం—తిక్కన
7. పశ్చిమ గోదావరి జిల్లా — సంకలన—చింతలపాటి సీతా
   భూదాన యాత్రలో రామచంద్ర వరప్రసాద్
   వినోబాజీ ఉపన్యాసాలు మూర్తిరాజ్, ఎం.ఎల్.ఏ.
8. Vinoba and his Mission — Suresh Ram.
9. బాబా వినోబా (హిందీ) శ్రీ కృష్ణదత్తభట్ట — సర్వ సేవా సంఘ ప్రకాశన్ రాజఘాట్—వారాణసీ.

1. ఆచార్యకుల్ (హిందీ) డిసెంబరు 82,
   — శరత్‌కుమార్ సాధక్.
   జనవరి, ఫిబ్రవరి, మార్చి 83 "ప్రత్యేక" సంచికలు.
2. మైత్రీ - బ్రహ్మనిర్వాణ - విశేషాంక్ డిసెంబరు 82
   (హిందీ మాసపత్రిక) ఇతర మైత్రీసంచికలు —పౌనార్

3. "Sunday" (Weekly-English) 28 Nov.-82 to 4 Dec. 82.

4. నవభారత్ (హిందీ డెయిలీ) 17_11_82 పేజీ 4.
[ప్రొ: విద్యాధర్ ఉమాశే_వార్తా.]

5. ఆంధ్రపత్రిక 13_2_83 తెలుగు దిన పత్రిక

6. ఈనాడు 13_2_83, 3_4_83 "

7. ఆంధ్రజ్యోతి 13_2_83 "

8. Geetai Mission and the Versatile Vision of Acharya Vinoba Bhave. His Asram, Pounar.
An essay—By—Praveena Desai.

9. "Gandhi Marg" Dec. 82 Editorial,
— R. R. Diwakar.



—/*/—